శ్రీకన్యకాపరమేశ్వర్యైనమః.

# శ్రీ కన్యకా పురాణము.

## వచన కావ్యము.

ఇది.

స్కాంద పురాణోత్తర ఖండ సనత్సుజాత

సంహితానుసారంబున,

రచించబడి,

పబ్బా బాలకృష్ణయ్య ప్రోత్సాహంబున

శికింద్రాబాదు, హైదరాబాదు, వరంగల్.

తదితర గ్రామ వైశ్య బృంద ద్రవ్య సహాయంబుచే,

శ్రీ రామలింగేశ్వర ముద్రాక్షరశాలయందు, ముద్రింపబడియె,

వరంగల్. వెల, రు. ౧.

శ్రీశుభమస్తు.

శ్రీ కన్యకాపురాణము అనేకగ్రంథములలోనుండి వైశ్యబృందమునకు మహోపకారంబగు నొకగ్రంథంబును తయారుచేసి అనేక గ్రామంబుల వైశ్యబృందముచే చందామూలకముగా నచ్చువేయించబడినది.

వరంగల్ పట్టణ వాసులు. 6039,

౧. కొమరవెల్లి రామలింగంగారి, రాజలింగం.
౨. కొమరవెల్లి సమ్మయ్యగారి, ముసలయ్య.
౩. కొమరవెల్లి కాశయ్య.
౪ భూపతి వీరయ్య.
౫ మెల్లెంకి లింగయ్య
౬ ఆల్లాడి నాగయ్యగారి కేదారి
౭ రవ్వా వెంకయ్య
౮ గుండా ముత్తిలింగం
౯ రాయిని మల్లయ్య
౧౦ గుండా పుల్లయ్య
౧౧ గుండా వీరయ్య

సికింద్రాబాదు వైశ్యబృందము

౧. దుండిగళ్ల కృష్ణయ్యగారి జగదీశ్వరయ్య.
౨. దుండిగళ్ల బాలయ్యగారి కేశవులు.
౩ తెలిదె రామన్న
౪ పొద్దుటూరి వీరన్న
౫ కైలాస శరభయ్య
౬ తుమ్మాళ్ల కొండయ్య కిరాణందుకాణం
౭ దండు ఆగయ్య, పెంటయ్య.
౮ గుమ్మడవెల్లి లక్ష్మినారాయణ, అనంతపద్మనాభం.
౯ నంబూరి కృష్ణమూర్తి
౧౦ సోమా వీరన్న, బెల్దె జగదీశ్వరయ్య.
౧౧ చిదర దూర్వాసులు, బెజగం వీరన్న
౧౨ అమ్మనబోలు వీరన్న, విశ్వనాథం.
౧౩ చిదరా శాంతయ్య

౧౪ చీకోటి వీరన్న.
౧౫ తోటవీరయ్యగారి ఈశ్వరయ్య.
౧౬ లింగా సుందయ్య.
౧౭ బెజగం వీరన్న, లింగాం సుందరయ్య
౧౮ పుప్పాల పెంటయ్య.
౧౯ పురం వెంకయ్య
౨౦ సముద్రాల మాణిక్యం
౨౧ పొట్టిపల్లి లింగన్న
౨౨ పుప్పాల గంటయ్యగారి వెంకన్న మోండాదుకాణం
౨౩ చందా రాజన్న, మోండాదుకాణం
౨౪ దుందిగళ్ల జగదీశ్వరయ్య, ఆమెట పాపయ్య
౨౫ కొండా లచ్చన్న
౨౬ సింగం లచ్చన్న
౨౭ దండు ఆగయ్య
౨౮ తాళ్లా కోటయ్య బూరుగుచెట్టు బజారు
౨౯ తేలుకుంట కృష్ణయ్యగారి జగ్గయ్య.
౩౦ క్యాసా చంద్రయ్య
౩౧ మాసెట్టి వెంకన్న, కంచరి దుకాణం.
౩౨ బూరుగు నాగయ్య, రాజన్న.
౩౩ చలువాది కోటిలింగం
౩౪ చిదరా కాంతయ్య దూర్వాసులు.
౩౫ కాటిరామన్న
౩౬ తాడికొండ లక్ష్మయ్యగారి రామలింగం.
౩౭ సోమా లక్ష్మయ్యగారి బాలరాజయ్య, ఈశ్వరయ్య.
౩౮ ఆనాచి హనుమయ్య
౩౯ కాటకి కృష్ణయ్య
౪౦ మదూరి రాజయ్య జనరల్ బజారు
౪౧ పుపలంచి యల్లయ్య

౪౨ కొడితేల చంద్రయ్య
౪౩ గుండా భూమన్న, ఈశ్వరయ్య.
౪౪ మాసేపల్లి ముత్తయ్య.
౪౫ అడ్డగూళ్ల రామయ్య
౪౬ సుద్దాల నారాయణ
౪౭ సంతాపురపు శివ్వయ్య
౪౮ అమ్మనబోలు నాగయ్య పొద్దుటూరి వీరన్న.
౪౯ చిదరా నరసిములు
౫౦ గుండా సంగయ్య
౫౧ బొజ్జా లక్ష్మీనారాయణ
౫౨ కొంజర్ల రామన్న
౫౩ గట్టులక్ష్మన్న
౫౪ రుద్రంగి నరసిములు.
౫౫ వంగపల్లి వీరన్నగారి నీలకంఠం
౫౬ పెద్ది లక్ష్మయ్య బేగంపేట
౫౭ మాచర్ల వీరన్న
౫౮ మడిపల్లి ఆగయ్య
౫౯ వుప్పల బసవయ్య.
౬౦ బచ్చు రాఘవయ్య.
౬౧ గందె లింగయ్య
౬౨ బొచ్చు లింగన్న.
౬౩ మరుమాముళ్ల వెంకన్న
౬౪ బొజ్జా మొగయ్య, తెలుకుంట రాజయ్య.
౬౫ జూలూరి వెంకటేశం.
౬౬ సింగం వీరయ్యగారి వెంకయ్య.
౬౭ రాచూరి లింగమూర్తి, చంద్రయ్య.
౬౮ తేర్ల అన్నయ్య. నారాయణ.
౬౯ మరిపల్లి మాణిక్యం
౭౦ మందిగళ్ల కృష్ణయ్య జగదీశ్వరయ్య గద్వాల దుకాణం.

౨౧ కాచం శివ్వయ్య, కొండితాల నరసిములు.
౨౨ వుడతా యెల్లయ్య
౨౩ వుప్పులయెల్లయ్య
౨౪ సముద్రాల నరసిములు
౨౫ కోకల వెంకన్న
౨౬ పెనుసాని ముత్తయ్య
౨౭ పురం నాగన్న
౨౮ ఘట్టిపల్లి సంగన్న
౨౯ మదూరి కృష్ణయ్య.
౩౦ వావిలా రాజయ్య. మదూరి కృష్టయ్య
౩౧ కాసెట్టి శంకరయ్య
౩౨ గునిశెట్టి నారాయణ
౩౩ పబ్బా నారాయణ.
౩౪ విట్టా నరసిములు.
౩౫ లోకుల వెంకన్న.
౩౬ దాచ రామయ్య. వీరన్న కిరాణం దుకాణం.
౩౭ మంచిగంటి వెంకయ్య, నరసయ్య, కొండావీరయ్య.
౩౮ లింగా వీరన్న.

హైదరాబాద.

౩౯ దాచేపల్లి, రాజయ్య, బొడ్లా రాఘవులు కిషన్‌గంజు.
౪౦ మిరియాల రామలింగయ్య, యిస్మామియ్యా బజారు.
౪౧ కొండాపురపు లక్ష్మీనరసయ్య, వుస్మానుగంజు,
౪౨ గుబ్బా బుచ్చయ్య, వుస్మానుగంజు.
౪౩ బజ్జూరి లక్ష్మయ్య.
౪౪ పద్మా రామయ్య వుస్మానుగంజు.
౪౫ ఆలూరి రాజన్న, నారాయణ శ్రీరంగారం.
౪౬ కంకణాల దుబ్బయ్య షోతరెడ్డిపేట.
౪౭ పబ్బా బాలకృష్ణయ్య.

శ్రీశుభమస్తు.

# పీఠిక.

సత్ప్రాగ్రేసరులారా!

ఇందువల్ల యెల్లరకు తెలియపఱచడ మేమనగా, శ్రీమత్సమస్త సజ్జన విరాజమానంబగు నీభరతఖండంబునకు జేరిన సికింద్రాబాదు, హైద్రాబాదు, ఓరుగల్లు పురవరంబులను తదితర స్థలంబులయందును నివసించు సత్యనిరతులును, అఖండదానరతులును వస్తుక్రయవిక్రయ సమర్థులగు నూటయిబ్బందిరి నగరమువారనగు వైశ్యబృందములకు విన్నవించున దేమనగా మున్ను శ్రీస్కాంద పురాణోత్తర ఖండమున సనత్సుజాతసంహితయందు వైశ్యుల చరిత్రి చెప్పంబడియె. అట్టి గ్రంథము సంస్కృత భాషయందుండుటచే సాధారణముగ అందరికి నుపయోగింపనిచే కొన్ని ప్రతులు సంపాదించి సంస్కృతమునకంటె నేమాత్రము కథాభాగము కొఱతలేకుండునటుల వచన గ్రంథముగా వ్రాసి అచ్చువేసినారము.

ఈ గ్రంథనిమిత్తము మేము సంపాదించిన సంస్కృత ప్రతులయందెల్ల పాఠభేదంబు గలిగి యుండుటవలన గోత్రప్రవర వ్రాయునప్పుడు ప్రతి గోత్రము అన్ని ప్రతులయందును సమముగా నుండమిచే నయిదారు ప్రతులయందు సమముగానుండు గోత్రములను మాత్రము చక్కగాఁ బరిష్కరించితిమి. వానిలో నెనుబది యారవది యగు ననగుండ గోత్రము మొదలు పదియేడు గోత్రములెల్ల ప్రతులయందును భిన్నపాఠములుగా నుండుటవలన మాకు సరియని తోచిన యొక ప్రతి ప్రకారముగఁ బరిష్కరించి వ్రాసితిమి. సరిపడిన గోత్రములలో గొన్ని వాడుకకు విరుద్ధములుగా నుండుటచే వాని విచారింపఁగా వాడుకయే వ్యత్యస్తమని తెలిసినది. గాన, సంస్కృత గ్రంథానుసారముగా బరిష్కరించితిమి. మిధునకులగోత్ర శ్లోకములలో "మైత్రేయ సద్గోత్రిణామ్" మైత్రేయ ఋషిగోత్రులకు- అను వాక్యమును బట్టి యా మిధునకుల గోత్రము త్ర్యార్షేయ గోత్రమనియు, మద్దికుల మైత్రేయ గోత్రములు ప్రవరగోత్రములనియు వాడెదరు. అది పొరపాటు, గాన నా వాడుక త్యాజ్యార్హము. బలిశిష్టగోత్రమునకు భారద్వాజముని యగుటచే నా గోత్రము భారద్వాజగోత్రమని కొందఱు వాడెదరు. ఆ వాడుకయు ననర్హము. ఉపమన్యకులగోత్రము ద్వ్యార్షేయమని కొన్ని గ్రంథములయందు వ్రాసి యుండుటయుఁ, ద్వ్యార్షేయ గోత్రమను వాడుకయును జక్కగాఁ బరిశీలించి యది ద్వ్యార్షేయము కాదనియుఁ ద్వ్యార్షేయ గోత్రమనియు నాలోచించి వాడుకలో వ్వున లి



ఖించితిమి. గోవృదం ఋషిగాంగల ఋణమపసులు- ఘాంటకుల గోత్రములను బ్రస్త తము కొందరిక్ష్వాకుకుల- ఘాంటకుల గోత్రములని వాడెదరు. ఇది పొరబాటు - ఇక్ష్వాకుకులగోత్రమే కాశ్యపాయగోత్రములలో నొకటియై యున్నది. సంస్కృత గ్రంథపాఠము సరియైనది గాన నట్లు వ్రాసినారము గనుక గోత్రప్రవర కాండకును గ్రంథభాగమునకును వ్యత్యస్తమగుటవలన యుక్తాయుక్తములఁ జక్కఁగా విచారించి వ్రాసి ముగించితిమి,

శ్రీ కన్యకా పరమేశ్వరీ పూజకు మిగుల నుపయుక్తమగునటుల శాస్త్రోక్తముగ నేర్పఱుపఁబడిన యీ క పటమును ముఖ్యములగు మాతుల కన్యావివాహ నిర్ణయ ధ్యానశాసన- దేవీపూజావిధాన- ప్రసన్నస్తుతి- గోత్రప్రవర - వివాహవిధి ఘట్టములయందు సంస్కృత గ్రంథము నపేక్షింపక ప్రమాణశ్లోకముల జనుల నుపయుక్తమగునటుల శ్లోకములను నాయా ఘట్టములయందుఁ జేర్పఁబడి యున్నవి.

వైశ్యోత్తములారా? యిట్లు మిగులఁ గష్టపడి వ్రాయఁబడినదియు కులాచార ధర్మములఁ దెలుపునదియు, నాటియిబ్బంద్రు గోత్రజాలకు వైశ్యులకెల్ల నెంతయు నుపయుక్తంబగునదియు నగు నీ గ్రంథమునందు విశాలకార్యాదరముంచి జులంబువిడిచి కొలుచుగోలు హాసపఁగిద్దు దీనియందలి తప్పులక్షమించి, యొప్పుల గ్రహింతురని పలుతెఱంగులఁ బ్రార్థించుచున్నాఁడను.

ఇట్లు భవద్విధేయుఁడు,

పబ్బా బాలకృష్ణయ్య.



# శ్రీకన్యకాపురాణము.

## విషయసూచిక.

(0)

### మొదటి యుల్లాసము.



### రెండవ యుల్లాసము,



### మూఁడవ యుల్లాసము.



### నాలవ యుల్లాసము.

## —( శ్రీ వాసవాంబాస్తుతి. )—

కం॥ శ్రీ సర్వమంగళాంశను ।
భాసురముగ వైశ్యకులముఁ బాలించుటకై ।
యీసర్వంసహఁ బొడమిన ।
వాసవకన్యం దలంతు వరలినభక్తిన్ ॥

## —( బాలనగర, కన్యానగరస్వాములస్తుతి. )—

తే॥ కన్యకాదేవిచే ధర్మగతులువిన్న ।
బాలనగరులనందఱఁ బరఁగఁదలఁచి ।
కన్నియల నెంతయును బ్రీతి గారవించి ।
నగరస్వాముల కెల్లను నతులొనర్చి ॥





శ్రీవాసవాంబాయైనమః.

# శ్రీకన్యకాపురాణము.

మొదటి యుల్లాసము.



ఇది. వైశ్యమునులు దమ పూర్వవృత్తాంతములను దెలుపుమని సాలంకాయనముని నడుగుటయు అమ్మహాముని యాది శేష ధర్మనందన సంవాదంబును, సృష్టినిర్మాణంబును వైశ్యకులసంభవంబును వారికిఁ దెలియఁజేయుటయుఁ జెప్పఁబడుచున్నది.

శ్రీ భగవత్సృష్టియందుఁ జతుస్సాగర వలయితమగు భూమండలంబున హిమవద్గిరికిని వింధ్యపర్వతమునకును మధ్యగతంబును దేవతాసంచార యోగ్యంబును నగు నార్యావర్తమను ప్రసిద్ధపుణ్యభూమి యొప్పుచుండు; అందు నత్యంత పుణ్యానిలయంబును, మహర్షుల కావాసంబును ఋగ్వేదాది వేగఘోష ఘోషితంబును సాల రసాల తాల హింతాల తమాల తక్కోల చూత పున్నాగ వకుళ తిలకాశోక కాంచన కపిత్థాశ్వత్థ మన్మథ ప్లక్ష మధూక ముఖ్యనానావిధానంత పుష్పఫలభరిత సమస్తవృక్షరాజ రాజవిరాజితంబును నిఖిల నిరయ నిర్మూలనకర్మాలంకర్మీణంబులగు మహానదీ ప్రవాహశోభితంబును నగు నైమిశారణ్యంబుదనరారు ఆయరణ్యమధ్యంబున వేదవేదాంగ వేదాంతసారజ్ఞులును, లోకానుగ్రహకర్తలును, మహాత్ములును దయాపరులును మహాతపస్సంపన్నులును, వల్కలాజినధారులునునగు కశ్యప- నారద- వసిష్ఠ- వామదేవ-గౌతమ- భరద్వాజ- మార్కండేయ- మాండవ్య- మందపాల- మతంగ-గాలవ- సనకస- నందనా, గస్త్య- వాలఖిల్య- మౌద్గల్య- శాండిల్య జాబాలి- దూర్వాసాంగీరస- శరభంగ- పరాశర- వ్యాస-

శుక- శౌనకా- త్రి-వత్స-కుత్స- విశ్వామిత్ర- మైత్రేయ- శ్వేతకేతు- ప్రాజ్ఞ- సుతీక్ష్ణ- తిత్తిరి- వరతంతు- కపిల- చ్యవన- భృగ్వాపస్తంభ- కుద్దాల- జమదగ్ని- కణాద- శతానంద ప్రముఖనిఖిలమహర్షి శ్రేష్ఠులొక్క- యెడంజేరి పవిత్రంబగు నొక్కసత్రంబును జేయుచుండి- యచ్చట నశేష వేదవేదాంగ పారంగదుండును, సకలపురాణేతిహాసమర్మజ్ఞుండును నిఖిలయాగవిధానానూన మేధావిభాసితుండును; మంత్రవేత్తలలో శ్రేష్ఠుండును, భస్మోద్ధూళిత సర్వాంగుండును జటామకుట భూషితుండును, కృష్ణాజినాంబరోత్తరీయ ధరుండును వ్యాఘ్రచర్మ పరిధానుండును దుర్నిరీక్ష్య నిజప్రభారాజిత ప్రభాకర తేజస్కుండును సాక్షాదీశ్వర స్వరూపుండునునగు శౌనకమహర్షింజూచి ప్రదక్షిణపూర్వకంబుగ సాష్టాంగ దండప్రణామంబులాచరించి యర్ఘ్యపాద్యాది సత్కారంబులనొసంగి సుఖాసీనులంజేసి తామును యథోచితస్థానంబులం గూర్చుండి, కుశలప్రశ్నంబు జేసి యోమహానుభావా నీవలన- విష్ణుపురాణము- బ్రహ్మకైవర్తము- బ్రాహ్మ్యము- భాగవతము- లైంగ్యము- శైవము- నారదీయము- బ్రహ్మాండము- పాద్మము- మార్కండేయము- ఆగ్నేయము- వారాహము- వామనము- గారుడము- మాత్స్యము- కౌర్మ్యము-స్కాందము-వాయవ్యమునను నీ పదునెనిమిది పురాణంబుల వింటిమి. అందు స్కాందపురాణోత్తర ఖండమందు ననేక ఘోరపాతకలతాలవిత్రంబులగు సజ్జన చరిత్రంబులను, బ్రాహ్మణ క్షత్రియధర్మంబులను, వినికృతార్థులమైతిమి. ఇంక వైశ్యధర్మంబులు వినవలయుంగాన నీ కలియుగమందు వైశ్యులెట్లు వర్తింపనగు. వారలే యాచారంబులనుష్ఠింపనగు. వాని సవిస్తరంబుగా నానతీయవేయన నాసూతుండామునీంద్రులంజూచి, భవిష్యద్వ్యాపారంబుల నెఱిగింపనేనెంతటివాడనైనను మీరు నన్నాదరించి యడుగుచున్నారు- గావున వైశ్యవంశవర్తనాదుల నాసేర్చినయంతమట్టు వచించెద సావధాన చిత్తులరై వినుండని తనయిష్టదేవతా వందనపూర్వకంబుగా నుడువందొడంగె.

గోదావరీతీరమునందు ననేకవిధ పుష్పఫలభరితంబులగు వృక్ష

ములచే విరాజితంబును, బ్రహ్మర్షుల వేదఘోషంబులచె హావిరాదానని మిత్తమే తెంచెడు నింద్రాదులగు ముప్పదిమూడుకోట్ల దేవతలచే ప్రకాశించునదియు నైన బ్రహ్మకుండమను మహదాశ్రమంబొప్పు-అందు సకలవేదవేదాంగ పురాణేతిహాస ప్రవీణుండును జితక్రోధుండును, జితేంద్రియుండును, మౌనిగణవరిష్ఠుండును నగు సాలంకాయన మునివాసము జేయుచుండు. అచటికి వైశ్యమునులువచ్చి యామునివరునకుసాష్టాంగదండ ప్రణామంబులాచరించి, యతనియనుజ్ఞవడసి, యుచితాసనంబులం గూర్చుండి మధురవచనంబులచే గుశలప్రశ్నంబు జేయు నాసాలంకాయనమహాముని సంతుష్టాంతరంగుండై యో వైశ్యమునులారా మీరిచటికివచ్చిన కతంక బేమి యని వారలనడిగె వారును స్వామీ మేముతీర్థయాత్రచేయుంబూని బైలుదేరి ఘోరపాతకంబులంబాఱదోలెడిగంగ మొదలుగాంగల మహానదులందు స్నానంబు జేయుచు, గోదావరియందు మజ్జనంబాడనిక్కడ కేతెంచితిమి ఇచట మీపాదంబులసేవించి పాపవిముక్తులమైతిమి ఇంక భూతభవిష్యద్వర్తమాన వేత్తలగు మీవలన ననేకపుణ్యకథలను వినుచుం గృతార్థులమయ్యెదము ఇపుడుమమ్మనుగ్రహించి, యీ ప్రపంచంబునందు మా వైశ్యకుల సంభవంబును వారలధర్మాచరణంబును. వారివృద్ధియు మొదలగు వృత్తాంతంబుల సవిస్తరంబుగం దెలుప వేయనిపలుదెఱంగులం బ్రార్థింపనతండు మనంబునంసంతసిల్లియుత్లనితొల్లి యాదిశేషునిచే ధర్మనందనునకుపదేశింపంబడిన యారహస్యమును నారదుండు నాకానతిచ్చిన తెఱంగున మీకుంజెప్పెదవినుండని న వల్లెయని వైశ్యమునులోస్వామీ యాధర్మనందనుండెవ్వండు- అతని కెట్లాదిశేషునిజూడంగలిగె అయ్యాదిశేషుండు వైశ్యకులవృత్తాంతముల నాధర్మనందనున కుపదేశించుటకుంగతంబేమి వీనింజక్కంగా మాకు తొలుత నుపదేశింపుమన నట్లేయని యా సాలంకాయనమునీంద్రుండు వారలకు ధర్మనందనాది వృత్తాంతంబుల నిట్లని జెప్పందొడంగె.

ఓ వైశ్యమునులారా! నర్మదానదీప్రవాహజల ప్రవర్ధమాన నానావిధానంత మహీరుహ సమూహ విరాజమానంబగు నార్యావర్తమునుపు

ణ్యాభూమి యందుఁ బ్రతిష్ఠానపురంబను పట్టణంబొండుగలదు. అందు బ్రహ్మ క్షత్రియ వైశ్యులు నివసించియుండిరి. వారిలో ధర్ముండను నొక వైశ్యుండు మహాబుద్ధిమంతుండును- సత్యసంధుండును-ధార్మికుండును- శౌర్యవంతుండును సచ్చరిత్రుండును- బ్రాహ్మణపూజాధురంధరుండును అతిథిసత్కారంబులయందు మిక్కిలి యాసక్తుండును- అర్థులకుఁ గల్పవృక్షమువంటి వాఁడునునై ప్రకాశింపుచుండి, కొంతకాలంబునకుఁ బిదప నతండుతనకుఁ బుత్రులు లేమిం జేసి తానును దనపత్నియు మహావ్యసనసాగరమగ్నులై యమునాతీరముం జేరి యచ్చట భూమింజయుండను నొక బ్రాహ్మణోత్తమునిం జూచి యర్ఘ్యపాద్యముల నొసఁగి తనకు బిడ్డలు లేనికారణము నతనికిం దెలిపి మామనోరథంబీడేర్పునట్టి వ్రతంబొకటి దనకు పదేశింపుమని వేడిన నావిప్రోత్తముండా ధర్మునింగని కార్తీకశుద్ధ త్రయోదశినాఁడు మొదలుచేసి ప్రత్యహంబును శ్రీ గౌరీ సమేతుండైన మహాదేవునిం బూజించి పిదప భార్యా సమేతుండై నియతాహారముల్ంగొనుచుండిన నీకు పుత్రసంతానంబు గలుగునని సెలవిచ్చియదృశ్యుండాయెను. అంత నా వైశ్యోత్తముండారీతిని వ్రతంబాచరించుచుండ సంవత్సరాంతమునందు శ్రీమహాదేవుండు బ్రహ్మవిష్ణ్వాది దేవతలతోడం బ్రత్యక్షమైన నతనింజూచి సాష్టాంగ దండప్రణామంబులాచరించి. స్తుతించి. యంజలిబద్ధుండైయుండ, నద్దేవుండు నీకు నధిక ధార్మికుండగు సుపుత్రుండు గలుగుఁగాత యని యనుగ్రహించి యంతర్హితుండాయెను. అంత నా వైశ్యపుంగవుండు దనకు నిష్టార్థసిద్ధియయ్యెఁగదా యని మిక్కిలి యుప్పొంగుచుఁ దనపురంబునకేతెంచె పిమ్మట నతని భార్య గర్భంబుదాల్చి క్రమంబుగ నొక్క సుపుత్రుని గనిన నా ధర్ముండు మిక్కిలి సంతోషసంభ్రమముతో నా పుత్రునకుఁ బుత్రోత్సవము జేసి పదునొకండవనాఁడు నామకరణంబుఁ జేయ నుద్దేశించియుండ నశరీరవాణి యా బిడ్డకు ధర్మనందనుఁడని పేరుఁ బెట్టుమని చెప్పె ఆ ప్రకారంబున యా వైశ్యవరుఁడు పుత్రునకు నామకరణ మాచరించెను. ఆ బాలుఁడును దినదిన ప్రవర్ధమానమై శుక్లపక్షచంద్రునింబోలె వృద్ధిఁబొందుచుండె వానికిఁ బ్రాఁడొడు సంవత్సరములుగడువ నుపనయనము చేయించెను అనంతరంబున

నబ్బాలుండు తండ్రియాజ్ఞప్రకారము భార్గవమహర్షికి శిశ్రూషఁజేయుచు నతనియొద్ద వేదాధ్యయనంబుచేసి వారియనుగ్రహంబున ఋగ్యజుస్సామవేదంబులయందు మిక్కిలి ప్రవీణుండై యొకనాఁడు గురువునకు నమస్కరించి వారిచెంత నిలుచుండఁగా నబ్భార్గవుండు శిష్యునింగరుణించి నీవింక మీతల్లిదండ్రులయొద్దకుంజని వారికి యథావిధిగా శిశ్రూషలుగావించుచు గృహస్థుడవుగమ్మని యాశీర్వదించె. అంత నాధర్మనందనుం డోస్వామీ మఱియు పండ్రెండుసంవత్సరంబులు తమసేవఁజేయుచుఁ బిమ్మట నేను నాతల్లిదండ్రులయొద్దకుఁ బోవునట్లు నన్నుంగరుణింపవేయన నతండును దానికొడంబడియె. నాఁటనుండి యాతండును నగురుండుచేయు నిత్యపూజాదులకు వలయు ద్రవ్యంబులను వనంబులనుండి కొనివచ్చుచుండ నొక్కనాఁడు మఱియొకవనంబునం బూజాద్రవ్యంబుల వెదకుచుండు నెడ "నేనంగిరసుండ- నన్నుఁజంపవద్దు" అనునొక భయంకరమగు శబ్దంబువిని మిక్కిలిచింతించి యాశబ్దము పుట్టినచోటునుజూడం జెట్టుచెట్టును బుట్టపుట్టయు మిట్టమిట్టయుం దప్పక యడవులన్నియు వెదకుచుం బోవుచుండ వింధ్యపర్వతంబునకు సమీపంబున నొక బోయవాఁడు బ్రాహ్మణునింబట్టి బంధించుటంజూచి చాలదుఃఖించి యోరీ దుష్టాత్మా వేదవేత్తయగు నీభూసురోత్తముం బూజించి సుఖంబులం బడయనేరక యితనిం బాధించి యేల రౌరవంబునం బడియెదవని యడుగ నాబోయవాఁడధిక రోషముగలవాఁడై కండ్లెఱ్ఱచేసికొని కటకటంబండ్లుగొఱుకుచు నాధర్మనందనుంజూచి యోరిదుర్బుద్ధీ- నన్నెఱుంగవుగాఁబోలు నిచ్చటనీవు నీతెరువునంబోక పెక్కులాడితివేని యీబ్రాహ్మణునితోడ నిన్నుంబరిమార్తునని మిక్కిలి పరుసంబుగాఁబలికెను దానికిఁ గొంచెమేనియుం దడయక యబ్బాలుండు బ్రాహ్మణులకొఱకును గోవులకయ్యును నేవాఁడు దనప్రాణమేనియు విడుచు, నతండు బ్రహ్మలోకముఁబొందునని మొఱపెట్టెడు మనుస్మృతి. వచనార్థమునుదనమనంబున దలపోసి సత్వరుండై యాబ్రాహ్మణునికడ్డంబుఁజొచ్చి ఓరీ ఘాతుకా నీపాతకబోధనువిమన్నించి నన్నుంజంపుమని యాకిరాతునిచేతికిఁ దనశరీరంబునొసంగె. ఆమాటకు నఘాతకుండును సంతసిల్లి మంచివి

యట్లేచేసెద; దాననాకును క్షేమంబుగలదని యాబాలునకు తాఁ జేయు
నరవధంబునకుం గారణమును సవిస్తరంబుగఁ జెప్పి వానిం దోడ్కొని
మృగయావినోదుండై పోయెను. ఇట్లు బహుదూరము నిరాహారుండై
పోయినందున నాచిన్నవాఁడు నెండగొట్టుటచేతఁ డస్సి, క్షుద్బాధాపీడితుఁ
డై భూమిమీఁదం బడియె. అంత నాకిరాతుఁడు నిర్దయుండై యాబాలు
నిం జెయివట్టి లేవనెత్తి, యోరిబడుగా వేగిరంబ యరుగుమని తనగు
ఱ్ఱపుకొరడాతోఁ గొట్టుచు మిట్టిపడుచుం దిట్టుచు మెడబట్టి నెట్టుచుం గొని
పోవుచుండె. అయిన నాబాలుం డావంతయుఁ జింతింపక మనంబునఁ ద
న గురుని పాదకమలంబుల ధ్యానించుచుఁ గొంతదూరము నడిచి మఱి
యు మూర్ఛిల్లి పుడమిపయిం బడియె. తోడనే యాక్రూరుఁడు వానిని
దీగెలతోఁ గట్టి ముండ్లలోను రాళ్లలోను నీడ్చుకొని పోయెను. ఆబాధ
ను సహింపలేక యాచిన్నవాఁడు కిరాతునిఁ జూచి, యోరి పాపాత్మ న
న్నేల యిట్లుబాధించి పాపంబునఁ గొడిగట్టెదవు- నన్ను విడువమని వేడెను
గాని వాఁడు సహజంబగు తనముంకుతనంబును మానక యెప్పటియట్ల
యీడ్చుకొనిపోవుచుండెను ఇట్లుండఁగా మగధదేశాధినాథుండు చతు
రంగబలసమేతుండై యావనాంతరమందు వేఁటాడుచు వచ్చుచుండ నా
చప్పుడువిని కిరాతుండు తనకపాయంబు సంభవించునని మిక్కిలి భయం
పడి యాచిన్నవాని నచటనున్న యొకబిలంబులోఁ బడవైచి బిలద్వా
రంబు నొక ఱాతితో మూసి తానొకచెట్టెక్కెను. అంత నమ్మగధనా
థుండు నేక మృగంబులం బొరిగొనుచు నొక కుందేటిని గుఱిపెట్టికొట్ట, న
ది తప్పించుకొని పాఱెను. అంతటం బోనియక యతండు దాని వెంబడిం
చి తఱిమి ఒల్లెముచేతం బాధుచుటం జేసి తామిక్కిలి గాసిలి యొకవృక్షం
బు చెంతఁ గుఱ్ఱంబు డిగ్గి యాచెట్టు క్రిందఁ గూర్చుండి యలతఁ దీర్చుకొను
చుండు సమయంబున నాచెట్టుపైదాగియుండెడు నొకబోయవానిం జూచి
వీఁడు మహాపాపిష్ఠుండై దారింబోవువారిం జంపుకొఱకు నిచటనున్నాఁ
డు. ఇట్టివాని నారాజ్యమందుంచుట యుచితంబుగాదని యోచించి వాని
బల్లియముతోఁ బొడిచిచంపుఁడని యాజ్ఞాపింప నారాజభటులు నవ్వి
ధంబునం జేసిరి. దాన నతండు సంతుష్టాంతరంగుండై సపరివారంబుగ:

దనరాజ్యంబునకు బోయె.

ఇట్లుండ భార్గవమహర్షితన శిష్యసమూహమునందు ధర్మనందనులేమింగని యతఁడేమయ్యె- నెటువోయె- నింతతడవునకు నేలరాఁడు ఇఁక మనమేమి సేయుదుమని మనంబునఁ బొగులుచు నలుప్రక్కల వెదకుచుం బిలుచుచు నెందునుగానక దుఃఖించి యతండు వచ్చునందాఁక నేను పదచలనంబు సేయనని భీష్మించుకొని యొంటికాలనే నిలువంబడియుండెను- ఈవృత్తాంతంబును వానితలిదండ్రులు మునివలనం దెలిసికొని మహాశోకసాగరమగ్నులై ఓశంకరా! నీవేగతియని శివస్మరణముఁ జేయుచు నాఋషిచెంతనే ప్రాయోపవేశము చేసిరి.

అంతనొక్కనాఁడు వాసుకియను సర్పరాజాధిశేషుని దర్శింపవలయునని యీశ్వరుని యాజ్ఞవడసి కైలాసంబు వెడలి భూలోకమునకు వచ్చి పాతాళంబును బ్రవేశించుటకై ధర్మనందనుండు పడియుండు బిలద్వారంబు చెంతకువచ్చి యాద్వారం బొక పెద్దఱాతిచేత మూయంబడి యుండుటను జూచి యా వాసుకి యత్యుగ్రకోపాటోపంబునం జీరుచు నా ఱాతి నూఁతను దెఱచి చూడఁగా నందు మేఖలాజినధారుఁడై గురుపదధ్యానము సేయుచున్న బాలుంగని నన్నుఁ జూచినమాత్రము చేతనే విషజ్వాలలతోఁ గూడియున్న యెట్టిసర్పంబులైనను భస్మమగును. ఇట్లుండ మనుష్యమాత్రుండగు నీబాలుఁడు చలింపకున్నాఁడిదినేమి వింత యని మిక్కిలి విస్మయంబంది ధ్యానయోగ గరిష్ఠుఁడై మెయిమఱచియుండు నాబాలునికిఁ బ్రపంచ జ్ఞానము గలుగునట్లు ప్రబోధించెను. అంత నాచిన్నవాఁడు శివ భూషణంబైన యాసర్పరాజుం దేరిజూచి యతి వినయ భయభక్తులతో నమస్కరించి నుతింపదొడంగె. అందునకు సంతసించి యా సర్పరాజా చిన్నవానిఁ జిరంజీవివి గమ్మని దీవించి యోరీ నాయనా! యిది నాగలోకమునకుదారి. ఇందు నీవేల నిలిచితివని యడుగ నాధర్మనందనుండు తన్ను బాధించిన బోయవాని వృత్తాంతంబును సవిస్తరంబుగఁ జెప్పెను. దానిందప్పక విని యా వాసుకి మిక్కిలిసంతోషించి నాగలోకమునకుఁబోయి యనంతుని దర్శనముఁ జేసి యథావిధి పూజలొనర్చి సేవించి వారి యాజ్ఞవడసి యుచితాసనమునఁ గూర్చుం

డి లోకరూపంబులగు ననేక సత్పురుషులకథా ప్రసంగములు జరిపించుచుండు నెడ నాధర్మనందనుని ప్రస్తావము జరిపించెను దానివిని యనంతుండత్యానందభరితుండై యా మహాపురుషుని తనయొద్దకుఁ బిలుచుకరమ్మని వాసుకి కాజ్ఞాపించెను. వాసుకియు నా బిలద్వారంబునకు వచ్చియా చిన్నవాని నాగలోకంబున ననంతునియొద్దకు రమ్మని పిలువఁగా. నావైశ్యపుత్రుండో వాసుకీ! నాదేహము కిరాతుని యధీనమైనందున నేనెట్లు నాగలోకమునకు రాఁగల- వచ్చితినేని సత్యోల్లంఘనము జేసిన వాఁడనవుదునుగదా! గాన నేను రాజాల, నీవు నీవుపొమ్మనెను. వాసుకి దానిని విని యోధర్మనందనా! నీవు సకలధర్మంబును జక్కఁగాఁ దెలిసికొన్నవాఁడవుగదా- దేవాజ్ఞవలన నీవు నాగలోకమునకుఁ బోయిన, నీ వెట్లు సత్యము తప్పినవాఁడవగుదువు- కావున నవశ్యము నావెంట నాగలోకమునకు రమ్ము- అందువలన నీకుసుఖంబులు గలుగునని చెప్పెను మఱియును, నా బోయవాఁడు రాజువలన సంహరింపఁబడెనని వాసుకివలనం దెలిసికొని, యాచిన్నవాఁడతనితోడ నాగలోకమునకుం బోయి యిచ్చట నైరావత- తక్షక- కర్కోటక- ధనంజయ- శంఖచూడప్రముఖులగు మహానాగములవలన సంస్తుతింపఁబడుచుండు వేయు ఫణామండలములు గల యాదిశేషుని సేవించి పులకాంకిత దేహుండై సాష్టాంగదండ ప్రణామములు జేసి, లేచినిలిచి, యంజలిబద్ధుండై యనేక విధముల స్తుతించి మైత్రేయ కులగోత్రజుఁడగు నన్ను రక్షింపుమని వేఁడెను. ఆదిశేషుఁడు నా చిన్నవానియందు మిక్కిలి ప్రేమగలవాఁడై యోయి ధర్మనందనా, నీవృత్తాంతంబంతయు దివ్యదృష్టిచే నేనెఱింగితి. ఇప్పుడు నీ గురువును దలిదండ్రులును నిన్నుంగానక మిక్కిలి వ్యసనపడుచున్నారు. నీవుపోయి, వారికి సంతోషము గలుగఁజేసి వివాహితుండవై, సమస్తసౌఖ్యంబు లనుభవింపుచుఁ జిరాయువుగమ్మని, యాశీర్వదించి యీతని భూలోకమందు విడిచిరమ్మని తనభటుల కాజ్ఞాపించెను. ధర్మనందనుండును శేషుని యాజ్ఞను శిరసావహించి, యాతనికి నమస్కరించి దే [illegible], నాకొక్క సందియంబుగలదు. దానిందెలుప నీవసమర్థుండవు అదేమన, యుగంబులపరిమాణంబును బ్రహ్మమానంబును బ్రాహ్మణాది

వర్ణ సమయాచార ధర్మంబులును కలియుగమందలి వానిస్థితియును, క్షత్రియవంశంబు నందునితో నంతరించుటయు, పురూరవచక్రవర్తి వంశస్థుల చరిత్రము మాత్రము భూమండలమందు బ్రశస్తముగనుండుట యు, మొదలుగాఁగల వృత్తాంతంబుల సవిస్తరముగా నానతీయవలయునని వేఁడ నాదిశేషుం డాధర్మనందనునకుం జెప్పె- దానిమీకుం దెలిపెద, సావధానులరై వినుండని, సాలంకాయనముని వైశ్యమునులకుం జెప్ప నారంభించెను.

ఓ వైశ్యమునులారా- ప్రపంచమునందుఁ గృతయుగప్రమాణ వత్సరంబులు ౧౭౨౮౦౦౦ త్రేతాయుగ ప్రమాణ సంవత్సరంబులు ౧౨౯౬౦౦౦, ద్వాపరయుగ ప్రమాణవర్షంబులు ౮౬౪౦౦౦, కలియుగ ప్రమాణ వత్సరంబులు ౪౩౨౦౦౦, ఈనాలుగు యుగంబులొక్క మహాయుగం బనఁబడు ఇట్టి మహాయుగంబులు డెబ్బదియొకటియైన నొక మన్వంతరమగును. ఇదియ యింద్రకల్పమనియుఁ జెప్పంబడును. ఇట్టి మన్వంతరములు పదునాలుగైన బ్రహ్మకు నొకదినము. ఇట్టిదినములు మున్నూటయఱువదియైన బ్రహ్మకు నొకవత్సరము. ఇట్టి సంవత్సరంబులు నూఱైన నొక బ్రహ్మకల్పము. ఇట్టి బ్రహ్మకల్పంబులు నూఱైన, దీర్ఘాయువనుమునికి నొకదినము. ఇట్టి దీర్ఘాయుమునుల సంఖ్య యిరువదియేడుకోట్లయిన, రోమశమునికి దేహమందున్న యొకరోమము పీడిపడును. ఇట్టిరోమశమునులు ముప్పదికోట్లయిన నష్టావక్రమునికి దేహమందుండు నొకయెముకవంకరగును ఇట్టియష్టావక్రమునులు పలుబదికోట్లయిన *పాదదృష్టునికి నొకనిమిషంబు ఇట్టి పాదదృష్టునులు నియుతార్బుద కోట్లయినను, విరాట్పురుషునికి నొక నిమిషమేనియుఁగాదు. అట్టివిశ్వపురుషుఁడు సమస్తచరాచరములయందును వ్యాపించి, నిత్యుఁడై సర్వసాక్షియై, నిరాకారుఁడై, నిరవద్యుఁడై, సహస్ర శీర్షబాహులు గలవాఁడై వేదవేదాంగములకు నగోచరుఁడై, యుపాదాన కారణ భూతుండై పరమమునీంద్రహృదయాంతరత పరమ హంసాకార ప్రభావుండై చతుర్ముఖాదిప్రముఖ వివిధ

* పాదములయందు కన్నుగలవాఁడు.

వందితుఁడై, దివ్యతేజోమయుఁడైయుండును. అట్టిపరమేశ్వరుండుతన సంకల్పమాత్రముచేత మహదహంకారాది ప్రకృతిస్వరూపబ్రహ్మాండములయందు వ్యాపించి. సత్వరజస్తమో గుణాకారులగు బ్రహ్మావిష్ణు- శంకరులను నిర్మించి జగన్నిర్మాణ కారణ భూతమైన రజోగుణమును, చతుర్వేదములను- బ్రహ్మకిచ్చెను. జగద్రక్షణంబునకుఁ కారణమగు- సత్వగుణమును- జక్రాయుధమును విష్ణువునకిచ్చెను. సంహార నైపుణ్యముగలతమోగుణమును- త్రిశూలమును- శంకరునకిచ్చెరు అప్పుడు బ్రహ్మజగత్సృష్టిచేయనిశ్చయించి, శ్రీవిశ్వంబరుని సంస్తుతించినమాత్రమున క్షయవృద్ధులులేక నిత్యుఁడై సర్వాంతర్యామిగానుండు నప్పరమేశ్వరుని యనుగ్రహముగలవాఁడై తనపంచభూతములలో నొక్కటియైన ప్రాణమువలనఁ బ్రజాపతిని అపానమువలనక్రతువును వ్యానమువలనఁ బులహని, ఉదానమువ నఁబులస్త్యని. సమానమువలనవశిష్టుని శిరమువలన గగనమును చెవులవలన వాయువులను. నేత్రములవలన సూర్యచంద్రులను, ముఖమువలన ఇంద్రుని- అగ్నిని నాభివలననంతరిక్షమును రోమకూపములవలన నతల- వితల- సుతల- తలాతల-రసాతల- మహాతల- పాతాళంబులనెడు నధోలోకంబులను, భూలోక- భువర్లోక- సువర్లోక- మహాలో- జనలోక- తపోలోక- సత్యలోకంబులనెడు నూర్ధ్వలోకములను ముఖమువలన బ్రాహ్మణులను భుజములవలన క్షత్రియులను ఊరువులవలన వైశులను పాదములవలన శూద్రులను, సర్వాంగములవలనదేవతలను యక్ష రాక్షస, గంధర్వ; సిద్ధ; విద్యాధర కిన్నర కింపురుషాది నానావిధ ఖేచర విశేషంబులును ద్వాదశాదిత్యులను: ఏకాదశరుద్రులను. నవగ్రహంబులను; నష్టదిక్పాలక వసుదిగ్గజంబులను; సప్తమాతృకా- మహాముని- సాగర- శైల- ద్వీపంబులను; మహానదీ నదంబులను; భూజల; వన కుధర; పక్షి; ద్రుమ లతా, పశు; మృగ, క్రిమి కీటాదిజంతువులను బుట్టించి పాపపుణ్య- సత్య- ధర్మ- వృద్ధి-మొదలైనవాసిని. వానికిందగిన కర్మములు ఆహారములు స్థానములు, నిద్ర- రతి భయ, సంభాషణములు, మర్యా

ద్వాశ్రమ వర్ణములు, మొదలు గాఁగలవాని గల్పించెనని సాలంకా యనమునియానతిచ్చిన వైశ్యమునులువిని యత్యంత సంతుష్టాంతరంగులై యమ్మహామునికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి, ముకుళితహస్తులై స్వామీ! బ్రహ్మయూరువునబుట్టిన వైశ్యులకు జాతకర్మాది విధానంబు లెవ్వరొనరించిరి, ఇవిమొదలుగాఁగల యనంతర కథావిశేషంబులఁ దెలుపవలయుననికోరిన నమ్మహాత్ముండట్లసేయుదునని చెప్పందొడంగెను.

మొదటియుల్లాసము - ముగిసెను.



శ్రీవాసవాంబాయైనమః.

# శ్రీకన్యకాపురాణము.

## రెండవ యుల్లాసము.



ఇందు- బ్రహ్మతన తొడలయందుఁబుట్టిన వైశ్యులకు సకలక్రమంబులఁదెలిపి సకల సంపదలిచ్చి; భూలోకవాసులుగాఁ జేయుటయుఁ- పిదప, నావైశ్యులు బ్రహ్మపదముఁగోరి, బ్రహ్మర్షుల యనుగ్రహమునుబొంది, యీశ్వరునిఁగూర్చి ఘోర తపంబు లొనర్చి, కైలాస వాసమును బొందుటయు- మణిపట్టణాధీశ్వరుండగు చిత్రకంఠుండను గంధర్వుండు గన్యానిమిత్తము వైశ్యములను భూలోక గతులనుగా శపించుటయు- వైశ్యులును నాగంధర్వునికిఁ బ్రతిశాపమిచ్చుటయుఁ- జెప్పంబడుచున్నయది.

ఓ వైశ్యమునులారా! యిట్లు జగత్సృష్టిఁ జేయుటయందుఁ, బద్మజ సంభవుఁడు దన కుడి యంగముల వలన సర్వజాతి పురుషులను నెడమ యంగంబుల వలన స్త్రీలను, సృష్టించి. వారి వారికిఁ దగుఁబాటి కర్మములను విధించెను. అందు బ్రాహ్మణులకు వేదాధ్యయనమును, క్షత్రియులకుఁ బ్రజాపాలనమును, వైశ్యులకుం గృషివాణిజ్య గోరక్షణములను, శూద్రులకుఁ బయి మూఁడు వర్ణముల వారి దాస్యమును, విధించెను. తదనంతరంబునఁ దన పుత్రులలోఁ బ్రధముఁడగు నాంగీరసుని బ్రాహ్మణులకును, వసిష్ఠుని క్షత్రియులకును, అపరార్కుని వైశ్యులకును, పురోహితులనుగా నిర్ణయించి కర్మభూమికిం జనుండని, నియమించెను. అట్లయా బ్రహ్మ క్షత్రియ వైశ్యులు కర్మభూమిం బొంది, తమతమ పురోహితులు తెలియఁజేయు చందంబున, నానాట వృద్ధిఁ బొందుచుండిరి. శూద్రులును, బ్రహ్మనియమ ప్రకారం బామూఁడు వర్ణముల వారికి శుశ్రూషఁ జేయుచుండిరి. ఇట్లు నాలుగు పరసులును, ప్రజాభివృద్ధికి న్గాకర్తలైయుండిరి.

౩౪

బ్రహ్మయూరువునం బుట్టిన వైశ్య పురుషులకును, స్త్రీలకును నపరార్కుండు బ్రహ్మాజ్ఞానుసారము జాతకర్మాదికములను జరిపించి గోత్రభేదములను గల్పించి పురుషులకు ౧౨ సంవత్సరములు గడచిన తోడనే యుపనయనముఁ జేసెను. వారు లేడిచర్మమును వస్త్రముగాఁ గొని పరిశుద్ధంబులగు యజ్ఞోపవీతంబులను ధరియించి మోదుగకఱ్ఱలను దండములుగాఁ బట్టి మౌంజిచేతఁ బ్రకాశించెడు కటిప్రదేశము గలవారై మహా తేజోవంతులై బ్రహ్మచర్యాశ్రమమును జరుపుచునుండఁగాఁ యజనాధ్యయన దాన కర్మత్రయంబులను బోధించి బ్రహ్మ యెడమ తొడయందుఁ బుట్టిన వైశ్య స్త్రీలను గోత్ర ప్రవరముల కనుగుణముగా వివాహము జరిపించి గర్భాధానాది పంచదశ కర్మంబులను దేవబ్రాహ్మణ తటాకనవనిధానములు మొదలుగాఁగల సప్తసంతానములను మహా కర్మవిశేషంబులను వ్యవహారక్రియా ధైర్యగాంభీర్యంబును ధనకనకవస్తువాహనాది వివిధ పదార్థంబుల పరీక్షాధికారంబులను క్రయవిక్రయ కౌశలంబును ధర్మాధర్మవివేకంబులను గృషి వాణిజ్య గో

గోరక్షణ వృద్ధిజీవనంబులను గలిపి, యపరార్కముని తన నివాసంబు నకుం జనియె. ఆ వైశ్యులును భూలోకము నందు సకల సంపత్తులను బొంది సమస్తసౌఖ్యంబుల ననుభవింపుచు, సర్వధర్మంబులను బరిపాలింపుచునుండిరి.

అంత స్వాయంభువ మన్వంతరములో ప్రథమ యుగమందు సమస్త జనులును దేవతలతో సమానులై, రెండులక్షల యేండ్లవఱకు సజీవులై, సంచరింపుచుండిరి. అందువలన దేవతలకును నరులకును భేదము దోపక యుండెను. అప్పుడు విరాట్పురుషుండు బ్రాహ్మణాదివర్ణత్రయ రక్షకులగు నాంగీరస వసిష్ఠ పరార్కులను బిలువంబంపు వారును దమతమ శిష్యగణములతో బ్రహ్మలోకమునకుం జని, బ్రహ్మను గాంచి సంస్తుతించి, నిలుచున్న వారింజూచి, మీమీ వర్ణంబుల యందెన్నెన్ని గోత్రములు గలిగియున్నవని యడుగఁగా దూర్వాసుండు బ్రహ్మనుజూచి మాలో ౧౧౯ గోత్రములు గలవనియు, నవి ౧౮ గణములుగా విభజింపఁబడి యున్నవనియు, ధనుంజయుండను క్షత్రియుడు మాలో నొక గణముగల యేడు గోత్రములనియు సమాధియను వైశ్యుండు, మాలో ౭౧౪ గోత్రములు గలవనియు జెప్పెను. దాని విని బ్రహ్మ వైశ్యులలో మాత్రము విశేష గోత్రములు గలిగినవని చెప్పఁగా, వైశ్యులు బ్రహ్మనుజూచి, మీ యనుగ్రహము వలన మాలోన నేకగోత్రములు గలిగెఁ గాన, బ్రాహ్మణాది వర్ణములకంటె మా వర్ణమును శ్రేష్ఠంబగునట్లనుగ్రహింప వలయునని వేడి, ౬౧౨ గోత్రజులు మాలో నధికముగాఁ గలిగినందున శ్రేష్ఠుల మైతిమని గర్వించి, కేకలు వేయుచుఁ దక్కినవారిని బరిహాసముఁ జేసిరి. ౧౦౨ గోత్రజులు ముఖములను గుడ్డలచేఁ గప్పుకొని, నవ్వుచుండిరి. అంత నా బ్రాహ్మణు లతి కోపము గలవారై, వైశ్యులనుజూచి, మీరు నీచులై మాంస భక్షణముఁ జేయుచు జాతిభ్రష్ఠులగుదురని శపించిరి. ఆ శాపమును వినగానే, ౧౦౨ గోత్రజులు భయభ్రాంతులై మా బ్రాహ్మణులకు నమస్కరించి మమ్ము ననుగ్రహింపుడని ప్రార్థించిన, నా బ్రాహ్మణులు వారిని జూచి మీ రాచంద్రార్కస్థాయిగా బ్రహ్మజ్ఞానులై, శ్రేష్ఠత్వమును వహించి

యుందురని, యనుగ్రహించిరి. అనంతరము వైశ్యులందఱును బ్రహ్మను జూచి తమకు శాప విమోచనము గలుగు నట్లను గ్రహింపవలయునని వేఁడఁగా, బ్రహ్మ వారింజూచి విప్రశాపంబు వారింప నేరితరము మీరు బ్రాహ్మణభక్తిగలిగియుందురేని, మీవంశమందుమాయాశక్తి కన్యగా నుద్భవించి యగ్నిప్రవేశముచేయఁగలదు. అప్పుడా కన్యతోడనేవైశ్యు లగ్నిప్రవేశము చేయుదురో వారీ విప్ర శాపమునుండి విముక్తులగుదురు. జాతిభ్రష్టులుగాక యుత్కృష్టులగుదురు. అట్లు చేయనివారుజాతిభ్రష్టులై, లోకనింద్యులగుదురని యానతిచ్చెను.

అంత నా వైశ్యులు బ్రహ్మాజ్ఞానుసారము మఱియు భూమండలముం బ్రవేశించి· వ్యాకులచిత్తులై, యాపరార్కమునియాశ్రమమున కుంజని, తమకుఁబ్రాప్తమైన శాపావస్థలగూర్చి కొంతదడవు చింతించి, మేమీ మర్త్యలోకమందుండి, కర్మబంధములలోఁ జిక్కి యనేకావస్థలంబొంది, విసికి యిఁక స్వప్నావస్థగానుండు నీ మనుష్యజన్మముతో నరకకూపమగు నీ మర్త్యలోకంబున నివసింప నోపక! మిమ్ము శరణుఁజొచ్చితిమి తొల్లి సనకసనందనాదు లెట్లు బ్రహ్మ పదముంబొందిరో, యట్లు మాకును బ్రహ్మపదంబు గలుగు నట్లనుగ్రహింప వలయునని, యనేకవిధంబుల దీనులైప్రార్థించిరి. అంత నాయపరార్కముని యో వైశ్యులారా! కామ క్రోధ లోభ మోహ మద మత్సరంబులనెడు నరిషడ్వర్గంబుల జయించి, పరబ్రహ్మమందు నేకాగ్రచిత్తులై ఘోరతపస్సులంజేసి శ్రీపరమేశ్వరానుగ్రహముం బొందువారెవ్వరో వారలకుమాత్ర మట్టిపుణ్యలోకంబు గలుగును గాని, యితరులకు గలుగ నేరదుగాన మీరు తపస్సుజేసి యట్టి పదవిని బొందవలయునని నిశ్చయించి దానికిం దగిన సాధనంబులగు పంచాక్షరి మొదలైన మంత్రంబులను యోగాది విధులను వారికి నుపదేశించెను. అంత నా వైశ్యు లత్యానందభరితులై, యమ్మహామునికి సాష్టాంగ దండప్రణామంబు లాచరించిరి. వారి యనుజ్ఞనుబొంది, యచ్చటనుండి బైలుదేరి హిమాచలము మీదికిం జని, యచట నిరాహారులై కొందఱు, వాయు భక్షకులై కొందఱు కందమూల ఫలాహారులై కొందఱు పయఃపానులై కొందఱు పర్ణాశనులై

కొందఱు పంచాగ్ని మధ్యంబునం గొందఱు జలమధ్యంబునం గొంద ఱేకపాదులై కొంద అధశ్శిరస్కులై కొంద ఊర్ధ్వబాహులై మఱి కొందఱు తపస్సుఁజేసియుం, బరమేశ్వరుండు ప్రత్యక్షుండు గామింజేసి మానస సరస్సునకుం బోయి, యచ్చటఁ దపోనిష్ఠులైన మహర్షులకు నమస్కరించి, ఓ మునులారా! మేము ఘోర తపస్సులను జేసియు, నీశ్వరునికి మాయం దనుగ్రహంబు గలుగదయ్యె. కావునఁ దాము మమ్మంగరుణించి, యీశ్వరానుగ్రహ పాత్రులం జేయవలయునని యనేక ప్రకారంబుల వేడఁగా, నా మహర్షులు జ్ఞానదృష్టిచేతంజూచి యో వైశ్యమునులారా మీకు సేపదార్థం భిష్టముగా నున్నదో దాని వర్జించి, తపస్సుఁజేసిన మీకుం బరమేశ్వరానుగ్రహము గలుగునని చెప్పిరి వారు నా ప్రకారమే తమతమ యిష్టవస్తువులను వర్జించి, భస్మోద్ధూళిత విగ్రహులై, యష్టాంగయోగ నిరతులై, శివధ్యాన పరాయణులై యనేకవిధ ఘోరతపస్సులు చేయఁగా, శ్రీపరమేశ్వరుండు పార్వతీసమేతుండై, వృషభవాహనారూఢుండై, మహాకాళ మహావీరభద్ర కుమారకంఠీశ్వర యంగద దారుకర్ణ వీరకర్ణ విజయకర్ణ ఘంటాకర్ణ త్రిముఖ చతుర్ముఖ పంచముఖ షణ్ముఖ సప్తముఖ అష్టముఖ నవముఖ దశముఖ శతముఖ సహస్రముఖా, యుతముఖ విశ్వముఖ సహస్రకరా, యుతకర నికుంభ కుంభోదర లంబోదర మహోదర నీలకంఠ చిత్రకంఠ పక్షిముఖ శుకముఖ హంసముఖ అశ్వముఖ భల్లూకముఖ వ్యాఘ్రముఖ శరభముఖ ప్రముఖానేక ప్రమథ గణంబులును, ఇంద్రాది దిక్పాలకులును, బరమేష్టించి రాఁగా సమస్తదేవతలును మహామునిబృందంబులును నవబ్రహ్మలును ఏకాదశ రుద్రులును ద్వాదశాదిత్యులును అష్టభైరవులును సప్తమాతృకలును నవగ్రహంబులును యక్ష రాక్షస కిన్నర కింపురుష గంధర్వ సిద్ధ విద్యాధరులును, రంభాద్యప్సరస్త్రీ నికాయంబులును గొలువఁగా చండీశ్వర తుంబుర నారదులు కైవారంబులుసేయ పేరారవారంబుతోఁ ప్రత్యక్షుంబయ్యె.

అట్టిపరమేశ్వరుంజూచి, యా వైశ్యమునులు పరమానంద భరితులై, వినయ భయభక్తులతోఁ సాష్టాంగ దండప్రణామంబులాచరించి,

యంజలిబద్ధులై బహువిధ స్తోత్రంబులఁ జేయఁగా, శ్రీ పరమేశ్వరుండును సంతోషించి మీ తపస్సునకు మెచ్చితి, మీకుంగావలయు వరంబుల ను వేఁడుఁడనఁగా, వారును బరమానంద మగ్నులై మేము కుటుంబస మేతులై సర్వకాలము మీ సేవజేయుచుఁ గైలాసమున వాసము జేయు చుండు నట్లనుగ్రహింప వలయునని కోరిరి. ఈశ్వరుండును వారు కోరి న ప్రకారముగా వరంబులొసంగి. వైశ్యమునులను సహకుటుంబము గాఁ బుష్పక విమానంబు నెక్కించుకొని కైలాసంబునకుం గొనిపో యెను. ఆ వైశ్యమునులు సంతుష్టాంతరంగులై నిత్యానందభరితులై శ్రీపార్వతీ పరమేశ్వరుల సేవాపరతంత్రులై కైలాసవాసంబు చేయు చుండిరి.

అప్పుడా వైశ్యగణములో శంభుశ్రేష్ఠియను వైశ్యముని శ్రీప రమేశ్వర సేవాపరతంత్రుండై యుండె. అతని కూతురును మహాసౌంద ర్యవతియు నగు దేవకియనుకన్య తన తండ్రికంటె మిక్కిలి యీశ్వర సేవా పరతంత్రియైయుండెను. ఇట్లుండ నొకనాడు మణిపురాధీశ్వరుండ గు చిత్రకంఠుండను నొక గంధర్వుం డీశ్వర దర్శనమునకుం బోవుచు, మార్గములో నాచిన్నదానిని జూచి, దానియందుంగలిగిన మనంబుగల వాఁడై, వెంబడివచ్చి, యా చిన్నదాని తండ్రియైన సోమదత్తుండను నా మాంతరముగల శంభుశ్రేష్ఠితోఁ దన కా చిన్నదాని వివాహముఁ జేసి యివ్వవలయునని యనేక సదుపాయముల చేత వేఁడఁగా, నా శంభుశ్రే ష్ఠి దన బంధువులతో నాలోచించి మేము వైశ్యులము మా చిన్నది దాని నీవు కోరందగదు మేము నీకివ్వమని చెప్పెను. అంత నా చిత్రకం ఠుం డతి మోహావేశముచేఁ, గోపించియోరీ వైశ్యాయిప్పుడువిరహాగ్ని చే నేనెట్లు తపించుచున్నానో, యట్లు మీకన్యతోడ మీకులస్థులంద ఱును భూమిలో జన్మించి, భూపాలుని నిమిత్తం బగ్నిగుండంబు నంబడి, దగ్ధులయ్యెదరని శపించెను. అప్పుడా శంభుశ్రేష్ఠి యా గంధర్వునింజూ చి, యో చిత్రకంఠా నిరపరాధులైన మమ్ము నీవు కామాంధ కా రాంధుడవై శపించితివి గావున, నీవును భూమిలో విష్ణువర్ధనుండను నా మముతో, భూపాలుడవుగాఁ జన్మించి, మా కులకన్యనుఁ గోరి పదివేల

తునకలుగాఁ బగిలినతలగలవాఁడవై, భూమిమీదఁబడి, చత్తువని, ప్ర తిశాపమిచ్చెను. అదివిని యాచిత్రకంఠుఁడు మహావ్యసనాక్రాంతుఁడై తననివాసమునకుం బోయెను. అంతనా శంభుశ్రేష్ఠి మొదలుగాఁగల వైశ్యమునులు సమూహముఁజేరి, యా చిత్రకంఠునికి మనచిన్నదాని నివ్వమని నిరాకరించినందున, వాఁడు మనకేవిధమైన బాధలనుజేయునే మో- వానికీచిన్నదాని నిచ్చిన మనవంశములోఁ బూర్వమునుండి జ రుగుచువచ్చు వాడుకచొప్పున, మేనత్తకొడుకునకు నిచ్చి వివాహము చేయుటతప్పిపోవునుగదాయని, యోచించి, కడపటనా గంధర్వునకుం గన్యనివ్వరాదని, నిశ్చయించుకొని, దానిమేనత్తకొడుకునకు మేనరిక ము చెడకుండునట్లిచ్చి వివాహముచేసి, తమభద్రార్థము నందికేశ్వరు ని శరణుఁజొచ్చి, యతనియాజ్ఞప్రకారము, కైలాసపర్వతమున నా వ ధూవరుల నేడు దినములవఱకు నివసింపఁజేసితిమేని, యా గంధర్వుం డాచిన్నదాని నేమియుం జేయనోపఁడని, నిశ్చయించిన ప్రకారం బా వధూవరుల నా పర్వతముమీఁద నివసింపఁజేసి భయంబుమాని, యె ప్పటియట్ల ప్రతిదినంబును, మహాదేవ సేవాపరవశులై యుండిరని, సా లంకాయన ముని యానతిచ్చిన, నావైశ్యముని లామునింజూచి, యో స్వామీ, యీరీతింగైలాసవాసంబు గలిగి వర్తించుచున్న మావైశ్యకు లస్థు లేసమయంబున నెట్లుమర్త్యలోకమందుఁ బుట్టిరి. పిదప వారేవి ధంబున వర్తించిరి. ఇది మొదలుగాఁగల వృత్తాంతంబులను సావధాన ముగా ననుగ్రహింపవలయునని వేడిన, నమ్మహాముని యు నట్లుచేసెదన ని, తదనంతర వృత్తాంతంబుఁ జెప్పందొడంగె.

రెండవ యుల్లాసము, ముగిసె.



శ్రీవాసవాంబాయైనమః

# శ్రీకన్యకాపురాణము.

## మూడవ యుల్లాసము.



ఇందు- నారదమహాముని దక్ష ప్రజాపతియొద్దకు జనుటయు, పార్వతీదేవి దక్షప్రజాపతి యాగమునకుఁబోయి యాయాగశాలలోన నవమానమును బొంది యోగాగ్నింబడి చచ్చుటయుఁ వీరభద్రోత్పత్తియు, దక్షయాగ భంగంబును, హిమవంతునికి నీశ్వరి పుత్రిగానుద్భవించుటయు, తారకాసురుని యుపద్రవము సంభవించుటయు, తన్నిమిత్తము మన్మథుం డీశ్వరుని తపోభంగంబుఁ జేయఁబోయి తాను భస్మమగుటయు, పార్వతీదేవి వివాహంబును, జెప్పఁబడుచున్నవి.

ఓ వైశ్య మునులారా- అట్లు కైలాస వాసముం జెంది, వైశ్య మునులు దేవగణములతో నహోరాత్రంబును పరమేశ్వరారాధనంబుఁ జేయుచుఁ సంతుష్టాంతరంగులై యుండఁగా, భూత భవిష్య ద్వర్తమాన కాలవేదియగుఁ నారదమునీశ్వరుం డొకనాఁడు దక్షప్రజాపతి యొద్దకుంబోయిఁ యతండు జరిపిన యతిథి సత్కారంబులనొంది, కూర్చుండియుండఁగా, నో నారదమహామునీ, నీవేయే దేశములకుం బోతివి- ఏయే విశేషంబులం గంటివి- నా కుమార్తెయు నల్లుండును క్షేమంబున నున్నవారె- యనియడిగిన, నారదుండు నో దక్షప్రజాపతీ, నేను బహుదేశములు తిరిగితిని- అనేక పుణ్యక్షేత్రంబుల సేవించితిని- పుణ్యతీర్థంబుల స్నానముజేసినాఁడను- మీయల్లుని నాఁడుబిడ్డనుఁజూచితిని- మీకుమార్తె నాతండ్రి నాయెడం బ్రేమ తప్పియున్నాడు గాఁబోలు- ఒకప్పుడేనియు నన్నుఁ జూడరాఁడు- మాతలిదండ్రులనుం జూచి యనేకదినములాయెను- వారలకు నావృత్తాంతంబును మీరలు చెప్పుండని, నాతోఁ బలుతెఱుంగులం జెప్పెనని, నారముండు దక్షప్రజాపతి

త్రోఁ జెప్పి తన నివాసమునకుం బోయెను. అంతట దక్షునిభార్య పెనిమిటింజూచి, యాఁడుబిడ్డను జూచి యనేకదినము లాయెను. ఏడాదికొకతూఱియైనను జూడకుండినం, బుట్టినిల్లు బూడిదైనదాయని లోకులు మనల దూరరా. అదియుంగాక యేడుతరములవారి యాఁడుబిడ్డనైన, దూరమనక యప్పుడప్పుడు తోడితెచ్చి పసుపుకుంకమిచ్చి పంపవలసినది యావశ్యకముకదా. అట్లుచేయక వారిని నిరాకరించినఁ బాపంబేల సిద్ధింపకపోను ఆఁడుబిడ్డలకుఁ బెనిమిటియింట నెంతసంపదలున్నను, బుట్టినింటివారు నెఱబీదలుగానుండి, యేమిచ్చినను, దానిని వారు గొప్పఁగానెంచి సంతోషించుట సుప్రసిద్ధంబని మనకుఁ దెలియదా. కావున, నాఁడుబిడ్డలకుఁ బుట్టినింటి మర్యాద యెప్పటికిని జరిపింపవలసినదని చెప్పెను. అంత దక్షప్రజాపతి యాగము సేయనారంభించి, దానికిఁ దనయల్లునిం గూతిరినిఁ బిలువంబోయెను. అప్పుడు, శ్రీపరమేశ్వరుండు, యోగనిష్ఠాగరిష్ఠుండై యున్నందునఁ, దానుకన్నులదెఱచి చూచిన, నా దక్షప్రజాపతి దహింపఁబడుననియెంచి, యూరకుండెను. దక్షుండు, తన యల్లుఁడు దనకు మర్యాదఁజేయక యుండెనను రోషము చేతఁ దన కూతునొద్దకేనియుం బోక, మరల తన నివాసంబునకు వచ్చి, యల్లుని యనేక విధంబులఁదూఱి, తనంతట యజ్ఞమును జరుపుచు నుండెను. ఆ సంగతిని పార్వతి నారదునివలనఁ దెలిసికొని, యీశ్వరుని యొద్దకుఁబోయి, తనతండ్రిసేయు యాగమును జూచివచ్చుచుదానని యడిగినందుకు, పరమేశ్వరుండు భవిష్యత్కాలంబు నెఱింగినవాఁడు గావునఁ దనభార్యం జూచి యోపార్వతీ, నీవచటికింబోయిన, దక్షుండు నీకు మర్యాద జరుపునని, బహుప్రకారంబులం జెప్పియు, దాక్షాయణి దాని వినక తనకుఁ బుట్టినిల్లు గావున, నేల మర్యాద జరుగకపోవునను నిశ్చయముచేత బలాత్కారముగాఁ బరమేశ్వరుని యనుజ్ఞనుబొంది, తండ్రియాగ శాలకుఁబోయి, నిలుచుండఁ దన తలిదండ్రులేమియు బలుకకయుండిరి. అచ్చటనున్న స్త్రీలందఱు నోపార్వతీ, నీవుపిలువంబడక వచ్చి, యేలయమర్యాద పొందెదవే యని, పరిహాసింపుచు, నవ్వసాగిరి. అందువలనఁ బార్వతి

యింత యవమానపడి మరలపరమేశ్వరుని యొద్దకుఁ బోవుటకంటెను నిక్కడనే ప్రాణములు విడుచుటమేలని యోచించి, మిక్కిలి ఖిన్నురాలై, తన యోగాగ్నింబడి ప్రాణములను విడిచెను. పిదపఁ బరమేశ్వరుండింతయుఁ దన దివ్య దృష్టివలనఁ దెలిసికొని, మహా కోపము గలవాఁడై, తనజటలచే భూమిమీఁదం గొట్టఁగా, వీరభద్రుండనేకాయుధముల తోడఁబుట్టెను. ఈశ్వరుఁడా వీరభద్రునితో పార్వతీదేవి సంగతినిజెప్పి దక్షప్రజాఁపతి యాగమునకు భంగముఁజేసి, యందఱను సంహరించిరమ్మని యాజ్ఞాపించి తా నీశ్వరిలేని వ్యసనమువలనఁ దపంబు చేయుచునుండెను తండ్రియాజ్ఞను దల నిడికొని, వీరభద్రుండుకోపోద్దీపితుండై యాయాగముం జెఱిచి, వచ్చియున్న దేవతలం బడగొట్టి, దక్షప్రజాపతిని రెండు తుండెంబులు గావించెను పిదప, నీ వృత్తాంతంబును దెలిసికొని, బ్రహ్మ కైలాసంబునకుం బోయి, యీశ్వరునిం గూర్చి తపంబుఁజేసి, యతని యనుజ్ఞవడసి, సమీప మందున్న మేకతలను దక్షప్రజాపతికి నతికించి, జీవింపజేసి, సకల దేవతలను బ్రతికించెను. అంత వారు బ్రహ్మను బహు విధములుగా స్తోత్రముఁజేసి, తమ తమ నెలవులకుంబోయిరి.

తొల్లి, పర్వతరాజైన హిమవంతుండును నతని భార్యయగు మేనకయును దన్నుంగూర్చి తపస్సుఁజేసి నప్పుడు, పార్వతి వారికిం బ్రత్యక్షంబై, వరంబు వేఁడుమనఁగా నోతల్లీ, నీవ్రమాకుం బుత్రివిగా జన్మింపవలయునని వేఁడ, నట్లేకానిమ్మని వరంబిచ్చియుండెను. ఆప్రకారంబ, యా యీశ్వరి మేనకగర్భమందు జన్మించి, దినదిన ప్రవర్ధమానయై క్రీడలుసలుపుచుం, బరమేశ్వరుండు దనకుం బతికావలయునని, తపస్సు చేయుచుండెను. ఇట్లుండఁగాఁ దారకాసురుఁడను రాక్షసుండింద్రాదిసురలను ముల్లోకంబులయందు నుండనీక, మిక్కిలి బాధించుచుండ నాయుపద్రవము సహింపఁగూడక యింద్రుండు మొదలైన దేవతలు బ్రహ్మయొద్దకుంబోయి తారకాసురునివలనం గలిగెడు నుపద్రవములను సవిస్తారముగాఁ దెలిపిన నద్దేవుం డారక్కసుని సంహరించుటకు సుబ్రహ్మణ్యుండు పుట్టవలసి యున్నదనియుం బరమేశ్వరుండు త

ఘోనిష్ఠలో నున్నాఁడు కాన మన్మథునివలన నాతపస్సును భంగపఱుపవలయుననియు, నానతిచ్చెను. ఆమాట నింద్రుండు శిరసావహించి సకల దేవతా పరిజనంబులతోఁ దన నివాసంబునకుం జని సింహాసనాసీనుఁడై మన్మథుని రావించి, యతని యర్ధాసనంబునం గూర్చుండబెట్టుకొని, యనేకవిధముల స్తుతించి, యో మన్మథా! నీవు శ్రీపరమేశ్వరుని తపోభంగము సలుపుమని యనేకవిధంబులం బ్రార్థించెను. వాఁడు నా ప్రార్థనంబు నంగీకరించి, తన చెలికాఁడగు చంద్రుఁడు- మలయమారుతము- మొదలైన పరివారముతో, సర్వాయుధములను ధరించి చిలుకవాహనమెక్కి, బైలువెడల నుద్దేశించుచుండ, నతని భార్యయగు రతీదేవి తన నాథునింజూచి యో ప్రాణవల్లభా! నీవిట్లు సంహారకర్తయగు భగవంతుండైన ఈశ్వరునిమీఁద దండెత్తి పోవచ్చునా యని, యతి చింతాక్రాంతురాలై వగవఁగా. మన్మథుఁడామెను మధురవచనంబుల నూరార్చి, సమ్మతిపఱిచి యామెయొద్ద సెలవుబుచ్చుకొని పరమేశ్వరుని చెంతకుం జని అరవిందము- అశోకము- చూతము- నవమల్లికా- నీలోత్పలముల నెడు తనయైదు బాణములం బ్రయోగించి యీశ్వరుని తపంబునకు భంగంబుజేసెను. అప్పుడు పరమేశ్వరుఁడు మహోగ్రకోపముతో, ఫాలనేత్రమును దెఱచి చూచినమాత్రముచేతనే మన్మథుండు భస్మంబాయెను. అంత రతీదేవి, తన పురుషుని తెఱుంగును వసంతుని వలన విని యత్యంత శోకాకులిత చిత్తయై రోదనముఁజేయుచు, తనకుం బురుషభిక్ష నిమ్మని, యనేక విధంబులఁ బరమేశ్వరుని వేఁడఁగా, నప్పరమేశ్వరుఁడు, దయాపరిపూర్ణుఁడై రతీదేవితో నీపతియైన మన్మథుండు నీదృష్టికి మాత్రము శరీరముతో నగపడునని, యనుగ్రహించి, కటాక్షించెను. అంతనారతీదేవి సంతోషితస్వాంతయై తన పెనిమిటినిగూడి, సుఖంబుల ననుభవింపుచు నుండెను.

పరమేశ్వరుఁడును సతీవియోగమువలనం గలిగిన విరహాగ్ని వలన మహావ్యాకులము నొందుచుండ, నొకనాఁడు బ్రహ్మ పరమేశ్వర దర్శనమునకు వచ్చియుండఁగాఁ గుశలవార్తలు జరిగిన తర్వాత, దక్షుని యాగమం దదృశ్యురాలైన పార్వతి హిమవంతునకుఁ బుత్రియైజ

నించి, మహాసౌందర్యవతియు మహాపతివ్రతయునై, నీవె పతికావలయు నని నిన్నుంగూర్చి తపస్సుచేయుచున్నది. గావున నామెను బునర్వివాహంబున నీవేగ్రహింపవలయునని వేడెను అంతకుముందె నారదమహాముని శ్రీవైకుంఠంబున విష్ణుదేవుని సేవించి యతని యనుజ్ఞవడసి కైలాసంబునకు వచ్చి తన సేవసేయుచుండఁగా, నతనింజూచి యో నారదా లోకంబులయం దెచ్చటనేనియు, మిక్కిలి సౌందర్యవతియు మహా పతివ్రతయు బ్రసిద్ధురాలును నగు కన్యకయుండిన నచ్చోటును నాకుం దెలుపుమని యీశ్వరుం డతని నడిగెను. అందునకు నారదుం డోస్వామీ, సర్వసాక్షీ భూతుండవైన నీవెఱుంగని చోటిబ్రహ్మాండంబునం గలదా. అయినను, బరీక్షార్థము నన్నడిగితివిగావున, హిమవత్పుత్రియైన పార్వతి, యతిసౌందర్య గాంభీర్య గుణాతిశయములు గలిగి మీరే పతికావలయునని మిమ్ముంగూర్చి తపస్సుఁ జేయుచున్నది. గావున నామెను వివాహముఁ జేసుకొనవచ్చునని చెప్పెను. అంత నీశ్వరుం డాకన్యం జూడవలయునను నిచ్ఛచేతఁ గైలాసగిరిమీఁద సంచరించుచుండఁగా, నాకన్య పూజార్థము కావలసిన పుష్పములను గోయుటకై యచట నడయాడుచుండ, దానింజూచి సంతోషించి, యదిమొదలుకొని పార్వతీదేవియందు మిక్కిలి యాసక్తి కలిగినవాఁడై, యొకనాఁడప్పర్వత రాజపుత్రి స్నానార్థము తనసఖియలతోడ మానస సరోవరంబున కుఁబోయి, స్నానాద్యనుష్ఠానంబుల దీర్చుకొని, మృత్తికతో లింగంబు గావించియుంచి, పూజించుచుండఁగా, బరమేశ్వరుండు వృద్ధబ్రాహ్మణునివలె వేషముధరియించి, పార్వతీదేవియొద్దకుఁ బోయిన, నామె, యామాయా విప్రునికి నర్ఘ్యపాద్యాదులొసంగి, యుచితాసనంబునం గూర్చుండఁబెట్టి కుశలప్రశ్నములుచేసి, నిలుచున్న యాకన్యం జూచి యతిరూప లావణ్య సౌందర్యములు గల నీవేమిగోరి యిట్టి ఘోర తపస్సు చేయుచున్నావని యడుగఁగా, సిగ్గుపడి, యూరకయుండెను. అంత యాబిడ సఖియలలో నొకతె, యీచిన్నది హిమవంతుని పుత్రి- గౌరి యనుపేరుగలది- పరమేశ్వరుండు తనకుఁ బతికావలయునని కోరి. తపస్సుఁజేయుచున్నదని చెప్పెను. అందునకుఁ గపట

వేషధారియగు నావృద్ధబ్రాహ్మణుండో హాహా, ఇదేమియాశ్చర్యము- ఈశ్వరుఁడు భిక్షమెత్తుకొనువాడు- స్మశానమే యునికిప్రదేశముగాఁగలవాఁడు- వ్యాఘ్రిచర్మమును వస్త్రముగాఁగలవాఁడు- భస్మధారి- ఒకచోటనైన నిలుకడలేక దిరుగుచునుండువాఁడు- అమంగళకరములైన అస్థులే యాభరణముగాఁగలవాఁడు- పిశాచ పరివారముగలిగి ముసలియెద్దునెక్కి- తిరుగునట్టివాఁడు-జాతిలేనివాడు-తలిదండ్రులు లేనివాఁడు—గుణములేనివాఁడు—ఇంతటిభాగ్యముఁగలవాని నేమనివరించితివి. అనేక భాగ్యసంపన్నులైన యౌవనశాలు లుండఁగా వారిని వరింపక యీశ్వరుని వరించుటకంటె, నన్ను వరించుట శ్రేష్ఠమని యా కపటనాటకుఁడగు వృద్ధ బ్రాహ్మణుడు చెప్పఁగా, పార్వతీదేవి కన్నులెఱ్ఱజేసుకొని, బాష్పములుజారఁగా, గద్గదస్వరముగలదై, చెవులను రెండుచేతులతో మూసుకొని మహాదేవ మహాదేవ,మహాదేవ,యని యుచ్చరించి, యీ కుటిల బ్రాహ్మణుని ముఖావలోకనముఁ జేయఁగూడదు. అవతలికిఁ దొలంగింపుఁడని, తన సఖులతోఁజెప్పి, తానును, మఱియొకచోటికిఁ దొలంగిపోయెను. తోడనే, పరమేశ్వరుండును నాగభూషణుండై వ్యాఘ్రాజినముఁ గప్పుకొని, చేతులలో శూలమును- డమరువును- బట్టుకొని, నందివాహనారూఢుండై, దివ్యతేజోమయమైన తన నిజస్వరూపమును నగుపఱిచినఁ, బార్వతీదేవి యాశ్చర్యపడి, తనకోర్కె- యీడేరెనుగదాయని, యత్యానంద సంతోష పరవశయై సాష్టాంగ దండప్రణామములు సేసి యనేక విధముల సంస్తుతించి యతి వినయ భయభక్తులు గలిగి, యంజలిసేయుచు, తన మనోరథంబీడేరెనను సంతసం బుల్లంబున వెల్లివిరసినను, నించుక సిగ్గుచే, తెరచాటునకుంబోవ నప్పుడు పరమేశ్వరుం డామెచెయిఁబట్టుకొని యో ప్రాణేశ్వరి! నీవేల సిగ్గుపడియెదవు నిర్దయుండై మన్మథుఁడు మనల వేచుచున్నాఁడు- తడయనేల- వేగిరంబ నన్ను వరింపుమని పలుదెఱంగులం బ్రార్థింప, నప్పార్వతి యతనింజూచి యో మహాదేవ, నేను పరవశను, నా తలిదండ్రులయనుమతిచే నీవు నన్ను వివాహము చేసికొనవచ్చును. నీ వల్లుండగుటకు వారును సంతసింతురు. తడయక యత్నముచేసెన, దైవంబు ననుకూలిం

చునని చెప్పి, చెయివదలించుకొని, తనంతట మెల్లమెల్లన నరిగె. అంత
బరమేశ్వరుండును సంభ్రమంబుడిగి. యామెయందలి ప్రేమంబును ద్రి
ప్పలేక, ఖిన్నుండై కైలాసమునకుఁ బోయి, సప్తర్షులను హిమవంతుని
యొద్దకుఁ గన్యానిమిత్తమైపంపెను. వారును, హిమవంతునివద్దకుఁ బో
వ యతండును, నాఋషులకు నర్ఘ్యపాద్యాదులొసంగి వారికి సాష్టాం
గ దండప్రణామంబు లాచరించి, వారి రాకకుఁ గారణంబడిగిన, వారు
సకలసంగతులను సవిస్తరంబుగాఁ దెలిపి, వివాహముహూర్తము నిశ్చ
యించు కొనిరి. పిదప, హిమవంతుండు దనపట్టణము నతిచిత్రవిచిత్రము
గా నలంకరించి; వివాహమునకుఁ గావలసిన ప్రయత్నములను జేసి, సి
ద్ధముగా నుండెను. అప్పుడు పరమేశ్వరుండు వివాహమునకుఁ బ్రయా
ణోద్యుక్తుడై బ్రహ్మేంద్రాది దేవతలు యక్ష రాక్షస గంధర్వ కిన్న
రులు మొదలైన పరివారంబులతోడు మహా సంభ్రమముతో, బైలు
దేరి వచ్చెను. హిమవంతుఁడును దన బంధు మిత్రకళత్ర పరివారముల
తో, నెదుర్కొని వచ్చి యనేక మర్యాదలను జేసి, యల్లుని బిలుచుకొ
ని పోయి, పార్వతినిచ్చి, వివాహముచేయించెను. అప్పుడు దేవతలు పు
ష్పవర్షము వర్షించిరి. తుంబురు నారదులు గానముఁజేసిరి. సమస్త దే
వతలు నధిక సంభ్రమానంద భరితులై రని, సాలంకాయనముని చె
ప్పఁగా, వైశ్యమునులు విని, సంతసించి, తదనంతర కథాక్రమంబుఁ దె
లుపుమని వేడఁగా, నమ్మహాముని యిట్లనియె.

మూఁడవ యుల్లాసము ముగిసెను.




# శ్రీ కన్యకా పురాణము.

## నాల్గవ యుల్లాసము.



ఇందు- వైశ్యులు గోకర్ణమూలముగా మర్త్యలోక వాసులగు టయు- బ్రహ్మయీశ్వరాజ్ఞానుసారము పదునెనిమిది పట్టణములను నిర్మించి, యందు ధనధాన్యాదుల సమృద్ధిగ నింపి వైశ్యులనుబ్రవేశింపఁజేసి బ్రహ్మతనలోకంబునకుం బోవుటయు,- జెప్పఁబడుచున్నది.

ఓ వైశ్యమునులారా- యిట్లు పరమేశ్వరుండు పరిణయంబయి, యత్యానంద విభవ మహోత్సవ సంపన్నుఁడై, యా స్వరమయమైన కల్యాణ మహోత్సవ మంటపమునందుఁ, బార్వతితోఁడ రత్న ఖచితసింహాసనాసీనుఁడై యుండఁగా బ్రహ్మయు, దేవేంద్రుండు మొదలగు దేవత లనేకవిధంబుల సంస్తుతించి, వినయ భయభక్తులై, యంజలిచేయుచు నిలుచుండిరి. ఆసమయంబున, నీశ్వరుఁడు తనసఖుఁడగు కుబేరునింజూచి, స్వర్గలోకస్థులును, పాతాళలోకస్థులును, నానావిధములైనకానుకలం దెచ్చి యిచ్చి మమ్ము సేవించిరి. మనుజులుమాత్రమేల రాక యున్నారని, ప్రశ్నచేసె. అందునకుఁ గుబేరుం డోస్వామీ. తారకాసురుని యుపద్రవమువలన భూలోకజనులు మిక్కిలి క్షీణించిరి. కొందఱు వైశ్యమానులు తొల్లి మిమ్ముగుఱించి ఘోరతపస్సులుచేసి,మీ యనుగ్రహమును బొందినవారై, యిచటనే కైలాస వాసులుగా నున్నారు. సకల రత్నసువర్ణాది వస్తు వాహన పరిజ్ఞానముగల వైశ్యుఁ డొకఁడైనను, మర్త్యలోకమున నే దేశమందును లేకపోవుటచేత, భూచక్రము వైశ్యశూన్యముగా నున్నది, గావున భూలోకజనులు కానుకలను దెచ్చుట కనుకూలింపక యున్నదని, చెప్పెను. అంత నారదుండును, వైశ్యులు తపస్సుఁజేసి, మీ యనుగ్రహమును బొంది, మెప్పొ

రికిని నలవిగాని, మీ లోకమందలి వాసముం జెందియున్నందున భూలోకమునందుఁ గ్రియవిక్రియములు చేయందగ్గ వైశ్యులు లేకయున్నారు. గావున, భూలోక కానుకలు రాలేదని చెప్పఁగాఁ బరమేశ్వరుఁడు, గుబేరునింజూచి, చెలికాఁడా యీ వైశ్యమునులు భూలోకమందుండి, ద్రవ్యసమృద్ధి గలుగఁజేసి, సకలధర్మములను బాలించునట్లు జేయుమని యాజ్ఞాపించెను.

తదనంతరము, వైశ్యమునులు కుబేరుని యాజ్ఞప్రకార మతని పుష్పకము నెక్కి, భూలోకమునకువచ్చి, యీశ్వర తృప్త్యర్థము కావలసిన పదార్థములను సంపాదించుకొని తమ వైశ్యవంశస్థులు భూలోకమునందు లేనందున నేవిధమునైనను వైశ్యవృద్ధిని గలుగజేయవలయునను, చింతతోఁ బారియాత్రుఁడను మునినిగని,తమవృత్తాంతములన్ను వివరణముగాఁ జెప్పి, యతనియొద్ద సెలవుతీసుకొని, కైలాసమునకుఁ బోవునంతలో, సావకాశమయినందున, గౌతములును, భార్గవులును, నావైశ్యులంజూచి, మీరు భూలోకవాసులై, యవైదికులరుగమ్మని శపించిరి. అంత వైశ్యమునులు భయపడి శాపవిమోచనము చేయుమని, యనేకవిధముల వేడిన నమ్మహాత్ములు కరుణింపమివలనఁ దాము సంగ్రహించిన వస్తువుల నీశ్వరార్పితముగఁజేయ నతనియొద్దకుఁబోయి, కానుకలొసంగిన, నతండును, సంతసించి, వారలం జిరాయువులరుగమ్మని దీవించెను. పిదప, వైశ్యమునులు శివమందిర ద్వారపాలకులుగా నుండఁగా, నొకదిన మీశ్వర దర్శనమునకు వచ్చిన, దూర్వాసుని వారడ్డగించినందున, నతండు కోపగించుకొని, వారింజూచి, యో వైశ్యులార, మీరు భూలోకగతులరై కర్మహీనులరగుట యకాక, మీ కులంబును భస్మీకృతంబగునని, శపించెను. అంత, నీశ్వరుం డీవృత్తాంతమంతయుం దన దివ్యదృష్టివలనఁ దెలిసికొని, దూర్వాసు నెదుర్కొనివచ్చి శాపహతులై, తేజోహీనులై యుండు వైశ్యులంగని, మీరు నాయొద్దనుండ నర్హులుగారు, భూలోకంబునకుఁ దగిన వారు గాన, నచటికిఁబొండని, యాజ్ఞాపించెను.

పిదప, గొంతకాలంబునకు, నీశ్వరుండు షణ్ముఖుండను పుత్రు నింబడసెను. అతండు దేవసేనాధిపతియై, తారకాసురవధోద్యుక్తుండై శూరపద్ముండు మొదలుగాంగల రాక్షసులను, దారకాసురుని, వధించి, త్రిలోకములయందును రాక్షసబాధను బోంగొట్టి మఱియుం గైలాసంబుం జేరెను.

అంతకుముందు, తారకాసురుని బాధచే, దేశాంతరగతులై యుండిన, బ్రహ్మ క్షత్రియ శూద్రులు, మరలం దమ స్థానములను జేరి, తమంతట నిర్బాధకంబుగం దపంబుం జేయుచుండిరి. అపుడు, భూమండలము వైశ్యశూన్యమై యుండె. ఈశ్వరుండు దాని దివ్యదృష్టిచేం దెలిసికొని, శాపగ్రస్తులైన వైశ్యులంజూచి యో వణిజులార. యిపుడు, భూలోకంబున వస్తుపరిజ్ఞానముగల వైశ్యులు లేరు. మీకును శాపవిముక్తము కావలసియున్నది. గాన, మీరు భూలోకమునకు బోయి ధన కనక వస్తు వాహన సమృద్ధిగలిగి కృషి వాణిజ్యాది కార్యముల జరిపించుచు, యజ్ఞ యాగాది క్రతువులకు సహాయభూతులుగా నుండుండని, వారల కాజ్ఞాపించెను.

అప్పుడు, వైశ్యమును లతనికి నమస్కరించి యో స్వామీ, మేము చిరకాలము తపస్సు చేసినందుకై మునులకును బ్రహ్మాది దేవతలకును నసాధ్యమైన మీ సాలోక్య సామీప్య పదంబులు, మాకు సర్వదా కలుగునట్లు ప్రాప్తించెను. అట్టి మీ దివ్యమంగళ విగ్రహసేవను విడిచి మకరందమందలి మాధుర్యమును మరిగిన భృంగంబులు- సంపెంగ పుష్పాలను గోరినట్టును నవరత్నాదులచేం జేయబడ్డ సొమ్ములను ధరించెడు వారు- పాలపూసల దండలను గోరినట్టును, గజ తురగాందోళికాదుల నెక్కి తిరుగనేర్చినవారు- గాడిదెనెక్క నిచ్చగించిన భంగిని మేము మర్త్యలోకమునకుం బోవనోపమని చెప్పంగా, బరమేశ్వరుండు దయాపరిపూర్ణుండై లోకోపకారార్థము, సూర్యచంద్రాదులేరీతిగా సర్వదా సంచరించుచున్నారో, మీరును నారీతినే నగరస్వాములను నామధేయమును వహించి, మర్త్యలోకంబున నివసించి యుండుండు. నేనును, నగరేశ్వర నామముతోం, బ్రసన్నుండనయ్యెద

ను. పార్వతీదేవియును వింధ్యవాసినీ నామముతో, నవతరించును. ఇట్లు మేము భూమియందు నావిర్భవించి మీకు మిక్కుటమైన సంపదలిచ్చి రక్షించుచుండెదము. కోనకమలయను నామాంతరముగల లక్ష్మీదేవి సమేతుండై, శ్రీమహావిష్ణువును జనార్ధనుండను నామముతో,నావిర్భవించి, మీకులదైవమైయుండి మీ కనంతములైన సౌఖ్యసంపదలను, గలుగఁజేయుచుండెదరు. బ్రహ్మయును, భాస్కరాచార్యుండను నామధేయమువహించి, మీకుఁ బురోహితుండగును. మీలోఁ,బురుషులు, గోవుయొక్క దక్షిణకర్ణమార్గంబునను స్త్రీలు వామకర్ణమార్గంబునను, భూలోకమునందు జన్మింపఁబోవుచున్నారు అంత్యకాలమందు, మీకుఁ బరమపదము గలుగునట్లు చేయుచున్నాను- మీరు నాయాజ్ఞ నతిక్రమింపక, పోవలయు- మీకును శ్రేయంబు గలుగునని చెప్పఁగా, వైశ్యమును లతని వీడ్కొని, బ్రహ్మయొద్దకుఁబోయి యో పరమేష్ఠీ, మాకు మర్త్యలోకవాసము గల్గునట్లు, పరమేశ్వరుం డాజ్ఞాపించెను. పాపభూయిష్టమైన, భూ లోకమందు, మేమెట్లుందుము. దైవఘటనము తప్పదుగావున, మేమచట నేయేకర్మలను జేయవలయు- మాకుఁ దెలుప వలయునని మొఱపెట్టుకొనిరి.

దానివిని, యతండు వారలంజూచి, యో వైశ్యమునులారా, మీరేల వగచెదరు. నేనును, ఇంద్రాది దిక్పతులును సకల దేవాసుర మునీశ్వరులును, నెల్లవారమును, నీశ్వరాజ్ఞను శిరసావహించియుండువారము. మీరు శీఘ్రముగా మర్త్యలోకమునకుఁ బోవలయు- మీకు శుభముగలుగును, నేనును భాస్కరాచార్యుండను నామముతో, భూలోకమునం దవతరించి, మీకుఁ గులగురువుగా నుండి, సకలధర్మములను, బోధింపఁ గలనని చెప్పెను. అదివిని యా వైశ్యు లచ్చటనుండి, వైకుంఠమునకుంబోయి, శ్రీమహాలక్ష్మీ సమేతుండై సింహాసనాసీనుండుగానుండి, శ్రీమన్నారాయణమూర్తికి నమస్కరించి స్తోత్రములుచేసి, పరమేశ్వరుఁడు మర్త్యలోకమున నుండుఁడని మమ్మునాజ్ఞాపించెను. మీ పాదసేవను విడిచి, మేము పోఁజాలమని, మిక్కిలి వ్యసనపడి వేఁడుకొనఁగా, శ్రీమహావిష్ణువు వారలఁజూచి, యో వై

శ్యమునులారా, మర్త్యలోకమునందు, స్వర్ణములు రత్నములు మొదలుగా
గలవానిం బరీక్షఁ జేయఁదగినవారు లేక, భూలోకము శూన్యంగానున్నది. మీ
రును దడయక పోవలయును. మీసంరక్షణము నిమిత్తమై నేను భూచ
క్రమందు జనార్దనుండను నామముచే నవతరించి, మీ కులదైవము
గానుండెదను. శ్రీమహాలక్ష్మియు నాయాజ్ఞ ప్రకారము, కోనకమలయను
నామముచే నవతరింపఁగలదు బ్రహ్మ, భాస్కరాచార్యుండను నామ
ముతో నవతరించి, మీ కులమునకుఁ బౌరోహిత్యము సేయుచు మీకు
గురువుగా నుండుటయ కాక, భూమండలములో మంచిస్థలమందుఁ బురని
ర్మాణముచేయించి వాణిజ్యమునకు ధనధాన్యాదులను మీకు నపార
ముగా నివ్వఁగలండు. కావున నాయాజ్ఞనువిశ్వసించి, పోవలయును. నే
ను మీకు సహాయముగనుండి సకలభోగభాగ్యములను గలుగఁజేసి మి
మ్ము సుఖంబున నుండునట్లు సేసెదనని, యొడంబడిచెను. అంత, వైశ్య
ములును, నారదమహాముని యాజ్ఞప్రకారము, గోగర్భమందొక దివ్య
సంవత్సరము వాసముజేసి, పిదప గోవుకుడిచెవి రంధ్రమార్గమువలన
వైశ్యపురుషులును, యడమచెవిరంధ్రమార్గమున స్త్రీలును బైలుదే
రఁగా, శ్రీపరమేశ్వరాజ్ఞప్రకారము, బ్రహ్మ వారికి జాతకర్మాదులాచ
రించి, కుబేర విశ్వకర్మ సమేతుఁడై, యావైశ్యులను నవరత్నస్థగితమై
దేదీప్యమానమైయుండు, విమానములమీఁద నెక్కించుకొని, భూలోక
మునకుఁదోడ్కొనివచ్చి, నవఖండములలో నుత్తమమైన భారతఖండమం
దు నాంధ్రదేశములో, సముద్రతీరమునకు సమీపముగా గౌతమీనదీ
తీరమందు రమ్యమైన యొకసరస్సుంజేర నరుగినం దుద్భవించియున్న తా
మరస తీగలలో, నొకనాళములో, స్వర్ణమయములైన మూఁడుపద్మ
ములుంటనుజూచి, యావైశ్యులాశ్చర్యమునొంది బ్రహ్మతో నిదియేమి
యాశ్చర్యము యిట్లుండుటకుఁ గారణము, మాకు దెలుపవలయునని, య
డిగిన బ్రహ్మ వారలంజూచి యో వైశ్యులారా యిది పూర్వము పుల
స్త్యఋషి తపస్సుచేసిన యగ్నికుండము. ఈశ్వరుండును విష్ణువును నే
నును ఆఋషి మనోభీష్టసిద్ధ్యర్థము ప్రసన్నులమైతిమి. అప్పుడు జోతి
ర్మయమైన లింగరూపమును, నా పద్మములయందుఁ గల్పించితిమి గా

వున దీని మూలస్థానేశ్వరుఁడనియును, మల్లికార్జునుఁడనియును, మునీశ్వరులు చెప్పుచున్నారు. మేము ముగ్గురమునూ, మూఁడు పద్మములుగా నీ యగ్నికుండము నుంటిమి. మా యనుగ్రహామువలన నా యగ్ని శాంతి నొందఁగా నందు జలముగలిగెను జ్వాలలు కలువలుగా నయినవి. హా విష్ణుశైవాలంబయ్యె ఇది పులస్త్యతీర్థమని, మహాప్రసిద్ధినిబొందె. ఈసరోవరసమీపమునందు మీకుఁబట్టణము కాగలదని చెప్పి బ్రహ్మ విశ్వకర్మనుజూడ, నతండును శుభలగ్నమందు, వాస్తుశాస్త్రోక్త ప్రకారము పంద్రెండు సూర్యవీధులను పదియారు సోమవీధులను నుండునట్లుగా, నొక పట్టణమును నిర్మించెను. ఆపట్టణమందు మధ్యవీధిలోఁ గనకమయమైన గృహాములయందు, శుభస్థిరలగ్న గ్రహానుకూల్యంబులు గల సమయంబున, బ్రహ్మ పుణ్యాహవాచనాదిసత్క్రియలజరిపిమంగళతూర్యవాద్యంబులు చెలంగ నవైశ్యులను గృహంబులం బ్రవేసింపజేసి, పశ్చిమభాగంబున బ్రాహ్మణులను ప్రాగ్భాగంబున క్షత్రియులను, దక్షిణోత్తరభాగంబుల శూద్రులను నునిచి, వారలకుఁ గుబేరునిచేత, సమస్తైశ్వర్యములను గలుగఁజేసి యాపట్టణంబునకుఁ బూర్వదిగ్భాగంబున గంగయు దక్షిణదిగ్భాగమందు సముద్రమును బశ్చిమమందు గోస్తనీనదియు, నుత్తరదిక్కునందు వశిష్ఠగంగయు నుండునట్లును దేవాలయబ్రహ్మాలయములతో నారామవనతటాకంబునను,నిర్మించి, యావనంబులయందు మాతులుంగ లవంగ పున్నాగ దాడిమ ఖర్జూర చంపాది వృక్షంబులను గల్పించి యతిరమ్యంబుగా శోభింపంజేసి. మఱియు, సమస్తధాన్యవిశేషంబులు పండునట్టి యోగ్యత యారమ్యమైన భూములకుఁ గల్పించె, ఇట్లునిర్మించిన యప్పట్టణము, మహామనోజ్ఞమైన సౌధాంతరములు గలిగి, యనేక గోత్రజులగు వైశ్యులు నివసించియుండు మూలపట్టణ మగుటంజేసి పెనుగొండయని పేర్కొనంబడియె.

పిదప నా దేవాలయములయందు వింధ్యవాసినీ సమేతుఁడైన నగరేశ్వరస్వామిని గోనకమల సహితుఁడగు జనార్ధనస్వామిని బ్రతిష్ఠించి వైష్ణవాగమంబుల గల్పించి ప్రచుర పఱిచెను. తోడనే భైరవాది గ్రామదేవతలను బ్రతిష్ఠించి, తత్పూజావిధానంబులను దెలిపెను.

ఇట్టి మహోతన్నమైనపట్టణమునకు సమీపమున, బాలకొలను, ఘంటసాల ఆసంట, ధనదపురము, విశాఖపట్టణము ధర్మపట్టణము, పెందలూరు, ఏలాపురము ముమ్మడి శివపట్టణము నగరపీటిక, పాంచాలపురము, నరసింహపురము, భీమవరము, వీరనారాయణ పురము జగన్నాథపురము, నిరవద్యకము కళింగపట్టణము అను నీ పదునెనిమిది పట్టణములను సృజించి యాపట్టణముల యందును, వైశ్యులలోఁ గొందఱిని నుంచి వారికి సకల సంపత్తుల నిచ్చి, కృషి వాణిజ్య పాశుపాల్యములు మొదలగు వ్యవహారములు జరుగునట్లు, సకల ధర్మముల నుపదేశించి, యా పట్టణములెల్ల, వజ్ర, వైడూర్య, గోమేధిక, పుష్యరాగ, మరకత, మౌక్తిక పద్మరాగ ప్రవాళములు మొదలుగాఁగల వివిధరత్నములచేఁ బ్రకాశించుచు, నతిశృంగారంబులగు హర్మ్యంబులచే వెలయుచుఁ బ్రతి గృహమందలి భేరీ నిస్సాణఘంటా శంఖకాహళాది నానావాద్య విశేషంబులచే ఘోషించుచు, నత్యైశ్వర్యము గలిగి నానాట మిక్కిలి యభ్యుదయ పరంపరా సమృద్ధంబులయ్యె. అంత బ్రహ్మ విశ్వకర్మ మొదలగువారితో, దేవలోకంబునకుం జని పరమేశ్వరునకు సాష్టాంగ నమస్కారంబులొనర్చి, యంజలి బద్ధుఁడై స్తుతించి యీ వృత్తాంతంబంతయుం దెలిపిన నప్పరమేశ్వరుండును, నత్యంత సంతుష్టాంతరంగుడయ్యెనని, సాలంకాయనముని చెప్పెను. అదివిని యా వైశ్యమునులు హర్షించి యవ్వలి కథాక్రమమును దెలుపుమని, వేఁడిరి. అమ్మహామునియు నట్లు సేయుదునని చెప్పందొడంగె.

నాలవ యుల్లాసము ముగిసెను.



శ్రీవాసవాంబాయైనమః.

# శ్రీ కన్యకా పురాణము.

## ఐదవ యుల్లాసము.



ఇంక, వైశ్యకులశ్రేష్ఠుండగు కుసుమ శ్రేష్ఠి ధనధాన్యాది సంపత్తులు గలిగి యనేక ధర్మములం జేసి కీర్తిఁబొందుటయు అతండు పుత్రకామేష్టియాగమొనర్చి యీశ్వరానుగ్రహము వలన, విరూపాక్షశ్రేష్ఠియను పుత్రుని, వాసవాంబ యను పుత్రినిన్, బడయుటయుం జెప్పంబడుచున్నవి.

ఓ వైశ్యమునులారా, యిట్లు శ్రీ వింధ్యవాసినీ నగరేశ్వరులను శ్రీ కోనకమల జనార్దనులను ప్రతిష్ఠించి వసోత్సవ, పక్షోత్సవ మాసోత్సవములను జరుపుచు, భైరవాది దేవతలను యథోచితంబుగాఁబూజించుచు, సప్తసంతానాది ధర్మంబుల ననుష్ఠించుచు, ౧౦౨ గోత్రజులై, స్వకీయకుల వ్యవహార ధర్మంబులగు, కృషి వాణిజ్యగోరక్షణ వృద్ధిజీవనంబులను, యజనాది కర్మత్రయంబులను, షోడశ కర్మములను సలుపుచు, శ్రీ జనార్దన నగరేశ్వరుల కరుణవలనఁ బుత్రపౌత్రాభివృద్ధిగలిగి, కృత త్రేతా ద్వాపర యుగములయందును గలియుగాది యందును సశ్వైశ్వర్యములుగలవారై సర్వదేశములయందును, వ్యాపించిరి.

పిదప వైశ్యులలో శ్రీ నగరేశ్వర జనార్దనులయందు నతిభక్తిగలవాఁడును, మిక్కిలి ధనధాన్య సమృద్ధిగలవాఁడును, ౧౦౨ గోత్రజులలో శ్రేష్ఠుండును, నతిధార్మికుండును, నుద్వాహకుల మను సంస్కృత నామముగల పెండ్లి కులగోత్రజుండును. నగు కుసుమ శ్రేష్ఠి ... వైశ్యశిఖామణి, తన భార్యయగు కుసుమాంబతో సకల భోగభాగ్యము లనుభవించుచు, కృషి వాణిజ్య గోరక్షణ వృద్ధి జీవనములచేత, బహుద్రవ్యములను సంపాదించి దేవాలయ- బ్రహ్మాల, యగ్రహార

-తను, తేరాకామలం బ్రసిద్ధించి నాసకొక కొంతయు సంభవింపకుండు నట్లు వేలకొలది ద్రవ్యములుంచి యనేక గోదాన భూదానాది సకలదానములను జేసెను. అతని ధర్మపత్నియగు నా కుసుమాంబయును బతి భక్తిగలిగి పతికి సకల శుశ్రూషలు సేయుచు పతియె దైవంబని గొలుచుచు 'ఇట్టి ధార్మికులే లోకంబున నైనను గలరా' యని జనులచేఁ బొగడఁబడుచు, వారు నివసించుచుండిరి. అప్పుడొకనాఁడు కుసుమాంబ తనపతి పుష్పాల పానుపుపైఁ బవళించియున్న సమయంబున నాతనికి విడియము లందిచ్చుచు శ్రమతీరునట్లు విసరుచుఁ గాళ్లు పిసుకుచుండినను, నాయనయతిచింతాక్రాంతుడై యుండ దానింజూచి, యా కుసుమ శ్రేష్ఠి, యీవిధంబునఁ జింత నొందుట కేమి కారణమని, యడుగఁగా గుసుమగంధి తన పెనిమిటిం జూచి మనకింత భాగ్యముఁ గలిగియుఁ గులమువారిలో వన్నె కెక్కియు, సకల వ్రతముల నాచరించియు నమస్త దేవతారాధనంబులను, సకలధర్మములం జేసియుఁ బుత్రసంతానము లేకపోయెనుగదా యని వగచుచున్నాను. కావునఁ బుత్రులు గలుగు నదుపాయము వెదకవలయునని చెప్పఁగాఁ గుసుమ శ్రేష్ఠి విని పుత్రులంబడసి, యిహలోకంబున ననేక సౌఖ్యంబుల ననుభవించుటకంటె ధర్మంబులం జేసి పరలోక సౌఖ్యములను గలుగఁజేసికొనుట మనకుఁ జాలునని చెప్పెను. అంత నా సతి మరలఁ దనభర్తం జూచి, లోకంబున మీకుఁ దెలియని ధర్మంబునుం గలదా. అయినను నాకుఁ దెలిసినంతవట్టు వచించెద. "అపుత్రస్యగతిర్నాస్తి" పుత్రుఁడు లేనివానికి మంచిగతి యెట్లు కలుగును. ఇహపరలోకములయందు సకల సుఖంబులను గలుగఁజేయువాఁడు, పుత్రుఁడేకదా. పుత్రుఁడుఁ గలుగకుండిన, మనకు సద్గతి లేకపోవుటయు కాక, మన పితృవులకును, లేకుండుటను, నేనెట్లు సహింపవచ్చును. కావున మన మవశ్యము పుత్రునిం బడయవలయునని చెప్పఁగా, నా కుసుమశ్రేష్ఠి, భార్య నాదరించి యో వెఱ్ఱిదానా, మనుష్య యత్నంబున ధర్మంబు లెన్నియేని చేయవచ్చును గాని పుత్రునిం బడయుట దేవతలకైన నసాధ్యము. అయినను నేను జ్యోతిష్కులును మహాశాస్త్రవేత్తలును నగు బ్రాహ్మణోత్తముల రా

వించి వారి యనుగ్రహంబునఁ, బుత్రుం బడయుదునని భార్యతోఁ జె
ప్పి శ్రీ నగరేశ్వరస్వామి కల్యాణమంటపంబున, శ్రీగురు భాస్క
రాచార్యులు మొదలగు మహావిద్వజ్జనులైన బ్రాహ్మణులను, తన బం
ధువులను, నొకచో సభచేర్చి- యథోచితంబుగా గంధపుష్ప ఫలాదుల
చే, నా సభికులం బూజించి, ప్రదక్షిణ పూర్వకమైన సాష్టాంగ దండ
ప్రణామంబు లొనర్చి తమకు సంతతిలేని కొఱంతను వారికిఁ దెలిపి
సంతానము కలుగుటకుఁ దగు సదుపాయమును దెలియఁజేయవలయు
ననిః వేడెను. ఆసభికులును, ఓ కుసుమశ్రేష్ఠీ నీ వపారమైన ధర్మము
లు చేయుచుండఁగాఁ బుత్రులు లేమికొఱంత నీకులేదు. అయినను, నీ
వు పుత్రాపేక్షగలవాఁడవై, మమ్మడిగితివి. గావునఁ దొల్లి దశరథమ
హారాజు చేసినట్టు నీవును, బుత్రకామేష్ఠిని జేయుమని యాజ్ఞాపించిన
నా ప్రకార మతఁడొక శుభముహూర్తంబున, శ్రీగురు భాస్కరా
చార్యుల నాచార్యునిగా నియమించుకొని మహాతప స్సంపన్నులగు,
బ్రాహ్మణోత్తముల నుపద్రష్టలఁగాను, హోతలఁగాను, ఋత్విక్కులఁ
గాను, నానావిధ యజ్ఞాంగ సంధాన కర్తలఁగాను, యేర్పఱచి మి
క్కిలియగు నాజ్యము నపరిమితములైన సమిధలు, మొదలుగాఁగల నా
నావిధ యజ్ఞద్రవ్యములనుజేర్చి మహాజనుల యనుజ్ఞవడసి శాస్త్రోక్త
ప్రకారముగాఁ బుత్రకామేష్ఠిని జేయనారంభించె. ఆ యజ్ఞగుండము
లో గజతుండప్రమాణము నెయ్యి హోమముఁజేయుచుండగా నగ్ని
హోత్రుం డా యాహుతులచేత తృప్తినొంది చాలా సంతోషించి యి
కనిచ్చు నాహుతుల భక్షింపఁ దనకుశక్తిలేదనియుఁ గాదని భక్షించిన
నజీర్ణబాధ కలుగుననియుఁ బూర్వకాలమందు శ్వేతకేతుండను మహా
రాజు యజ్ఞముఁజేసినప్పు డపరిమితమైన ఘృత ధారలతో నిచ్చిన యా
హుతులను భక్షించుటచేఁ దనకు నజీర్ణబాధ గలుగఁగా నప్పుడు మ
హాబల పరాక్రమములుగల యర్జునుడు సహాయుఁడుగానుండి యనే
కమూలికలతో గూడియున్న దేవేంద్రుని ఖాండవమను వనమును భ
క్షింపఁజేయుటచే నా యజీర్ణబాధ నివర్తించె ఇప్పుడట్టి సమ
ర్థుండు లేనందున మిక్కిలి యాద్యమును ద్రావరాదని సూచించి

యగ్నిదేవుఁడు ప్రత్యక్షమై పరమాన్నమిచ్చి దీనిభుజించిన సంతానాభివృద్ధిగలుగునని దీవించి యంతర్ధాన మాయెను.

అంతఁ గుసుమశ్రేష్ఠి తన మనోభీష్టము సిద్ధించెనని మిక్కిలి సంతుష్టాంతరంగుఁడై తన భార్యయైన కుసుమాంబకు, నా పాయసమునిచ్చి శ్రీగురు భాస్కరాచార్యులు మొదలగు బ్రాహ్మణులను, ధన కనక వస్తువాహనాది బహుమతులచేత, సన్మానించి బ్రాహ్మణాశీర్వాదములఁ జెంది, యవభృధస్నానముఁజేసి తన మందిరంబునకుం బోయె. పిదప నా కుసుమశ్రేష్ఠి భార్య, యాపాయసమును భక్షించి గర్భము ధరియించెను. కుసుమ శ్రేష్ఠియు, యథాక్రమముగాఁ బుంసవనాది క్రియల జరిపించె.



## (శ్రీ) వాసవ కన్యావతార ఘట్టము

పిమ్మట వైశాఖ శుద్ధ దశమి శుక్రవారమునాఁడు, మంచి ముహూర్తంబునఁ, గుసుమాంబ సుపుత్రిని జగన్మోహనాకారముగల, మహా సుందరవతియైన సుపుత్రినిం, గనియె. ఆ పుత్రిక చతుర్భుజములు ఖడ్గ- పద్మము- పాశము- వీణె- శుకము- వీనిఁ జేతులంబట్టుకొని యనేక చంద్రులతో సమానమైన కాంతి గలిగి, పుటపాక శోధితమయిన బంగారుఛాయగలిగి స్వర్ణాభరణ భూషితురాలై, పచ్చని చీరఁగట్టుకొని, వజ్రమణులచేఁ జేయఁబడ్డ కుండలములను ధరించుకొని, తన నిజస్వరూపమును జూపిన నా కుసుమశ్రేష్ఠి, యతిభీతినొంది, యాదేవిదర్శనంబు వలన, దివ్యజ్ఞానసంపన్నుఁడై, స్తుతించి యంజలిబద్ధుఁడై, నిలుచుండఁగా నాదేవి యాతనింగాంచి, నీ జన్మాంతర తపః ప్రభావంబు వలన, నీకు నేను బుత్రినై పుట్టితినని చెప్పి, యతనివలనఁ జేయఁబడు, పూజల నంగీకరించి, యెప్పటివలె, నా కుసుమశ్రేష్ఠిని, యాబద్ధునిగాఁజేసి తానును మాయావియై, కన్యగా నావిర్భవించెను.

అంతఁగుసుమశ్రేష్ఠి యతిప్రమోద భరితహృదయారవిందుఁ డగుచు, శ్రీసద్గురు భాస్కరాచార్యులు మొదలుగాఁగల బ్రాహ్మణోత్తములను రావించి జాతకర్మాది క్రియలను విధ్యుక్త ప్రకారంబున జరిపించి బీజదానాద్యనేక దానంబులఁ జేసి పురుడు వెళ్ళఁగానే యాకుమార రత్నంబునకు, విరూపాక్షశ్రేష్ఠి యనియు, పుత్రికా రత్నంబునకు, వాసవాంబ యనియు, నామకరణం బొనర్చెను. అంతనా బాలుఁడును, బాలికయును, శుక్లపక్ష చంద్రునివలె, దినదిన ప్రవర్ధమానులై తమ తలిదండ్రులకును, గులమువారికిని నధిక సంతోషమును గలుగఁజేయుచుండిరి. ఆ చిన్నవానికి ౧౨ సంవత్సరములు కాఁగానే, యుపనయనముఁ జేసి, వేదాధ్యయనాది స్వకృత్యముల నాచరించుటకుఁ, గులగురువైన భాస్కరాచార్యులయొద్దకుఁ బంపిరి. పుత్రికకు, వివాహయోగ్యకాలమైయుండెను. అనిసాలంకాయనముని చెప్పఁగా, వైశ్యమునులు సంతుష్టాంతరంగులై, ఆవలి కథాక్రమంబడిగిన, సావధానచిత్తులై వినుండని, చెప్పఁదొడగెను.

ఐదవ యుల్లాసము ముగిసెను.



శ్రీవాసవాంబాయైనమః

# శ్రీకన్యకాపురాణము.

## ఆరవ యుల్లాసము.

ఇంకుఁ జంద్రవంశస్థుఁడైన విష్ణువర్ధన మహారాజు దిగ్విజయముఁ జేయుటయు- పిమ్మటఁ, దన రాజధానికి వచ్చుచుండగా, మార్గ

ములో, వైశ్యుల ప్రార్థన నంగీకరించి, పెనుగొండఁ బ్రవేశించుటయు అచట వాసవ కన్యంజూచి. వివాహాపేక్ష గలవాఁడై, యామెను యాచించుటయు- వైశ్యుల యనుమతిచేత ముహూర్తము నిశ్చయించుకొని, నిజనగరంబునకుఁ జనుటయుఁ- జెప్పఁబడుచున్నది.

ఓ వైశ్యమునులారా, యీ భూమండలమందు, శ్రీమార్కండేశ్వరులకు నిలయమై, యనాది పుణ్యక్షేత్రమని, మిక్కిలి ప్రసిద్ధికెక్కిన, రాజమహేంద్రవరమను, పట్టణము కలదు. అపురమున, జిత్రకంఠుఁడను గంధర్వుఁడు, వైశ్యమునుల శాపముచేతఁ, జంద్రవంశస్థుఁడయిన పాండురాజునకు నేడవ మనమండుగాఁ బుట్టి విష్ణువర్ధనుండను పేరుగలిగి, యేక చ్ఛత్రాధిపత్యముగాఁ బాలింపుచుండును. ఆరాజు, మిక్కిలి బలపరాక్రమంబులు గలిగి, రాజాధిరాజై తన రాజ్యమందలి ప్రజల నతిమోదముతోఁ బాలించుచుఁ దన్ను శరణుచొచ్చిన నృపులను గాపాడుచు నెదిరించినవారిని శిక్షించుచు వర్ణాశ్రమధర్మములను జక్కఁగాఁ బాలించుచు, విశేషమయిన ధర్మంబులఁ జేయుచు, లోకమందు మిగులఁ బొగడ్తనొంది సకల సామ్రాజ్యలక్ష్మీవిభవాతిశయ యుతుఁడై రాజ్యపాలన మొనర్చుచుండఁగా, నొకనాఁడు, తన సభామంటపమందు సింహాసనాసీనుఁడై, యనేక దేశాధిపతులు కప్పములు తెచ్చి కట్టి తన్ను సేవింపఁగా భట్రాజులు పొగడఁగా గాయకోత్తములు మంగళ వాద్యంబులు సేయుచుండఁగా విద్వజ్జనులు వివిధకళా శాస్త్ర ప్రసంగంబులు సలుప నందు ప్రశస్తమైన భారత కథా ప్రసంగమందు మిక్కిలి బుద్ధిని లయింపఁజేసి, వినుచు, దిగ్విజయము సేయుట పరాక్రమవంతుఁడనగు రాజునకు ధర్మముగావునఁ, దాను దిగ్విజయము చేయుదునని నిశ్చయించి, దన సమీపమందుండు, విజయసింహ- విక్రమశాలి, వీరసేన- సుమంత- శాంతన- చంద్రచూడ- సింహధ్వజ- సుమందన- అమంద- విక్రమ- బలోద్ధత- భీమగ్రీవ- సమగ్రాయుధ- శుభగ్రీవ- మహావీర- కుమారకంఠీరవులను పదియాఱుగురు ప్రధానులును, అతిరథ- మహారథ- సమరథ- అర్ధరథులనెడు- బహువిధ రథికులును, మహా యోధవీరులును, అనేక కోట్ల వీరభటులు

ను మహా భుజబల పరాక్రమములుగల వీర రాహుత్తులును బ్రాస-పట్టస- ముసల- ముద్గర- కుంత- భిండివాల- శూల- కరవాల- చక్ర-క్రకచ- ఖడ్గ- గదా- వజ్ర- శక్తి- శరాసనములనెడు ననేక విధంబులగు నాయుధములను చేతఁబట్టుకొని కొలువ- రథ గజతురగ పదాతి బలంబులు, వెంబడిరాఁగాఁ బంచమహా వాద్యములు మ్రోయఁగాఁ దన ప్రధానమంత్రియగు విజయసింహునిం జూచి తాను దిగ్విజయమునకు బైలుదేరెడు వర్తమానమును దేశమం దంతటఁ జాటింపఁ బంపుమని, నియమించి తాను, స్నాన సంధ్యా ద్యనుష్ఠానంబులఁ దీర్చి యిష్టదేవతా ప్రార్థనంబొనర్చి, యభిమతాహారంబులంగొని బ్రాహ్మణాశీర్వాదంబుల నంగీకరించుచుఁ, దన రాజ్య విచారణంబునకు నాప్తమంత్రుల నియమించి, తన పట్టపు గుఱ్ఱమెక్కి, జయభేరి వేయించి, దిగ్విజయార్థియై దండు వెడలెను. అప్పుడు, కొన్ని దేశంబుల యధిపతులు,నవరత్నములు- నేనుఁగులు- గుఱ్ఱములు- మొదలుగాఁగల వస్తువులను గానుకలిచ్చి మ్రొక్కిరి. మరికొన్ని దేశముల రాజులు శరణాగతులైరి. కొందఱు యుద్ధముఁజేసి, పరాజితులై, తమ దేశములను వదిలిపారిపోయిరి. ఈరీతిగా, బూర్వదక్షిణ పశ్చిమోత్తరంబు లనెడు చతుర్దిక్కులంగల యంగ- వంగ- కళింగ- బంగాళ- నేపాళ- చోళ- కేరళ- ద్రవిడ- కుంతల- బర్బర- కుకుర- కాశ్మీర- కర్ణాట- లాట- ద్రవిడ- యవన- కన్నడ- కాంభోజ- మగధ- పాంచాల- మాళవ- కేకయ- మహారాష్ట్ర- సౌరాష్ట్ర- విదర్భ ప్రముఖ నానా దేశ రాజులను సాధించి, వారివలన ననర్ఘములగు మణి- కనక- వస్త్ర- భూషణ- భద్రేభ- ఘోటక- స్యందన- నాందోళికా- ఛత్ర- చామర- ధ్వజ- ముఖ్యంబులగు నపరిమిత వస్తువులం గొని, వారి దేశంబులయందుఁ, దనధ్వజ పతాకంబులను నిలిపి, మహా బాహు పరాక్రమ ప్రభా విభాసితుండై పాండవ మధ్యముని వలె, విజృంభించి, కల్యాణపట్టణము చేరఁగా నాపట్టణమేలు చుండెడు సామంతరాజు యుద్ధసన్నద్ధుండై, తనరథ- గజ తురగ- పదాతులతోడ వచ్చి, మహా ఘోరమైన ద్వంద్వ యుద్ధంబు సేయుచుండఁగా, రక్తప్రవాహములు పారుచు నుండుటం జూచి, భయ

గ్రస్తుండై కల్యాణరాజు, విష్ణువర్ధనునకు, ననేక కానుకలు సమర్పించి శరణువొచ్చిన వానికి నభయం బొసంగి, యితరంబైన యనేక సామంతరాజులను జయించి, వారియొద్ద కానుకలను బుచ్చుకొని యఖిల దిగ్విజయంబు గావించి, విజయవాటిపుర ప్రాంతంబుఁ జేరి, మహాపుణ్యతీర్థంబైన కృష్ణానదీ దర్శనంబుఁ జేసి నమస్కరించి, యానదీ పరిశుద్ధ జలంబుల స్నానమాచరించి, యనుష్ఠానంబులం దీర్చుకొని ధన ధాన్య వస్త్రాదుల నా యగ్రహారికులగు బ్రాహ్మణులకు నతి ప్రీతినిచ్చి, వారికి షోడశోప చారంబులం జేసి, యా నదీ తీరమందు ననేకమహర్షుల కానా సంబగు మహారమ్యమైన, యింద్రకీల పర్వతమునెక్కి, యచ్చటనుండు శివాలయములను సేవించుచు, నచ్చటి యద్భుతంబులంజూచుచుఁ దనతోడ వచ్చెడి విజయసింహుఁడు మొదలుగాగల మంత్రులకు, నాయా పుణ్యక్షేత్రంబుల ప్రభావములం దెలుపుచుఁ, దొల్లి తన తాతయైన యర్జున మహారాజు తీర్థయాత్రసేయుచు నీ క్షేత్రమందుఁ దపస్వివేషముదాల్చి యిచ్చటనున్న మహర్షులతో సరస సల్లాపములను జేయుచు నుండఁగా, ముఖాసురుండను రాక్షసుండు వరాహరూపమెత్తి యిచటనున్న ఋషులను బాధించుటం జేసి, యా బాధల నోర్వంజాలక ఋషులు మొఱబెట్టఁగా నాధ్వనివిని యర్జునుఁడు తనగాండీవమును బుచ్చుకొని యెక్కువెట్టి గుణంబుసారించి యస్త్ర ప్రయోగముఁ జేసెను. ఆ సమయమందే పరమేశ్వరుఁడు బోయవాని వేషముతోవచ్చి, ధనస్సునెక్కుబెట్టి తానును బాణములఁ బ్రయోగించెను. ఆ యిరువురు ప్రయోగించిన బాణమువలన నా పంది ప్రాణంబులుబాసి నేలంబడెను. పిదప వారిరువురు నా పందిని నేను గొట్టితి, నేను గొట్టితినని, వాదించుచుఁ గుపితులై, యొండొరులు యుద్ధము చేయ నారంభించిరి. పరమేశ్వరుండైన నా మాయకిరాతుం డర్జునుమీఁద, నస్త్రవర్షము గురిపించెను. అర్జునుండా బాణంబులనెల్ల, నాకాశమార్గమునసే చుక్కలుగ విరియఁగొట్టి పరమేశ్వరుని కానరాకుండునట్లుబాణపరంపరల ముంచెను. ఆ బాణములను, గపటవేషధారియైన యా పరమేశ్వరుండు తన మాయవలన, నదృశ్యంబులు గావించెను అప్పు

డుఅర్జనుం డధిక శౌర్యంబుతోడం, దన ధనస్సుచే, నీశ్వరుని నెత్తిప గలఁగొట్టెను. ఆ సమయంబునఁ, బరమేశ్వరుం డతని పరాక్రమముఁ జూడవలయునని యిచ్ఛగలిగి; యర్జనుని ధనుస్సును దనశిరంబున నిలికించుకొనెను. అర్జనుండు మహా కోపముగలవాఁడై, మల్లునివలె మిక్కిలి యుద్ధముఁజేసి, యీశ్వరుని మెప్పించెను. అప్పుడు పరమేశ్వరుండు ప్రత్యక్షమై, యర్జనునికి ననేక దివ్యాస్త్రములిచ్చి, యతని మనోభీష్టంబు సిద్ధింపఁజేసెను. కావున నిచట మల్లేశ్వరుండని, యీశ్వరప్రతిష్ఠ, మావంశస్థులు చేసిరని చెప్పి, శైలారోహణము జేసి, మల్లికార్జున- శంకరస్వామిని- దుర్గను- నచటనుండెడు నితర దేవతలను బూజించి, నమస్కరించి, స్తోత్రంబుఁల జేసి, సమస్తపూజలంగావించి, యా విజయవాటిపుర విశేషంబులను నా పురజనులు చెప్పఁగా విని సంతోషించి, యచ్చటనుండి బైలుదేరి తన పట్టణమునకుఁ బ్రయాణోన్ముఖుండై విధివశంబున పెనుగొండపుర ప్రాంతంబునకుఁ బైదోవగాఁ బోయి, యా పురమునకు సమీపముగానుండెడు పనస- జంబూ- కపిత్థ- రంభా- నారికేళ- వృక్షములు మొదలుగాఁగల నానావిధ పుష్పఫలభరితవృక్షంబులచే, మిక్కిలి రమ్యమై విలసిల్లెడు, శృంగార వనంబునందు దనపరివారముతోఁ బ్రవేశించి యచ్చటి శృంగారములను జూచుచు, నచ్చట నున్న స్వర్ణమయమైన మేడలో, రత్నఖచితమైన సింహాసనముం దుఁగూర్చుండి, యావనంబు నుమిక్కిలి శ్లాఘించి, యీశృంగారవనమెవ్వరిదియని, యచట విహారార్థము వచ్చి యున్న బాలనగరుల నడిగి, యా మేడపైనుండి, సమీపమందుండెడు పెనుగొండపురముం గని, యందుండు నతిశృంగారమగు, స్వర్ణమయమైన మేడలంగాంచి, యీ పట్టణము, దేవమణి కామధేనువులవలనఁ బ్రకాశించుచుండు, నింద్రపట్టణమున కంటెను, నవనిధులు గల యలకాపురి కంటెను, నింద్రనీల పద్మరాగమణులచేఁ బ్రకాశించుచున్న- వరుణపట్టణంబు కంటెను, స్ఫటిక కాంతులచే విలసిల్లు, శివపురంబుకంటెను, నధికమైన కాంతిచేఁ బ్రకాశించుచుండెడు నిట్టిపురంబిచనుండుట నాకెన్నఁడుఁ దెలియదు. ఈ పురం బెవ్వరిది దీనిపాలించువాఁ డెవ్వండు. అతండు నాయొద్ద కెన్నఁడును

రాఁ జేమి. అని యడుగఁగా, బాలనగరులు మిక్కిలివినతులై యోరాజాధిరాజ, బ్రహ్మ దయాపూర్ణుఁడై, విశ్వకర్మ కాజ్ఞాపించిన, నతఁడీపురమును నిర్మించెను దీనికి పెనుగొండయను పేరు దీనితోఁడఁ బదునేనిమిది పట్టణములు సృజింపఁబడియె. వీనినన్నింటిని, బ్రహ్మ వైశ్యులకు దానముచేసెను. భూపాలకులును, నీపురమును, సర్వసమ్మతముగాఁ, బాలించుచున్నారనిన విని విష్ణువర్ధనమహారాజు, మిక్కిలి సంతోషించెను అప్పుడా విష్ణువర్ధనమహారాజు, ససోదార్థము తమ పనమందుఁ బ్రవేశించియుండు వృత్తాంతమును వైశ్యవరులు దనపాలకులవలనఁ దెలిసికొని, యా మహారాజు దర్శనముఁ జేయుకొఱకు, ననేకరత్న భూషణాదులను, ముక్తాహారంబులను చీనాంబరములను, గజతురగమ్ములను, మఱియు ననేక విశేష వెలగల వస్తువులను కానుకలనుంచవలయునని యత్నముఁ జేయుచుండఁగా, వైశ్యబాలులు తమ పెద్దలనడ్డగించి, మీరిట్లు యోచింపక యేల త్వరపడియెదరు. ఇట్టి కానుకలను మీరు కొంచుకపోయిన, వీని నంతయు, వివరణముగా లెక్క వ్రాయించి, ప్రతియేటను, నిట్టి వెలపొడుగు వస్తువులను, గానుకగాఁ దెండని, మనలఁ బాధింతురు. కావున, నట్టి వస్తువుల నిప్పుడు కొంచుక పోఁగూడదు. ద్రాక్ష చెఱుకుతుంటలు- ఖర్జూరము- దాడింబము- అఱఁటిపండ్లు- మొదలు గాఁగల మధురఫలములను, మల్లెలు మొల్లలు మొదలుగాఁగల పుష్పములను కర్పూరము- చందనము- కస్తూరి- మొదలుగాఁగల సుగంధ వస్తువులను, నెయ్యి- పాలు- పెరుగు- కండచక్కెర- మొదలగు రస ద్రవ్యములను తాంబూలాది సువస్తువులనుంగొని చని యా మహారాజు దర్శనము చేసికొనివచ్చుట, యుచితమని చెప్పిరి. ఆ ప్రకారమే కానుకల నెత్తించుకొని, కుసుమశ్రేష్ఠి మొదలుగాఁగల వైశ్యశ్రేష్ఠులు మహారాజు సన్నిధానమునకుఁబోయి, యా కానుకలను సమర్పించి మహా వినతులై స్తోత్రములు సేసి తా మిచ్చటికి విజయంచేయుటవలన, మేము కృతార్థులమైతిమి. తాము, మా పురముం జూచి, మమ్మునరక్షించవలయునని, ప్రార్థించిరి. దానికా మహారాజును సంతోషించియా పెనుగొండ పురమును జూచుటకుఁ, దను చతురంగ బలములతోఁ,

ప్రోత్సాహయుక్తుండై, బైలుదేర నిశ్చయింపఁగా, గొందఱు మతిమం
తులగు వైశ్యులు - ఉత్సాహయుక్తులై యా పట్టణములోప
ల వచ్చుటకు [illegible] శృంగారమును మొదలుకొని, పెను
గొండ పట్టణములో నగరేశ్వరాలయము వఱకు ననేక తోరణ పతా
కాదులతో, బహు విచిత్రముగా నలంకరించి, మిక్కిలి వెలగల
చీనాంబరములను పఱచి [illegible] రాజశేఖరుండు చూచి,
నిలిచి యత్యాశ్చర్యమును [illegible] వైశ్యుల్లఁ జూచి, యోయి
మాల్య వస్త్రంబులను, వీధుల నేలమఁ బఱచినారు. వీని నేమంగులు
గుఱ్ఱములు త్రొక్కిన, చెడిపోవునని, యడుగఁగా వైశ్యులతనిం జూ
చి యో స్వామీ, నీవు, మహారాజాధి రాజవు - పాండువంశ వర్ధనుం
డవు - ఈ విశ్వంబంతయు జయించి, మా భాగ్యవశంబున. నీ పురము
నకు విజయం చేసితివి - నీ పాదంబులకు మెత్తగ నుండునటుల, నడుగు
లకు మడుగులు పఱచినారము - అని విన్నవింపఁగా నతం డతి కుతూ
హల స్వాంతుఁడై, మంత్రి - సామంత - పురోహిత - రాజకుమారుల స
హితముగా, వాహనంబులు దిగి, పాదచారులై పురముఁ బ్రవేశించి,
వైశ్యులచేఁ జేయఁబడు, ననేకవిధ రాజోపచారములను గొనుచు, నా
పట్టణపు శృంగారములను జూచి యత్యాశ్చర్యపడుచు, మిక్కిలి యా
డంబరముతో, నా పట్టణపు రాజవీధులయందు రాఁగాఁ, బురస్త్రీలు
సకలాభరణ భూషితులై, తమతమ మేడలమీద నెక్కి, గవాక్షములగుండ
యా రాజశేఖరుం జూచి యతని సౌందర్య లావణ్య ధైర్య గాంభీర్య
గుణముల వర్ణించుచు, మిక్కిలి సంతోషించిరి. ఇట్లు పురజనులెల్ల బొ
గడఁగా, రాజమార్గముల నొబడిం జని చని, పుర మధ్యమందుండెడు
శ్రీ నగరేశ్వర దేవాలయమువద్ద నిలిచి, యాప్తమంత్రిసమేతుండై,
దేవాలయముం బ్రవేశించి యద్దేవునిఁ బ్రదక్షిణ నమస్కార పూర్వక
ముగా సేవించి, స్తుతించి యచటఁ జేయఁబడిన సన్మానముల నంగీకరిం
చి, తద్దేవ ప్రసాదమును స్వీకరించి యా గర్భ గృహంబు బైలువెడలి
కుసుమశ్రేష్ఠి యింటిముందరికి రాఁగానే, వారాంగనలు మొదలుగాఁగ
ల పరివారముతో, వీణాద్యనేక వాద్యములు మ్రోయించుచు, రాజునె

దుర్గోసి, నీరాజనాది మర్యాదలను నా వారవనితలచేఁ జేయించుచుండఁగా, నా వింతలం జూచుటకుఁ గుసుమశ్రేష్ఠి కొడుకును గూఁతును, దండ్రియొద్దకు వచ్చిరి. అంతనా కుసుమశ్రేష్ఠి, వారిని లోపలికిఁబొమ్మని యాజ్ఞాపింపఁగా, నా యాజ్ఞ ప్రకారమింటిలోపలికిం బోయిరి అప్పుడా నృపతి, మహాతేజోమయమై, మెరుపుతీఁగవలెను, షోడశ కళా పరిపూర్ణుఁడైన చంద్రునివలెను అనేక దివ్య రత్నా భరణాలంకృతురాలై, సకలావయవ సౌష్ఠవములు కలిగి, మహా సౌందర్యవతియై వర్తించుచుండెను. వాసవకన్యను జూచి, యా చిన్నదాని సౌందర్య లావణ్య విశేషంబులకు, మిక్కిలి చొక్కుచు నిట్టిస్త్రీని బంచాశత్కోటి విస్తీర్ణంబైన యీ భూమండలమందు, నే నెక్కడఁ జూడలేదు, ఈ కన్య రంభోర్వశీ మేనక తిలోత్త మాద్యప్సర స్త్రీలకంటె నధిక సౌందర్యము గలిగియున్నది. మఱియును, నీస్త్రీని జూచిన, నీశ్వరుఁడు పార్వతికిఁ దన శరీరమందు, సగమేల యిచ్చును. విష్ణువు శ్రీమహాలక్ష్మిని, వక్షమునందేల నుండనిచ్చును. బ్రహ్మ, సరస్వతిని, దన వాక్కునందేల నిల్పును. ఇంద్రుఁడు, శచీదేవి నేల యొల్లును. అని యనేకవిధంబుల మనంబునం దలపోసి, యా కన్యయందు నతి మోహముగలవాఁడై యా వైశ్యులు చేసిన బహుమతులను గైకొని, వారలకుఁ బ్రతిబహుమతు లొనర్చి గణికా స్త్రీలకు, తాంబూలాది బహుమానముల నిచ్చి పంపి, పిదప, బుద్ధిమంతులుగానుండెడు వణిగ్వరులతో మెరుపుఁదీఁగవలె నుండెడు, సౌందర్యవతియైన యీ కన్య యెవ్వతె దీని తలిదండ్రు లెవ్వరు- వారి పేరేమి- చెప్పవలయునని యడిగిన, నమ్మాటలు విని, వైశ్యులు మిక్కిలి ఖిన్నులైరి. అందులోఁ గొందఱు వృద్ధులు ధైర్యముతోడ, నీచిన్నది యుద్వాహకుల గోత్రస్థుండైన, కుసుమశ్రేష్ఠి కూఁతురు పుత్ర కామేష్టి యాగములో, గౌరీ ప్రసాదము వలనఁ గలిగినది. ఈ చిన్నదాని తల్లిపేరు కుసుమాంబ. దీని సహోదరుఁడు విరూపాక్షుఁడు- అని చెప్పఁగా, నా రాజు సంతుష్ట మానసుఁడైనను గాముపీడితుఁడగుచుఁ దన నిలయంబులకుం జని, పుష్పాల పానుపుపయింబడి మన్మథావస్థల ననుభవించుచుండె నది చూచి యా రాజము

ఖ్యమంత్రియగు విజయసింహుం డిదియేమి యాశ్చర్యము సూరాంక్షులోకములయందున, మీకసాధ్యముకాని దేమైననుకలదా, నీ కేమిక్కో అంత సంభవించెను. జెప్పుమని యడుగఁగా, నతండు దనమంత్రింజూచి యో విజయసింహుఁడా, నేనఖిల రాజ్యములను జయించి, విజయలక్ష్మినిం గైకొన్నవాఁడనైనను వాసవకన్యమీఁది మోహమును, జయింపఁజాలని వాఁడనైతిని, గాన, నెవ్విధంబునైన, నా కన్యను స్వాధీనంపవలయును. లేకున్న నేఁ బ్రాణముల విడిచెదనని చెప్పిన, నమ్మంత్రియు నిదియేమి యసాధ్యమా, యిదిగో కార్యసిద్ధిఁ జేసుకొని వచ్చెదనని యతని నూరడించి, యాక్షణంబ యితరమంత్రులతోఁడం, బెనుగొండకుఁ బోయి కుసుమశ్రేష్ఠినింజూచి, మీ వాసవకన్యను, మా రాజునకిచ్చి వివాహముఁ జేయవలయునని యడుగఁగా వైశ్యులిదియేమి మోసమువచ్చె, నింక నేమి సేతమని, కొంతదడవు చింతించి, బహువిధములైననీతిమాటలచేతఁ, దమ కన్యనివ్వమని నిగ్రహించిరి. అందుకుఁ బ్రధానమంత్రి యత్యగ్రకోపముగలవాఁడై బలాత్కారముగా, నా కన్యను గ్రహింపనుద్దేశించెను. అంత, నీ వర్తమానమును, చారులవలన రాజువిని, తన ముఖ్యభృత్యులను బంపి వైశ్యులను దన యమాత్యులను బిలపించెను. రాజాజ్ఞప్రకారము, వారందఱు రాజ సముఖమునకు రాఁగా, నా భూపతి, వైశ్యముఖ్యుండగు, కుసుమశ్రేష్ఠినిగని, నాకు మీకన్య నిచ్చుటయందు మీకేమి సంశయమని యడిగెను. అందుకా కుసుమశ్రేష్ఠి, సంతానము లేక యనేక ద్రవ్యమును వ్యయముచేసి పుత్రకామేష్టి యాగముఁజేసి యీ కన్యంబడసి యతిగారవంబునఁ బెంచితిని. దీని దమవంటి రాజాధిరాజులకిచ్చి, వివాహముచేయుట, నాకు మిక్కిలి సంతోషమే. అయినను, మా కులమువారగు వైశ్యులతో, యోచింపవలసి యున్నదని చెప్పఁగా, విష్ణువర్ధనమహారాజు, మీ కన్యను నాకిచ్చిన, పట్టుమొదలుగాఁగల వస్త్రములకు— ౨౫౦౦౦౦ను— ఉంగరములు హారములకయి ౫౬౦౦౦ను— ఘనకనకవస్తుసమృద్ధిగల పట్టణములను— వైశ్య వరులకును, మదించిన యేనుఁగులను— అతి వేగముగల గుఱ్ఱములను. మఱదులైన వైశ్యబాలులకు

ను, నిత్తును ఇదిగాక, (గీ॥ జగతిఁ బెంపొందఁ సకల దేశములలోన। ముఖ్యమగునట్టి పెనుగొండ మొదలుగాఁగ। బదియు నెనిమిదియనఁగల్గు పట్టణములు। పసపుకు నిత్తు వాసవ పద్మముఖికి ॥) జగమందతి ప్రఖ్యాతి నొందిన, పెనుగొండ మొదలుగాఁగల పదునెనిమిది పట్టణములను వాసవకన్యకుఁ, బసుపుకుంకుమలకయి యిత్తునని వైశ్యులతోఁ జెప్పెను.

అంత, వైశ్యులందఱిది యేమో కాలహేష్యంబుకాని, కాదేని వైశ్యకన్యయెక్కడ, పరనారీ సోదరుఁడుగానుండు, నీ విష్ణువర్ధన రాజెక్కడ. సింహమునకు నేనుఁగునకును, ధనవంతునకు దరిద్రునకును శాంతముగలవానికిఁ గోపికిని బండితునికి మూర్ఖునకును, మైత్రి యెట్లు చెల్లునో, యట్లు, రాజునకును మనకును, బాంధుత్వము చెల్లునని, తలపోసిరి. మఱియును గన్నియనివ్వక, దేశమువిడిచి, పాఱిపోదమని యోచించిన నీ రాజు సమస్తరాజ్యములను జయించి, స్వాధీనపఱిచికొని: యెల్లరాజులయొద్దఁ గప్పములఁగొనుచు, రాజాధిరాజై యఖండమండలైశ్వర్యాధిపతిగా నున్నాఁడు. ఇతని యధికారము చెల్లనిచోట్లెక్కడ యున్నవి కావున, మనకుఁ బాఱిపోవనువలనుగాకయున్నది. అయినను, యుక్తిచేత నీరాజును సాధింపవలసినది కాని, వేఱుకాదని యెంచి, కన్యను, వివాహముచేసి యిచ్చెదమని చెప్పి, ప్రస్తుత మీ రాజు నీ నగరికి బైటఁబంపి యావల జరుగవలసినది. దైవయత్నంబని నిర్ణయించి, రాజు నెదుటికిం జని వైశ్యులందఱేక వాక్యముగా, నో మహారాజా, మీకు మేము కన్య నిచ్చుచున్నాము. పాణిగ్రహణముఁ జేసికొని మా కులమును బావనముఁజేయవలయును. మా కన్యను మీ కిచ్చుటవలన మేమును మీరును సంబంధువులమైతిమి రాజ్యాధిపతులైన మీకు, మేము మిక్కిలి హితులముగదా ఇది పరమలాభము మహాప్రవీణులైన శాస్త్రజ్ఞులచేత ముహూర్తము నిశ్చయించుకొనవలసినది. మమ్ముల మన్నింపవలయునని చెప్పిన, వైశ్యుల మాటలువిని రాజు మిక్కిలి సంతోషమునుబొంది, తమజ్యోతిష్కులను బిలువంబంచి ముహూర్తము నిశ్చయింపుమని యాజ్ఞాపించెను ఆజ్యోతిష్కులు, వైశ్యులచేత,

బహుమానములను రహస్యముగా బొందినవారై, వైశ్యుల యిష్టప్రకారము, మాఘమాసములో విదియ గురువారమునాడు, జాము వెల్లినతరువాత, వధూవరులకుఁ జంద్రతారా బలములు కుదిరి ముహూర్తమున్నదని చెప్పి, రాజవలన సన్మానముఁ బొంది, తమతమస్థానమునకుఁ బోయిరి అంతనారాజు సంతుష్టులవలెఁ దలలువంచుకొని, మహావినయముతో నున్న, యావైశ్యులకుఁ, దగిన బహుమానములను జేసెను. అప్పుడా వైశ్యులతనిం జూచి యో మహారాజా, భోజన కాలమైనది గావునఁ, దాముతమ మంత్రులతోడ, భోజనమునకు రావలయుననగా, నట్లే కానిండని వారి మాట నంగీకరించి యుండెను.

ఈ వర్తమానము వైశ్యబాలురు దెలిసికొని తమ పెద్దల యొద్దకు వచ్చి నమస్కరించి మహావినయముతో, మీరుమీరే యుపద్రవమును దెచ్చుకొంటిరి. ఏమనిన- బలాధికుఁడైన రాజును, భోజనమునకు నింటికిఁ బిలుచుకొని వచ్చుచున్నారు. తొల్లి హారతి యెత్తినప్పుడు వచ్చిన యీమన కన్యను రాజు చూచినందున నింతయాపద గలిగెను ఇతఁడింటికి వచ్చెనేని, యింకనింటి యందుగల, సౌందర్యవతులగు స్త్రీలను, రత్న- ధన ధాన్య వస్త్రములు మొదలైన వానిం జూచి, పాపబుద్ధిగల యీ రాజు, లోభముచేత గ్రహింప నుద్యుక్తుఁడయ్యెనేని, నివారింప నెవఁడు సమర్థుండు ఇదియుఁగాక, ముందు, గాధినందనుండైన విశ్వామిత్రుఁడు, బ్రహ్మర్షి గాకమునుపు రాజ్యభారముఁ జేయుచుండి యొక సమయములో, వేటకయి వచ్చుచుండ, మార్గవశంబునఁ, దన యాశ్రమమునకు వచ్చిన, నతని, వశిష్ఠుండు భోజనమునకు నిలిపి, కామధేనువును దలఁచిన మాత్రముచేతనే కామధేనువు వచ్చి విశ్వామిత్రునికి, నతనితోడ వచ్చిన చతురంగ బలములకును, షడ్రసోపేతముగా భక్ష్య భోజ్యాదులతోడ, భోజనమును బెట్టించిన దానింజూచి, విశ్వామిత్రుండీ కామధేనువువలనఁగదా, యింతజరిగెనని యోచించి యీ ధేనువు, దనకిమ్మని వశిష్ఠుని నడిగెను. అందుకు వశిష్ఠుండో విశ్వామిత్రా యిది నా హోమధేను వగుటవలనదీని నీకివ్వనని చెప్పెను.అంత నా విశ్వామిత్రుఁడు దానిని బలాత్కారముగాఁ గొనిపోవనిశ్చయిం

చిత్తిన సైన్యమున కుత్తరవుచేసెను. ఇంతలో నా కామధేనువు మహా కోపముతోఁ, దన దేహములో నుండి, కిరాత- పుళింద- పుష్కళ- బర్బర- ప్రముఖులగు ననేక క్రూరజాతులను బుట్టించి, వారిచేత విశ్వామిత్ర సైన్యమునంతయుఁ జంపించి దేవలోకమునకుఁ బోయెను. అంత విశ్వామిత్రుండు తపస్సుచేసి యనేక దివ్యాస్త్రముల నొందివచ్చి యా కిరాతాదుల జయించి వశిష్ఠుని మీదికి దండెత్తెను. పిదప వశిష్ఠుండున్ను తన బ్రహ్మదండముచే నతఁడేయు దివ్యాస్త్రముల నన్నింటిని ధ్వంసము చేయించ్చి తానూరకుండె. పిమ్మట విశ్వామిత్రుండును బ్రహ్మతేజంబధికంబని నిశ్చయించి తానును బ్రహ్మర్షి కావలయునని తలచి. యనేక యేండ్లు ఘోరతపస్సు చేసి బ్రహ్మర్షి యాయెను. కావున విశ్వామిత్రునికి వశిష్ఠుండు భోజనము పెట్టి పడినపాటును మీరు వినలేదా యని తమ బాలురు చెప్పిన మాటలు విని వైశ్యులు మేమేమి సేతుము- భోజనమునకుఁ బిలిచి వచ్చినాము- ఏ యుపాయము చేతనైనను తాకుండునట్లుకు యుక్తి మీరే యోచింపవలయునని చెప్పఁగా బుద్ధిమంతులగు వైశ్యబాలురా ప్రకారమే చేయుచున్నామని పెద్దలయొద్దనాజ్ఞఁదీసుకొని విష్ణువర్ధన మహారాజునొద్దకుం బోయి నవ్వుముఖములతో మహా వినయముగా నమస్కరించి స్తోత్రములుచేసి మా కన్యను మీకిచ్చుటవలన మీ బాంధుత్వము మాకుఁ గలిగి నందువలన గజాశ్వాదిద్రవ్యములఁ జేయుటయును భూపాలన మొనర్చుటయును మాకుఁ గలిగెనుగదా యని మేము మిక్కిలి సంతుష్టులమైతిమి. అయినను మీకుఁ గన్యనిచ్చుట వలన మీ బాంధుత్వము గలిగెనుగదా యని మహానందపరవశులై ముందువెనుక యోచింపక మా పెద్దలు మిమ్ము భోజనమునకుఁ బిలిచ్చిరి. మీరును భోజనమున కొప్పుకొంటిరి. ఇందువలన వివాహమునకు మా పెద్దలే విఘ్నకారణులైరి. ఎట్లనఁగా వివాహమునకు ముందుఁ బెడ్డికొడుకు పెండ్లికూతురి యింట భోజనము చేసినచో బ్రాం[illegible]త్యము జరుగదని శాస్త్రములలోఁ జెప్పఁబడియున్నది, మఱియు "గ[illegible]న్నముకడు" అను లోకోక్తి ప్రకారము మా కులాచారములోఁ బెండ్లికిముందు భోజనము జరిగినఁ గార్యహాని సంభవించునట్లున్ను భోజనమ్ము

చేయకపోయినఁ గార్యము సిద్ధించుటయును బ్రసిద్ధముగానున్నది. గా వున వినిపించినాము. అటుగాదని మీకు భోజనము చేయవలయుననన్న యిచ్ఛ యున్నపక్షమందుఁ గావచ్చును. కన్యనుఁ గోరిన పక్షమందుఁ దాము, తమరాజ్యమునకు విజయంచేయ వలయునని, వైశ్యబాలురు చెప్పిన నమ్మాటలను విని, రాజు సంతుష్టుండై, భోజనమువలన నాకే మి ప్రయోజనము నాకుఁగన్యయే ప్రధానమని చెప్పి, విష్ణువర్ధన మహా రాజచ్చటనుండి బైలుదేరి. భావమఱందుల వరసచేత వైశ్యబాలుర తోఁ బరస్పరము కొంత పరిహాస వాక్యములాడి, మనరాజధానియగు రాజమహేంద్రి పురమునకుఁ జనక, యేల నేనూరకుంటిని, పెద్దలు భోజనమునకుఁ బిలువఁగానీ బాలురు కుట్రచేసి భోజనములేకనే, సా గనంప నుద్యమించిరి. ఇట్టివారు బాలికను మనకు నివ్వనిత్తురో, నిరో ధింతురో యని, మనస్సునఁ దలపోసి యీ బాలనగరులయందుఁ గొం చెము సంశయము కలవాఁడై, వారలకుఁ దాంబూలాదులిచ్చి పిదప మార్కండేశ్వరులు- గౌతమీనది- చంద్రసూర్యులు- అగ్ని- వీరల సాక్షిగా, నాకుఁ గన్యనిచ్చుచున్నారుగదా యని, యడుగఁగా, వైశ్య బాలురు తలవంచుకొన్నవారై మాట్లాడక యుండిరి. అంతలో ఘం టసాలాపురవాసుఁడును గాశ్యపగోత్రజుఁడునునగు ధనదుఁడనెడు పేరు గల యొక చిన్నవాఁడు, ధర్మశాస్త్ర వచన ప్రకారము పెండ్లిజరిగిం చుటయందును బ్రాహ్మణుని నాపదనుండి తప్పించుటయందును బ్రా ణ సంకటమైన యాపద సంభవించిన కాలమందును సమస్త ద్రవ్యము నకు హాని కలుగునపుడును, నబద్ధముచెప్పుటవలనఁ బాపము లేదని యెంచి నిర్భయముగా నో మహారాజా, మీ రగ్నితుల్య ప్రతాపము గల విష్ణువర్ధన రాజు- మీకు మాకులములోఁ బుట్టిన కన్యను, భూ మిసాక్షిగా నిత్తుము- ఇవ్వమేని చత్తుము- మీరు సంశయం బుడిగి, బోవచ్చునని, చెప్పఁగా రాజు సంశయము వదిలి సంతుష్టాంత రంగుఁ డై వైశ్యబాలురకు సన్మానము చేసి యనిపి, పద్మశైల పురమునకుఁ బ్రయాణమై పోవుచు నచ్చటనుండేమ సమస్త వేడుకలం జూచుచు, మృకణ్వాది మహామునులు తపస్సుచేసి, సంతోషింపఁ జేసినచోటునఁ బ

ద్మా(దియందు నవతరించి యుండెను. మార్కండేశ్వరు దర్శించి, సప్తమీఁత పస్థానమైన యుత్పాతక పురములో నివసించి వాసవకన్యం దలంచుచు, మహా వ్యసన గ్రస్తుఁడై, కామావస్థలో మునిఁగి, దినములెం చుచు నిద్రాహారములులేక, స్వస్త్రీని భోగవర్జితుఁడై, కాలము గ డుపుచుండెనని, సాలంకాయనముని చెప్పిన విని వైశ్యమునులు సంతు ష్టాంతరంగులై వెనుకటి వృత్తాంతంబును దెలియఁ జేయుమని వేడఁగా సమ్మోహముని, యట్లేయని యానతీయందొడఁగె,

ఆఱవయుల్లాసము ముగిసెను.

---



(శ్రీ)వాసవాంబాయైనమః

# శ్రీకన్యకాపురాణము.

## ఏడవ యుల్లాసము.

ఇందు- పెనుగొండ పట్టణపు వైశ్యులు, తక్కిన పదియేను ప ట్టణపు వైశ్యులకు, జాబులు వ్రాసిపంపుటయు- అశేషవైశ్యులు సభ చేరి, పర్యాలోచన జరిపించి యేఁబది గోత్రజులగు వైశ్యాగ్రేసరుల ను రాజునొద్దకు రాయభారముఁ బంపుటయు- ఆవైశ్యులకు, రాజుస కలోప చారంబుల నొనర్చుటయు- రాజమంత్రులకును వైశ్యులకును, వాసవకన్యా వివాహ నిమిత్తమైన సంవాదము జరుగుటయు_ పిదపవా రు వాసవ కన్యను రాజునకు నివ్వమన్నందున నతనికిఁ గోపము గలుగు టయు- ఆకోపమునుమంత్రి శమింపఁ జేసియూవైశ్యులను గొందఱు భ

టుల( గూర్చి పెనుగొండకుఁ బంపుటయు- వారివలన రాజసదనమందు జరిగిన కార్యములను దెలిసికొని, వైశ్యులందఱు పిమ్మట నడువవలసిన విషయమును గూర్చి యోచించుటయుం- జెప్పబడుచున్నది.

ఓ వైశ్యమునులారా- ఆ వైశ్యబాలురు విష్ణువర్ధన మహారాజును బ్రయాణము సేసి, సాగనంపి, యతనియొద్ద నాజ్ఞఁ దీసికొని, తమపురంబునకు వచ్చి కులవృద్ధులగు వైశ్యవరులం గని దండ ప్రణామంబులాచరించి, రాజునకుఁ దాము చేసిన బాస మొదలుగాఁగల వృత్తాంతంబులను సవిస్తారంబుగఁ జెప్పిరి. అదివిని యా వైశ్యకుల వృద్ధులత్యంత చింతాక్రాంతులై నగరేశ్వరస్వామి ముఖమంటపమందు సభఁ జేరి భాస్కరాచార్యులు మొదలుగాఁగల ముఖ్య పురోహితులను రావించి, బాలనగరులు తాము రాజునకుఁ జేసిన ప్రమాణ పూర్వకమగు వాగ్దత్తమును వారికి నెఱిఁగించి, మీ రావిషయమై యోచించి, జరుగఁ గలాందులకుఁ దెలియఁజేయుమని యడుగఁగా బ్రహ్మాంశ సంభూతుండగు నా భాస్కరాచార్యులును భవిష్యత్కార్యములఁ దన బుద్ధి కుశలతచేత యోచించి, బదునెనిమిది పట్టణములలోనుండు నశేష వైశ్యులు సభఁ గూడవలయునని నిశ్చయించి కులాచారధర్మనిర్ణయము చేయవలసియున్నది, గావునఁ, బత్రికనుజూచిన యాక్షణంబె వైశ్యనగరులందఱవశ్యము శీఘ్రముగా బైలుదేరి రావలయునని జాబులువ్రాసి పదియేడు పట్టణముల వైశ్యపుంగవులకుఁ దమ భటులచేత రహస్యముగాఁ బంపిరి. వారలు నా పత్రికను జదువుకొని కార్యం బిట్టిదని తెలిసికొనంబాలక తమతమ దారాపుత్రాదులతో బైలుదేరి వచ్చిరి. పెనుగొండ పట్టణ నగరస్వాములు వారల కెదురు గాఁబోయి పిలుచుకొనివచ్చి సన్మానించి యతిథి సత్కారంబుల నొనర్చి నగరేశ్వర ముఖమంటపమున భాస్కరాచార్యాది పురోహితుల తోడ, నుచితాసనముల యందుఁ గూర్చుండఁబెట్టి రాజమహేంద్ర పురాధీశ్వరుండగు విష్ణువర్ణన మహారాజు దిగ్విజయార్థియై బైలు వెడలి సమస్త రాజులను జయించి,దిగ్విజయముఁ జేసి, మరలి, తన నగరమున కేతెంచుమార్గమునను పెనుగొండకు వచ్చి యిక్కడి వింతలను జూచు సమయంబున మన వా

నవ కన్యం గనుంగొని యామెయందు మోహముగలవాఁడై యాక
న్యను దనకు వివాహము చేసి, యిప్పింపుమని నిర్బంధించి, తుదకు మ
న ధనదుండు మొదలుగాఁగల బాలనగరులయొద్ద "ఆకన్యను మాకువి
వాహము చేసియిత్తుము లేకున్నం జత్తుము" అని గంగానదీ తీరంబునఁ
బ్రమాణపూర్వకముగా వాగ్దత్తము చేయించుకొనెనను వృత్తాంతంబు
ను సవిస్తారముగాఁ దెలియఁచేసి. యన్య కులస్థుఁడైన రాజునకు నాక
న్యనిచ్చి వివాహము చేయుటకు నేను స్వతంత్రుఁడఁగాను గావున,మీ
రందఱు యోచించి తెలియఁజేయు మేఱకు జరిపింతునని, సభికులతో వి
న్నపము చేసికొనెను, అప్పుడా పదునెనిమిది పట్టణముల వైశ్యవరుల
లోఁ గొందఱు, చంద్ర వంశస్థుఁడగు నబ్భూపాలునకు మనకన్యనిచ్చి
న మనము సుఖముగా నుండవచ్చును. లేకున్న, రాజునకును మనకు
ను గలహము సంభవించును, అదియుఁ గాక, యీ రాజు చంద్ర వంశ
స్థుఁడు- మన కులమునకంటె నెక్కుడు కులము గలవాఁడు- అతనితో
మనకు వివాహ సంబంధము తగునని చెప్పిరి. మఱియుఁ గొంద ఱట్లు
వివాహ సంబంధము మనకుఁ దగినను, యుగ ధర్మములను యోచిం
పఁగా, నీ కలియుగమందు హీన వంశస్థులును, రాజ్యభార మొనర్తురు
వారును, వైశ్యకన్య నిమ్మని బలాత్కారము చేయుదురు. సమాధాన
పూర్వకముగా నివ్వకున్న బలాత్కారముగా నైనను, గన్యను గ్రహిం
తురు. కాఁబట్టి యిప్పుడు మన కన్యనీ రాజున కిచ్చి మనకులమును జె
ఱుపక, సామ. దాన- భేద- దండములను చతు రుపాయములలోనే
నిచేతనైనను, మనకుల ధర్మములను దప్పక స్థాపింప వలయు నని చె
ప్పిరి.

మఱియు ॥ శ్లో ॥ బాలానాం భూమిపాలానాం యస్మిన్ వస్తు
ని సంస్థితా। దృష్టిస్సా సర్వదా పశ్చాత్సిద్ధి యతేనహి చఞ్చలా ॥ అ
ను వాక్య ప్రకారము బాలురును రాజులును నొకవస్తువునందు దృష్టి
నుంచినపుడు దాని యందు మోహము పుట్టుట. గాని కొంత దడవున
కుఁ బిమ్మట బుద్ధి చాంచల్యము చేత దాని మఱచి పోవుటగాని. వారి
కిని జరుగును. కాఁబట్టి, విష్ణువర్ధన మహారాజు మనకన్యను జూచినప్పు

డతనికి గలిగిన మనశ్చాపల్య మిప్పటికిని స్థిరముగా నున్నదో లేదో యాసంగతిని మంత్రులు మొదలుగాఁగల రాజ భటులకు మంచి మాటలు చెప్పిగాని, ముత్యాల హారములు మొదలగు వెలపొడుగు వస్తువుల నిచ్చిగాని తెలిసికొని, రాజునకు నప్పటి చిత్తమే స్థిరముగా నుండిన పక్షమునకు నామీఁద జరుపవలసిన కార్యములను గూర్చి యోచింప వచ్చును. ఇప్పు డట్టి విచారణ చేయఁదగిన వారిని రాయభారము పంప వలయునని నిశ్చయించిరి.

పిమ్మట సకల శాస్త్రపురాణాది నీతులను జక్కఁగా దెలిసిన వారును, మిక్కిలి వాచాలురును, చతుర వతన రచనా విశేషములను దెలిసికొనుటయందు మిక్కిలి సామర్థ్యము గలవారును, నిర్భయులును సకల భావజ్ఞులును నగు అనంతకుల, అనుపాలకుల, అయనకుల, అర్ఘ్యమూలకుల, ఇనుకోల, ఇన్వాకుల, ఉతకుల, ఉపరకుల, కరకపాలకుల, కరణకుల, కానిశిష్టకుల, గంధశీలకుల, గణముఖకుల, గోశీలకుల, ఘనశ్రీలకుల, చంద్రికుల, చక్రమూలకుల, జానుకుల, ఠంకారకుల, తుప్పాలకుల, దంతకుల, దీక్షమశిష్ట, దొంతకుల, ధనకుల, నాభిలసకుల, పడగశీల- పాలకుల- పుత్సకుల- పునగశీల- పైడికుల- పేరుశిష్టకుల- బలిశిష్టకుల- బుదరుకుల- మద్దికుల- మన్యకుల- మాసంతకుల- మిథునకుల- ముసికుల- మోరుకుల- యనసకుల- యెలిశిష్టకుల- రెంటకుల- వసంతకుల- వస్తికుల- వెన్నకుల- శ్రీలకుల- శ్రీసోళ్లకుల- సనకుల- సాంతాలకుల- సూర్యకుల- అను నీ యేబది గోత్రజులగు వైశ్యకేసరులను విష్ణువర్థన రాజునొద్దకు రాయభారముపంపిరి. అంతనా వైశ్యవరు లనేక విధములగు కానుకలను బట్టించుకొని నగరేశ్వర జనార్దనులకు సాష్టాంగ నమస్కారము లొనర్చి, గురుప్రార్థనలం జేసి ప్రాతఃకాలంబున పెనుగొండ పట్టణము బయిలుదేరి గంగానదీతీర్థముం జేరి. యా పుణ్యనదిలో స్నాన సంధ్యా ద్యనుష్టానంబులం దీర్చుకొని, రాజమహేంద్రపుర ప్రాంత్యములకుఁ జనిరి. అచ్చట పూర్వము మహా పండితుండగు న్యాకంప మహర్షి యనేక దాన జప త

హు హోమా మాద్యతిథి సత్కారంబులు చేసియుఁ, బుత్రసంతతి లేమింజేసి యా గంగా తీరంబునఁ బరమేశ్వరునిఁ గూర్చి ఘోరతపస్సుఁ జేయఁగా, నా పరమేశ్వరుండు ప్రత్యక్షుండై, యో విప్రేంద్రుఁడా ధార్మికుండును నాయందు భక్తిగలవాఁడును బదియాఱేండ్లు వఱకుఁ జీవించి యుండఁగలవాఁడును నగు పుత్రుండు గావలయునా, కాక యీశ్వర భక్తి లేక వేయి సంవత్సరములు జీవించి యుండఁగల పుత్రుఁడు కావలయునా, యని యడుగఁగా నా విప్రోత్తముఁ డప్పరమేశ్వరునకు దండప్రణామంబు లాచరించి యో దయాసింధో, పదియాఱేండ్ల వయస్కుఁడైనను నీ యందు భక్తిగల పుత్రుఁడే కావలయుఁగాని, నీ యందు భక్తి లేని పుత్రుఁడు నాకు వద్దని విన్నవింపఁగా నీశ్వరుండును నా ప్రకారమే వరమిచ్చి తా నంతర్ధానంబు నొందెను పిమ్మట నా మృకండు మునికి నీశ్వరానుగ్రహమువలనఁ బుత్రుఁడు గలిగెను. అతనికి మార్కండేయుండని పేరు పెట్టిరి. పదియాఱేండ్లు వఱకు జీవించి యుండఁగలవాఁడేగదా, వీఁడు మనయెదుటఁ గాక నిఁక నెక్కడనైనం జచ్చిన మేలని తలంచి యతని తలిదండ్రు లతని దేశాంతర గతునిఁగాఁ జేసి మహా వ్యసన గ్రస్తులై యుండిరి. అది మార్కండేయుండు తెలిసికొని లింగస్వరూపముఁ దాల్చియున్న పరమేశ్వరుఁ గూర్చి యేకాగ్రచిత్తుఁడై పరమ భక్తితోఁ బూజఁ జేయుచు నుండఁగాఁ బదియాఱేండ్ల వయస్సు కాఁగానే యమధర్మరాజు మార్కండేయునిఁ బిలుచుకొని రమ్మని దన దూతలను బంపెను. ఆ దూతలు పరమ భక్తుఁడైన మార్కండేయుల తపోగ్ని జ్వాలలు సహింపజాలక యతని బట్టవెఱచి యముని యొద్దకుఁ బోయి యా వృత్తాంతంబు నెఱింగించిరి. అంత యమధర్మరాజు తానే బయలుదేరి వచ్చెను. మార్కండేయుండు యమధర్మరాజు రాకం జూచి, లింగాకారమయిన యీశ్వరుని గట్టిగాఁ గౌఁగిలించుకొనెను. యమధర్మరాజును దన పాశములచేత మార్కండేయులను బంధించి యీడ్వఁగా, నతఁడు కౌఁగిలించుకొని యుండు లింగము పెల్లగిలెను. భక్తదయాపరుండైన యీశ్వరుం డాలింగమునందుఁ బ్రత్యక్షమైయముని ధిక్కరించి, మార్కండేయుఁ డెల్లప్పటి

కిని బదియారు సంవత్సరముల వయస్సు గలవాఁడుగా నుండవలయునని యనుగ్రహించి, యంతర్ధాన మాయెను, అందువలన నాక్షేత్రమూర్తికి మార్కండేశ్వరుండనియు, మృత్యుంజయుఁడనియు, నామంబులు గలిగె, అట్టిమార్కండేయ క్షేత్రమా రాజమహేంద్రి వరమునందలి పద్మగిరియందుండుటచేత నచ్చటికి వైశ్యులు పోయి, యీమార్కండేశ్వరులను, షోడశోప చార పూర్వకముగా దర్శనము చేసి, యితర దేవతలను బ్రార్థించి రాజమహేంద్ర పురముం బ్రవేశించి, రాజనగర ద్వారముం జేరి, ద్వారపాలకులం జూచి, తాము వచ్చియుండు సంగతి రాజునకుఁ దెలుపుఁడని చెప్పఁగా వారును వేగిరంబ పోయి పెనుగొండ పురపు వైశ్యులు వచ్చి యున్నారని విన్నవింపఁగా రాజానా ద్వారపాలకులం జూచి, యో ద్వారికులార, మీరేల నా బంధువులగు వారి నడ్డగించితిరని కోపగించికొని జాగు సేయక వారిందోడ్కొని రండని యాజ్ఞాపించి, తాను నవరత్న భూషణ వస్త్రాదులనలంకరించుకొని కస్తూరి మొదలగు సుగంధ ద్రవ్యములను మేన నలందుకొని, లాట మగధదేశాధిపతులు పసిడి వింజామరలు వీవ- జోళ- వంగదేశాధి పతులు- ముత్యపు గొడుగులను బట్టగా- ద్రావిడ దేశపు రాజు రత్నఖచితమైన సురటి వీవఁగాఁ- గుంతల దేశపు రాజు తాంబూలము లందివ్వఁగా- పాండ్యదేశపు రాజు తమ్మపడిగెను బట్టఁగా- మద్రిరాజు స్వర్ణజల పాత్రను గేలంబట్టి సమయమును నిరీక్షించియుండఁగా- బోటుండు రత్నపు పగళలార్పగా- గళింగ, బంగాళ, కాశ్మీర, కాంభోజ- దేశాధిపతులు వేత్రధరులై యుండగా- సౌరాష్ట్ర- నేపాళ- కేరళ- కన్నడ- దేశాధిపతులు హెచ్చరికలు చెప్పఁగా- కురుకుర- మహారాష్ట్ర ఘూర్జర- బర్బర దేశపు రాజులు విజ్ఞాపనములు సేయుచునుండ- యవన- కొంకణ- టెంకణ-దేశాధిపతు లత్యంత భయభక్తులై యుండ- నితర దేశపు మనుజ పతులు తక్కిన యాడిగఁబులు చేయఁగా- మఱియు సమస్త విధ భటులు నానా విధములైన రాజార్హమగు సేవలుచేయుచుంట- విజయ సింహుఁడు మొదలుగాఁగల షోడశప్రధానులును- నుద్దండ దోర్దండులను సేనాధిపతులును- మహా రథి

కా ద్యనేక విధరథిక నికాయంబులును మహాయోధవీరులు మొదలగు నపరిమిత భట కోట్లు కొలువఁగా- ఋగ్యజుస్సామాథర్వణములను చతుర్వేదములయందును- షట్ఛాస్త్రముల యందును, నష్టాదశ పురాణముల యందును- చతుష్షష్టికళా విద్యలయందును- నతి పాండిత్యము గల విద్వద్బృందము లాయా శాస్త్రముల యందుఁ- బ్రసంగములు చేయుచుండఁగా- రంభా ద్యప్సర స్త్రీ సమానులగు మదనమోహిని- మంజువాణి- రత్నతిలక- రత్నవతి- విశాలాక్షి- శృంగారిణి దివ్యాంగిని- బింబాధరి- పద్మావతి- పద్మగంధి- కంబుకంఠి- తనుమధ్య- నిమ్నదునాభి- వసంతమంజరి- లావణ్యవతి- కలావతి- మృగాక్షి- సుకేశిని- యను వేశ్యాస్త్రీలు- నాట్యంబులు- సలుపఁగాఁ- బంచ మహావాద్యములు మ్రోగఁగా- నవరత్న ఖచితమగు సింహాసనమందు సిండు కొలువై యుండు సమయంబున నా వైశ్యులు తాము దెచ్చిన కానుకల నెల్ల రాజుముంగల నిడి, రాజునకు నమస్కరించి, మహావినయముతో నోమహారాజా! యీ భూలోకమందు వర్ణాశ్రమ ధర్మములు దప్పకుండ, మహానీతితో రాజ్య పరిపాలనము చేయుచున్నావు. ఇట్టి రాజ్యభారము ముందెవ్వారును సలిపినది లేదు. ఇఁక సలుపఁ గలవా రుందురని తోఁచలేదు- అని స్తోత్రము చేసి నిలిచి యుండఁగా, నా రాజు వాసవకన్యా వివాహ నిమిత్తము తన్నుం బిలువ వచ్చినారు కాఁబోలు నని మనమ్మున మిక్కిలి సంతోషించుచుఁ దన ప్రధానిం జూచి, నా సింహాసనముతో సమానమయిన గద్దియలపైనఁ గూర్చుండఁబెట్టి, సకలమయిన యుపచారములను, జేయుమని, యాజ్ఞాపించెను. ఆ మంత్రియు నాప్రకారమే రత్నసింహాసనములను దెప్పించి, కూర్చుండుఁడని చెప్పఁగా నాలించి, యో మహారాజా రాజాధిరాజు లెక్కఁదగు నీ నవరత్నమయ సింహాసనముల నెక్కుటకు మాకుఁ దగదు- అని వైశ్య ముఖ్యులు విన్నవించిరి. అందు ముఖ్యప్రధాని యగు విజయ సింహుఁడు, మీరు రాజునకు మామలైనందున మీరే రాజాంశము గలవారు. రాజ్యమేలఁదగిన వారు మీరే- మీరుగాక యీ భూమండలమం దితరులు రాజు లెవ్వరున్నారు. అని చెప్పఁగా, వైశ్యముఖ్యులు విని, మహాప్రసా

దంబని యా గద్దియలపైఁ గూర్చుండిరి. అప్పుడా వైశ్యపుంగవులు దెచ్చిన కానుకలను రాజంగీకరించి, వారలకుఁ బరిమళద్రవ్య సమేతములగు తాంబూలాదులు వేర్వేరుగా నిప్పించి, సన్మానించి. మీరందఱు క్షేమమా, వాసవకన్య సుఖముగా నున్నదా, అని కుశలప్రశ్న చేసి, వాసవ కన్యా వివాహ ముహూర్తము సమీపించెను. కావలసిన ద్రవ్యములు సానుకూలము లాయెనా, ఇంక నేమియైనం గావలసియుండిన చెప్పిన, బంగారు ఏనుఁగులు, గుఱ్ఱములు, పాడి పశువులు, వస్త్రములు మొదలైనవి యపారముగాఁ గన్నెకు నిచ్చెదనని వైశ్యవరుల నడుగఁగా నా వైశ్యులు రాజుంజూచి, యో రాజా, యీ భూమండలమందు విశేష రూప లావణ్య యౌవ నాడంబరయములు గల రాచకన్యలు పెక్కండ్రు గలరు. అట్టివారిని విడిచి యీ వైశ్యకన్య నేల వరించుచున్నావు వైశ్యులెక్కడ, రాజులెక్కడ అని చెప్పఁగా రాజుయొక్క ప్రధానమంత్రియగు విజయసింహుండా వైశ్యులనుజూచియీ జగము నేలెడి చంద్రవంశపు రాజగు నీ విష్ణువర్ధనునకు భూమియందు రూప లావణ్యములు గల స్త్రీలు దొరకక, మీ కన్యను గోరెనా-మీ సంబంధము చేసి మిమ్ముం బుణ్యవంతులఁ జేయదలఁచి మీ కన్యను గోరినాఁడని చాతుర్యముగాఁ బలికెను. అదివిని యా వైశ్య శ్రేష్ఠులలో మునికుల గోత్రస్థుఁడగు మాళిశ్రేష్ఠి యా మంత్రిని జూచి యో మంత్రిశ్రేష్ఠుఁడా, మమ్ము నపహాస్యము చేయనేల, ముందు భూమిలో నే రాజులైనను వైశ్యస్త్రీలను వివాహము చేసుకొని యున్నారా మీరేల వృథాప్రయత్నములు చేయుచున్నారని చెప్పెను. అందుకు మంత్రి యా మాళి శ్రేష్ఠినిజూచి, చంద్రవంశపు రాజుతోఁ జేయు నీ సంబంధము వలన మీకులము ఘనత కెక్కునని చెప్పెను. అదివిని, నాభిల్లగోత్రమని ప్రసిద్ధిచెందియుండు నాభీలసకుల గోత్రుఁడగు మల్లయశ్రేష్ఠి, యీ రాజ సంబంధముచేత మాకేమి ఘనత, యీ ఘనతకుఁ గారణమని యడుగఁగా నా మంత్రి రాజులు శాస్త్రాచార ప్రకారము వైశ్యులతో సంబంధమని చేయఁదగును. అట్లు చేయఁదగదని యెచ్చట విధించి యున్నదో చెప్పవచ్చును. వృథా మాటలేల శాస్త్రజ్ఞ

ల నడిగి తెలుసుకొని ,, శుభస్య శీఘ్రమ్” అను వాక్యప్రకారము, శీఘ్రముగా శుభకార్యమును జరిపించి సుఖంబు లనుభవింపుడని చెప్పఁగా యెలిశిష్ఠకుల గోత్రోద్భవుండైన హరిదిశ్రేష్ఠి భూమండలములో నే యుగమందు నేరాజు వైశ్యకన్యను వివాహము చేసుకొని కీర్తివహించెను. అది వివరింపవలయునని యడుగఁగా విక్రమశాలియను మంత్రి మీ కులమునకును క్షత్రియకులమునకును హెచ్చైన బ్రాహ్మణకుల స్త్రీని మున్ను యయాతి చక్రవర్తి పెండ్లాడినది లోకమునం బ్రసిద్ధమైనదియుకదా యనిన, ననుపాలకుల గోత్రుండగు నాగయశ్రేష్ఠి, దేవయాన శాపకారుణమున యయాతికి భార్యయయ్యె. మా కన్యయే శాపమును బట్టి యీ రాజునకు భార్యకావలసినది ద్వాపరయుగమందు జరిగిన నడవడికల నిప్పుడు దహరించుట వలన, నేమి ప్రయోజనమని చెప్పఁగా వీరసేనుఁడను మంత్రి సముద్రము మేరదప్పినను జంద్రుఁడు మార్గము దప్పి సంచరించినను భూమిక్రుంగినను, సూర్యుఁడుదయింపకున్నను, గులపర్వతములు కదిలినను, నాదికూర్మము భూతలమును వహింపజాలక పోయినను వైశ్యులాడినమాట తప్పను. అట్టి యుత్తమ ధర్మముగల మీరు గౌతమీనది తీరమందు శాలనగరు లీ భూపాలునకుఁ బ్రమాణపురస్సరముగాఁ జేసిన వాగ్దత్తమును దలంచుకొండు. వృథా వాగ్వాద మేల ధర్మసూక్ష్మ విచక్షణంబు లేల మీ రెఱుంగని ధర్మసూక్ష్మంబులు గలవే గనుక సంతోష చిత్తులై రాజునకు మీ కన్యనొసంగి, రాజకృపావిశేషంబున సుఖం బందుఁడని చెప్పఁగా శ్రీలకుల గోత్రుడగు సోమిశ్రేష్ఠి యిట్టి నిష్ఠూరములు మామీదనాఁడ నేల మీకుఁగావలసి యుండినఁదగు పాటి ధనము దీసుకొమ్మని వక్కాణింపగా, వీరసేనుఁడు రత్నసముద్రములో జలబిందువు లెంత గోరుమన్నది. యెంతటిమాట మీకుఁ గావలసినంతధనము నిచ్చి కలకాలము నడుచునట్లు మాన్యములను నియ్యఁగలము. అని చెప్పఁగా విని, యా సోమిశ్రేష్ఠి యూరకుండుటఁజూచి గోశీల గోత్రోద్భవుండగు గవల శ్రేష్ఠి భూమిలో సర్వేశ్వరుండు మమ్ము జనమాన్యులుగా సృష్టించి ప్రతిష్ఠించినాఁడు, అన నది విని, సుమంతుఁడను మంత్రి దైవము భూ

మిలో క్షత్రియులను జేసెననుట నిజమైన భూపాలుఁడగు రాజు దైవస ముఁడగు గాఁడా. విష్ణ్వంశము లేకరాజుగాఁ బుట్టఁడను వాక్యమును వినలేదా అనిచెప్పఁగా ఉతెకుల గోత్రజుఁడగు నుత్తరశ్రేష్ఠి మంత్రి య కుశ ప్రాయుఁడుగా రాజు మత్తేభమువలెనుండి రాజ్యకార్యములు జరిపింపవలయుఁ గదాయని చెప్పఁగా విని చంద్రచూడుండను ప్రధాని చంద్రవంశస్థుఁడగు విష్ణువర్ధనమహారాజు సకల ధర్మములను జక్కఁగా దెలిసినవాఁడు సర్వజ్ఞుడు ఆ రాజశేఖరునకుఁ జెప్పవలయునది యొకటి యుఁగలదా యని చెప్పెను.

అంత, మాసంతకుల గోత్రుఁడగు అద్రిశ్రేష్ఠి భయమేమి, కన్య నివ్వడము లేదని మొఱపెట్టుచుండఁగా, మూడు లోకములయందైనా పెండ్లి జరుగునా అని చెప్పఁగా విని సింహాజ్ఞుఁడను మంత్రి మొదలఁగ న్యనిచ్చెద మని సత్యముగా మాటనిచ్చి యిప్పుడానోటనే యియ్యడము లేదని, యెందుకు మొఱపెట్ట వలెను. ముందే యివ్వడము లేదని రాజు తోఁ జెప్పఁగూడదా, యని వాక్రుచ్చెను. అంత విజయసింహుడను ప్రధాన మంత్రి కోపించి రాజు చిత్తవృత్తి దెలియక నిష్కారణాబు గా వ్యర్థమగు మాట లాడుచున్నారు. ఉత్తమమైన క్షత్రియ సార్వభౌ ముఁడల్లుడౌటకంటెఁ గీర్తియు సౌఖ్యమును బ్రతాపము నైహికాము ష్మికములు వేఱుగలవా, వేత్త్వెఱ నొక్కొకరు వరుసగా మాట్లాడ వ లదు. ఈశ్వర వరప్రసాద విభవులగు మీకు సమస్తశాస్త్రంబులు విశే షముగఁ దెలియును, గనుకను మీకు మాధుర్య వాక్యంబులు నైజం బులు కనుకను జెప్పిన మాటలఁ దప్పవద్దు కన్య నిచ్చుట మహా మేలు రాజునకు మీకన్న నవశ్యబంధువు లెవరున్నారు.

అదియునుగాక, ముందు కాంచీపురములో గాంధార విఘ్నుండ ను రాజు మహాశాస్త్రజ్ఞుఁడును, దపోనిష్ఠుండునునగు కేశవాచార్యకి, నీ శ్వరానుగ్రహము వలనఁ గలిగిన యిద్దరు కూతులలోఁ బెద్దదైన పు ణ్యవతిని విధ్యుక్తముగాఁ బెండ్లాడెను. అదివిని ఉజ్జయిని పురాధీశ్వరుఁ డగు విక్రమార్కమహారాజు దాని చెల్లెలయిన భాగ్యవతిని బాణిగ్ర హణము చేసికొనెను. ఇంతకన్న నింకను హెచ్చగు దృష్టాంతముల నేమి

చెప్పఁగలము ఇఁకనైనను వేఱు యోచనలు చేయక, శుభప్రయత్నము చేయుఁడనెను

అనిన విని వైశ్యవరులు భూపాలనమొనర్చు రాజాగ్రేసరునితో వివాహ సంబంధము చేయుటకు వైశ్యులమగు మాకుఁ దగునా అదిగాక, మా కులమందుఁ బెక్కుతరముల నుండి మాతులకన్యా వివాహము జరుగు వాడుక కలదు. ఆవాడుక చొప్పున నీకన్యను వివాహముచేసి యివ్వవలసి యున్నది. గనుక నా వివాహమును మీరు కరుణించి జరిగించినట్లయిన, మీకు మహాఖ్యాతి గలుగునని చెప్పిరి.

అది విని విజయసింహుఁడను మంత్రినవ్వి యీ మహారాజు మీ పురమునకు వచ్చినపుడు, వారస్త్రీలు నీరాజన మెత్తవచ్చిన సమయమునం గన్యనీయ సమ్మతించి యిప్పుడీ వ్యాజము చెప్పవచ్చునా అప్పుడే యిట్టి సంగతి యేల చెప్పకపోతిరి అని వక్కాణించెను.

అందుకు వైశ్యులు, రాజు మున్ను పరిహాసముగాఁ గన్య నడుగుచున్నారని యెంచి వారు సంతోషించుకొఱకుఁ గన్యనిచ్చెదమని చెప్పితిమిగాని యీప్రకారము నిశ్చయముగా జరిగింప వలయునను యెన్నికతోఁ జెప్పిన వారముగామని చెప్పిరి.

దానికి విజయసింహుఁడు, పరిహాసమైనను, నిశ్చయమైనను, రాజ సంబంధము గలుగుట చేత మీ వంశము కీర్తిఁబొందుచున్నది. ఇఁకఁ దగును దగదను సంశయ మూంచవలదనియె.

అంత వైశ్యులు, సద్గుణ నీతి, జయ వంశ పరాక్రమ కీర్తిసంపదలు గలరాజులు, సరివారితో బుధ జన సమ్మతముగా శుభ ప్రయోజనము జరిపినఁ దగును గాని, త్రాసు తక్కెడ చేతంబట్టి జీవించు నీ వైశ్యులతో సంబంధము చేయుఁదగునా గాన నీకన్య వివాహ మెన్నివిధములను జరుగ నేరదనిరి.

పిదప విజయసింహుడు రాజునకు మీకన్య నీకయుపోయిన మీరు రాజునకుఁ దక్కువ రాజుతో మీరు సంబంధము చేసినట్టయితే, మీరు రాజునకు సమానులు గాన హెచ్చు తక్కువ లెన్నవలదనెను.

వైశ్యులామాటల నాకర్ణించి భూమిలో బ్రాహ్మణులకు త

మతము శాఖలలోఁ బరస్పరము వివాహము చేసుకొనుట యుక్తి యో గ్యము. క్షత్రియులకు స్వయంవర గాంధర్వ ములుగా నిజ కులమునం దు వివాహ మగుట విదితము బ్రహ్మాంగ సంభవులగు వైశ్యులకుఁ దమ కులములోఁ బరస్పర వివాహ ముచితము బలాత్కారముగా న న్యులన్యస్త్రీని పాణిగ్రహణము చేయుట పైశాచికంబగు ఇటువంటి ధర్మశాస్త్ర నీతి దెలిసి నడుచుటవలన నైహికాముష్మికములు గలు గును. గనుక వైశ్యులకు రాజవంశ వివాహ మేల.

మఱియును, దేవతలను సంరక్షించుట కొఱకుఁ బాలసముద్ర మునందుఁ బుట్టిన కాలకూటమును బరమేశ్వరుఁడు పానముచేసెను. వ ననదీ శైలవారిధి జంతు సంయుతమైన భూమి నాదిశేషుఁడు భరించెను. శ్రీమహావిష్ణువు మత్స్యకూర్మ వరాహా ద్యవతారముల నెత్తి రా క్షసుల నణచె, చంద్రసూర్యులు వాయ్వగ్ని జలధరంబులు లోక సం రక్షణంబులు చేసెడి అట్టి దేవాంశ సంభూతుఁడును మహాకీర్తివంతుడు ను బాండు వంశోద్ధారకుండును నగు నీ రాజు గర్వించి వర్ణసంకరము చేయఁదలఁచెను. ఓ మంత్రీ నీవైననట్లు చేయవలదని చెప్పఁగూడదా.

అని చెప్పగా నాలించి, కుమార కంఠీరవుఁడను మంత్రి క్షత్రి యులు శాస్త్ర ప్రకారము నాలుగుజాతుల స్త్రీలను వివాహము చే సికొనవచ్చును. అట్లు వివాహము చేసికొనుట వలన నా రాజు వర్ణ సంకరుఁడు గాఁడు మఱియు నీ రాజు పరనారీ సహోదరుఁడై పరస్త్రీ పేరు దలంపక యుండును, అట్టి యీ రాజు, మీ పుత్రి కన్యయగు టం జేసి దానిఁ బెండ్లియాడ నిశ్చయించెను గాని, యిందువలన నతని కిఁ బాపము లేదనఁగా

వెన్నకుల గోత్రజుఁడగు కేశవశ్రేష్ఠి రాచ కులములోఁ బుట్టి నక్షత్రికుల విష్ణువర్ధన మహారాజీ జగమంతయుఁ గల్పి యచ్చట చ్చట రాజు లిచ్చిన కన్యల నంగీకరించుట పరువులకుఁ దగునుగాని యీ టుగాక వైశ్యకన్యను దుర్వ్యాజముగాఁ గొనడము శాస్త్ర సమ్మతము గాదు. సంపద గల రాజులు చిత్తము వచ్చినవారిని వివాహము చేసికొ ని భోగపరులుగా నుండుట రాజనీతియే వేదాగమ శాస్త్రవేత్తయైన

వాండ్రకేసు, రాజునకుఁ గన్య నిచ్చినం జెల్లును గాని, యట్టి స్త్రీకిం గలిగిన పుత్రులు రాజ్యము చేయుటకుఁ గర్త లగుదురాయన,

జయధ్వజుండను మంత్రి మీ కుల కన్యకుఁ బుట్టిన పుత్రులకు పితృ సంబంధమైన భూతలాధీశ్వరత్వమును బొందును మీకు సందేహ మేల. ఆ రాజునకు మీ శేయాప్తులని వచింపఁగాఁ,

గర్ణకుల గోత్రుండగు గౌతమశ్రేష్ఠి శంతనునకు దాశరాజు క న్యనీ నందున భీష్ముఁడు రాజ్య తంత్రములను మానుకొనెను. ఇట్టి క థలు పెక్కు లుండఁగా నీవనులు మాకేల. రాజకన్య లనేకులుండఁగా వైశ్యకన్య యేల. రత్నభూషణాలంకృతులైన భాగ్యవంతుల కిత్తడి సొ మ్ములేల కుల కన్యలుండఁ దలిదండ్రులు వ్యసన పడఁగా నన్యకుల కన్య ను జలమున రాజు కోరవచ్చునా. ఇక నీమోహమును ద్యజింప వల యు ననియె.

ఆ మాటలకు శుభగ్రీవుఁడను మంత్రి ధర్మాత్ముఁడును చంద్రవం శస్థుఁడును నగు దుష్యంతమహారాజు కణ్వర్షియొద్దనున్న శకుంతల ని చ్ఛయించి వరింపలేడా రాజుల కగ్రజన్ములైన బ్రాహ్మణజాతి కన్యను వరియించుట తగియుండఁగా మూఁడవ జాతి కన్య నంగీకరింపఁదగదా.

అని చెప్పఁగా వైశ్యులిట్లనిరి అద్వైతవాదులు బ్రహ్మను పర బ్రహ్మమనియును శివభక్తులు పరమేశ్వరుఁడే దైవమనియును, గాపాలి కులు, భైరవుండే దైవమనియును, హరిభక్తిపరాయణులగు భాగవతు లు, హరికే పర్వతముగలదనియును, గృపణ మతస్థులు, జైనుని దైవ మనియును సౌరులు సూర్యుని దైవమనియును బహు విధంబులుగాఁ జె ప్పుటయు గాక, మున్ను ద్విజులు నడిచిన మార్గము లనేకములు గలవు వైశ్యకన్యను నృపతులు వివాహము చేసుకొని వృద్ధియైయుండు వారిని దెలుప వలయును

అనంగాఁ బ్రధాని కుమారకంఠీరవుండు మంచిది, మీకుం జెప్పి నను వినరు భయమునులేదు రాజు మన్నించినాఁడని, మహా రాజన ముతో రిత్త మాట లాడుటము మీకుఁ జెల్లునా రాజునకుఁ జిత్తవృత్తి తిరిగినం దెలియుననియె.

అంత, సూర్యకుల గోత్రుఁడగు దర్శి శ్రేష్ఠి, కొంచము కోపము గలవాఁడై యో మంత్రి మీ రాజు పలువురను గెలిచెను గాని, కామ క్రోధ లోభ మోహ మద మత్సరంబు లను నరిషడ్వర్గములను గెలువఁ జాలక పోయెను గదా రంభాదులగు స్త్రీలతో భోగించు, గౌతమ మహా ముని భార్యయగు నహల్యను గామాతురుఁడై కోరి, దేహమునస హస్ర యోనులు గలిగి, యందఱ చేతఁ దిరస్కరింపఁ బడెను, గాన రాజశ్రేష్ఠున కట్టి కామాక్రియ లేదుకు,

మఱియుఁ, బరమేశ్వరుండు క్రోధము చేత బ్రహ్మ తలను ద్రుంచినందునఁ, గపాల హస్తుఁడై, సర్వలోకముల యందును దిరుగుచుండెను కాబట్టి, క్రోధము చేత సాధుల మీద కార్యములు చేయఁ దగవే

వెండియు, దుర్యోధనుఁడు ధర్మ రాజాదులకు సూది మోపినంతభూమి నైనను లోభముచే నీక పోయినందునను, ద్రౌపతీ మానభంగము చేసి నందునను ధన బల రాజ్య సోదరులను బోఁగొట్టుకొని భీమునిచేతఁ దాను బుద్ధి హీనుఁడై, మృతి నొందెను గాన లోభము తగదు

దశరథుఁడు కైకమాటకు వశుండై, శ్రీరాముని వనవాసమునకుఁ బంపి, పుత్ర శోకము చేతఁ బరలోక గతుఁ డయ్యెఁ, గానమోహమనుచితము,

లోక, కంటకుఁడైన రావణుఁ డాగ్రహము చేత సీతాదేవిం గొంపోయి, మద మత్తుఁడై, బంధుయుతముగా నశించెను, గాన మదము తగదు

అధిక ధార్మికుఁడైన ప్రహ్లాదుని యోగ్యత నెఱుఁగక. యతని మీద మచ్చరించిన హిరణ్యకశిపుఁ డేమయ్యెఁ, గాన మాత్సర్య ముచితము గాదు,

చెడుగుల నాపాదించునీ యరిషడ్వర్గ యుక్తాయుక్తములు, ధీమంతులు బుద్ధివలనఁ దెలిసికొన వలయుఁగదా శాంతనవు నంతవాఁడీ జగము గెలిచి తెచ్చిన, కాశి కన్య యన్య పరుషేచ్ఛ గలిగి యున్నదని తెలిసి, యాస్త్రీని విడిచిపెట్టెను, మహాఘనుఁడైన రాజశేఖరుఁడు నిజ వంశ కన్యను సంతతికై పరిణయము చేసికొనఁ దగును భోగ కాంక్షకై

జగమెల్ల గెలిచి రాజకన్యలను దెచ్చి యుండందన కిష్టమైన స్త్రీలను వరింప వచ్చును నను రాజు పంపిన సకలద్వీపముల యందు వెదకి, మహా రూపవిలాసంబులు గల సుందరవతియైన స్త్రీని దెచ్చి యిత్తుననియె.

అది యాలించి, ముఖ్య ప్రధాని యగు విజయసింహుఁడు, మనుజేశ మహా యోగ్యమైన కౌస్తుభ మాణిక్యము దొరికిన, సవర్ణములను గోరునా అతి మనోహరమైన యమృతము దొరికిన, మడుగులోని జలమును ద్రావఁ జూచునా, కోరినయాడఁ దగిన పరసవేది దొరకిన నితర లోహములయం దాసయుంచునా కామధేను వింట నున్న నేనుముల మీఁద మనస్సు గలుగునా- అన్నట్టు కన్యకామణియైన వాసవ కన్యయం దిచ్ఛ యుంచిన రాజు పరస్త్రీలఁ దలచునా తలంపఁడు. ముందు చెప్పిన బ్రాహ్మణ కన్యల రీతిని జలము చేనైన, బలిమిఁ చేనైన, మీ కన్యం గైకొను ననఁగా,

బుధనుకుల గోత్రుఁడగు నాధోగ్రశ్రేష్ఠి విప్రులు వేదవృత్తిగలవారు ఎట్లైనియు మాన్యులేమి చేసినను. మెచ్చఁబడఁ దగిన వారు, మమ్మునట్లందురా ఇఁకఁ దియ్యని మాటలచేఁ బని కాదు- నిజముగా మా చిన్నదాని నెంతమాత్రము మీ కివ్వము, అని వైశ్యులందఱు నేక వాక్యముగాఁ జెప్పిరి.

ఇట్లు వైశ్యపుంగవులు చెప్పఁగా, భటులం జూచి, విష్ణువర్ధనుఁడు మహా కోపోద్దీపితుఁడై కన్నులలో నగ్ని కణములు రాలఁగా సభాజనులకు భీతి గలుగునట్లు మహా కఠినోక్తులతో, సౌందర్య వతియైన యా కన్యను బట్టి బలవంతముగాఁ దెండు ఈవణిజాధములాడు దుర్భాషల కింక నోర్వఁజాలను, వీరిని సంహరింతును మీరు వీరి నందఱు శృంఖలా బద్ధులం జేసి వీరి పట్టణముల నే మాత్రము శంకింపక కాల్పుండని, మంత్రుల కాజ్ఞాపించెను. మఱియును సింహాసనముల మీఁద నున్న వైశ్యముఖ్యులను జూచి యెందు కిచట నున్నారు, లెండని కన్నుల నిప్పులు రాలఁగాఁ బ్రళయకాల రుద్రుని చందమున నత్యుగ్రకోపాటోపంబున నుండు నా రాజు ముందర వైశ్యులు దిగ్గనలేచి నిల్చి యందఱు నేక వాక్యముగా నిట్లనిరి.

ఓ మహారాజా- ప్రళయకాల రుద్రుఁడు జగంబులను సంహ రించినను, చతుస్సాగరము లొకటిగాఁ బొంగి భూమిని ముంచినను బాములు తెఱమి కరిచినను రాజులు మేరదప్పి నడిచినను భూమిజను లెట్లు జీవించి యుందురు. అది యట్లుండనిమ్ము పట్టణంబులను భస్మము చేసి, స్త్రీలను జెఱఁ బెట్టి మమ్మునందఱం జంపి మ్రింగినను, మాకన్య నియ్యము. మా కుఁ బ్రాణములు తృణ ప్రాయములుగాఁ దోఁచుచు న్నవి. ఓ రాజా నీకు నపకీర్తి జగమందు నిండును. మాకు మాన ధ నమే చాలును. మా ప్రాణము ధనము నీ సొమ్ము. అధర్మము నీకుఁ దగదు దయయుంచుము- భూమిలో రాజులు ప్రజలకుఁ దలిదండ్రులు మేము సాధులమైన వైశ్యులము. ఒకరి జోలికింబోవు వారము కాము. ఇంత చలమేలయని వెఱవక న్యాయమగు నిష్ఠూర వాక్యముల నొక్క రీతిగాఁ బలుక నాలించి, రాజు, ప్రధానులతో నీ వైశ్యుల శృంఖలా బద్ధులఁ గావించి, దండుతో వెడలిపోయి, వీరి పట్టణములను గాల్చి, యీ కన్నియనుగొని రండని సేనాధిపతులకు జెప్పగా, నా సభా స్థల మంతయుఁ గోలాహలంబయ్యెను. అప్పుడు విజయసింహుఁడను మంత్రివైశ్యులను బహిర్ద్వారంబు వద్దికిం దొలిగించుకొని పోయెను. సే నలు బైలు దేరెను. భూపతియుం గొలువు చాలించి యంతః పురంబు నకుఁ జనెను. అప్పుడు మహా నేర్పుగల మంత్రివరుఁడు సేనలను నిలిపి యాగ్రహము కూడదు కన్య నిండని బహు ప్రకారంబులఁ గాలోచితం బులగు మాటలచేత వైశ్యుల నొడంబఱిచి యంతః పురంబునకుఁ బో యి నానా విధ నీతులచేత రాజు కోపంబు చల్లార్చి, యీ వచ్చిన వై శ్యులవలన మన కేమి కావలయు- వీరికిం గన్యకుం గర్తలుగానుండు వై శ్యులు బహు జనులున్నారని చెప్పి, వైశ్యులతోడఁ గావలయు భటు లనంప వారు పెనుగొండ పట్టణము చేరఁగా, వీరి ముఖ విలాసము చూచిన మాత్రమున సమస్త కార్యములను దెలుసుకొన్నవారై వై శ్య సంఘము శ్రీ నగరేశ్వర మంటపంబుఁ జేరి, తమ నిశ్చిత కార్య ము బైలుపడకుండునట్లు జాగ్రతచేసి వచ్చిన రాజ భటులను వివిధోప చారంబులొనర్చి, మహా ప్రియులవలెఁ గావలయు వస్తువు లిప్పించి పు

రమునకు బైట వాసము గల వేశ్యా గృహముల సమీపమందు విడుదు లమర్చి, యందు నివసింపఁజేసి, యీభటుల స్వావశము చేసుకొండని వేశ్యా స్త్రీలకు నాజ్ఞాపించి తమ పదునెనిమిది పట్టణముల వైశ్యులు నేకాంత స్థలంబునఁ జేరి, యుక్తాయుక్త విచారంబులు చేయనారంభించిరి. ఆ రాజ భటులును వచ్చిన కార్యమందుఁ గొంచెమేనియు జ్ఞాపకము లేక దేహములు మఱచి స్త్రీలోలురై మహా సంతోష వార్ధిలో మునిగి యుండిరని సాలంకాయన మౌని తెలుప, నా వైశ్యమునులు తమ కులస్థులకు నీరీతిని సంభవించిన యాపద నివృత్తియైన కథా వృత్తాంతములను దెలుపుమని కోరిన నమ్మహాత్ముండట్లు చేయుదునని యంగీకరించి చెప్పం దొడంగె.

ఏడవ యుల్లాసము ముగిసెను.



శ్రీవాసవాంబాయైనమః

# శ్రీకన్యకాపురాణము.

ఎనిమిదవ యుల్లాసము.



ఇందు వాసవకన్యా వివాహ విషయమై వైశ్యులు తమలోఁదాము పరస్పరము చర్చించుకొని, భిన్నాభిప్రాయులై యుండ్లకుబోయి, పిదప భాస్కరాచార్యుల సన్నిధిని బ్రాణమేనియుఁ ద్యజింతుము గాని, కన్యనిచ్చుట లేదని, నిశ్చయించుకొనుటయు - అనంతరము వై

శ్యులలో ౬౧ర గోత్రజు లొకకక్షిగాను, ౧౦౨ గోత్రోద్భవు లొక క
క్షిగాను, భిన్నులై చర్చించి కడపట ౧౦౨ గోత్రజులు మాత్ర మగ్ని
ప్రవేశము చేయ నిశ్చయించుటయు, ౬౧౨ గోత్రజులగువారు జాతిభ్ర
ష్టులై, నానావిధ నామధేయములు వహించి, నానాదేశములకుఁ బో
వుటయు సభ్యుల యుత్తరువు ప్రకార మగ్ని ప్రవేశము చేయుటకై
వాసవకన్య యభిప్రాయ మెఱుంగఁగలందులకుఁ గుసుమశ్రేష్ఠి తన
యింటికిఁ బోయి వ్యసన పడుచుండఁగా, వాసవకన్య తండ్రికి ధైర్య
ముఁజెప్పి తన స్వరూపముంజూపి జ్ఞానోపదేశముం జేసి యగ్ని ప్రవే
శము చేయుటకు దృఢము చెప్పుటయు కుసుమశ్రేష్ఠి వాసవ కన్యాస
మేతుఁడై, సభకు వచ్చిన పిదప మరల స్వస్వరూపమును జూపి,
మాతులకన్యావివాహాది ధర్మములను బోధించుటయు- సాలంకాయన
మునిప్రత్యక్షమై, ప్రాకృత గోత్రములు ఫలానివనియు వాని మూలము
లిడనియుఁ దెలియఁ జేయుటయు- వైశ్యు లగ్నిగుండప్రవేశోద్యుక్తులై
కంకణములను గట్టుటయు, పిదపఁ దమ బాలురకుఁ బుద్ధిమతులు
చెప్పి, నానావిధ దానములను జేసి భాస్కరాచార్యులకు వర్తన నిర్ణ
య శాసనమువ్రాసి యిచ్చుటయు, వైశ్యభృత్యుం డగ్నిప్రవేశార్థము
తనకు వీరకంకణధారణము చేయింపుడని వేఁడు వైశ్యులట్లు చేయుట
యు, అగ్నిగుండముల నిర్మాణమును వివాహ కార్య నిర్వాహార్థము
రాజ పురోహితుండు పెనుగొండకు వచ్చి వాసవీ మాయా మోహి
తుఁడై యుండుటయు, పిదప స్త్రీలు వాసవకన్యకు సకలాభరణముల
నలంకరించి, యా కన్య సౌందర్యాతిశయములను గూర్చి వ్యసన పడు
చుండఁగా నామె నిజస్వరూపమును జూపి, వారికి ధైర్యము చెప్పుట
యు, వైశ్యులు మహా కోలాహలముతో నూరేగి, భాస్కరాచార్య
గృహమునకు వచ్చి, గుండ నిర్ధారణ చేసుకొని స్వస్త్రీలను బిలిపిం
చుకొని, పత్నీసమేతులై, యగ్నిప్రవేశము చేయుటయు- వారి నగ్ని
సహింప కుంటయు, అనంతరము వాసవకన్యా ప్రార్థనా పూర్వకమై
స్తుతుల నంగీకరించి, యగ్నిదేవుఁడు ప్రజ్వలించుటయు వాసవకన్య
న సోదరులకు బుద్ధిమతులు చెప్పి, ముందు వైశ్యకులముం దుఁ బుట్టఁ

గల స్త్రీలు, రూపహీనులై యుందురు. గాక యని శపించుటయు, ఈ శ్వరుఁడు ప్రత్యక్షమై, వాసవ కన్యకుఁ గోరిన వరము లిచ్చుటయు వాసవకన్యా సమేతులై, వైశ్యవిభు లగ్నిప్రవేశముచేసి, కైలాస పదవి బొందుటయు, విష్ణువర్ధన భూపాలుని మరణంబును వైశ్యబాలురు తమ పితరులకు నూర్ధ్వలోక క్రియలు జరుపుటయు, విష్ణువర్ధన భూపాలుని పుత్రుఁడు తండ్రికి నూర్ధ్వక్రియ లాచరించి వైశ్యబాలురను శరణు జొచ్చి. దేవి యనుగ్రహమును బొందుటయు, వైశ్యబాలురు గయా శ్రాద్ధాదులు జరిపించుటయు కన్యకాదేవి యేడు దినములు పెనుగొండలోఁ బ్రసన్నమై యుండి, రాజపుత్రుని ననుగ్రహించి, వైశ్యబాలురకు దేవీపూజా విధానము గోత్రప్రవర వివాహ విధులు మున్నగు ధర్మములను బ్రబోధించుటయుఁ జెప్పంబడుచున్నది.

—(వాసకన్యా వివాహ విషయమైన చర్చ.)—

ఓ వైశ్యమునులారా, అట్లు యుక్తాయుక్త విచక్షణంబు చేయు కొఱకు, శ్రీ నగరేశ్వరస్వామి మంటపంబున సభగూడిన, యేణ్బాట పదునాలుగు గోత్రజులగు నగరస్వాములందఱు, మహత్కార్యము సంభవించెను గదాయని. వ్యసన సాగరములో మునింగినవారై, చింతించుచుండు సమయంబున రాయభారము పోయి వచ్చిన వైశ్యముఖ్యులు సభవారికి వందన మొనర్చి విష్ణువర్ధన మహారాజు తమకుఁజేసిన మర్యాదలను బిదప రాజమంత్రులకును దమకును జరిగిన సంవాదంబులను, దాము కన్య నియ్యమనఁగా రాజునకు నాగ్రహము కలిగినదియు బిమ్మట మంత్రి యా యాగ్రహమును శమింపఁజేసి తమ్ము సమాధాన పఱచినదియు సవిస్తారంబుగాఁ దెలిపి యికను జరుపవలసినదాని యోచింప వలయుననియును విన్నవించిరి.

అంత నా సభాసదులగు కొందఱు, కృషి వాణిజ్యాది జీవనములుగల వైశ్యులెక్కడ దుష్టనిగ్రహ శిష్టపరిపాలనము చేయు చంద్రవంశజుఁడగు విష్ణువర్ధన మహారాజెక్కడ యీ సంబంధము వలన లోకనింద కలుగుననిరి.

అదివిని కొందఱు నవ్వి, విష్ణువర్ధన మహారాజు సత్యసంధుఁడు

బ్రాహ్మణ భక్తుఁడు, మహాధార్మికుఁడు మనకన్న శ్రేష్ఠకులముగల వాఁడు. ఇట్టివానికి మన కన్య నియ్యుటయు, లోకమునకును శాస్త్రము నకును సమ్మతముగా నుండుననిఁ వచించిరి.

మఱికొందఱు కలియుగమందు స్వవర్ణమందే వివాహము కావ లెఁగాని, యన్యకుల సంబంధము తగదని, పారాశర్య స్మృతియందు విధింపఁబడి యున్నది. గనుక నా విధికి విరోధముగా నడిచినవారు న రక ప్రాప్తులగుదురు. ఆ విధిప్రకారము నడిచిన పక్షమందు, దిగంత విశ్రాంత కీర్తిగలుగును. గాన నీ రాజసంబంధము చేయుటయు మాకు సమ్మతము లేదని వక్కాణించిరి.

ఈ మాటలవిని, జగన్నాథపుర వాసులగు కమలాక్ష విశాలా క్ష శ్రేష్ఠి ప్రముఖు లీ రాజ సంబంధము గలుగుట దుర్లభము. పూర్వ జన్మ పుణ్యము వలన నిట్టి సంబంధము దొరక వలసినదియ కాని వే ఱు కాదనిరి.

అందుకు, జగన్నాథపుర వాసియు, బలిశిష్ఠ గోత్రోద్భవుఁడును నగు భద్రిశ్రేష్ఠి, స్వకుల ధర్మము విడిచి యన్యకుల ధర్మము నవలం బించు వాఁడు సురాపానము చేసిన బ్రాహ్మణుని వలె, నిందితుఁడగు ననెను. మఱియుఁ గళింగ పురాధీశులగు కొందఱు నగరస్వాములు కా మము చేతఁగాని లోభము చేతఁగాని యెవరు కులధర్మముల నతిక్ర మించి నడుతురో, వారు ఘోర నరకమందుఁ జిరకాల వాసులుగా నుందు రనిరి.

అంత గ్రంధిశీల గోత్రోద్భవుఁడైన శంకరశ్రేష్ఠి మీరు చెప్పి నదంతయు యుక్తముగా నుండలేదు. చెవులకు నారాచములై తోఁ చుచున్నది. మీరు మార్గాయాసము కలిగి యున్నారు. గనుక కొం కదడవు విశ్రమింపుఁడని చెప్పెను.

అనంతరము పాలకొండ నగరస్వాములగు విశ్వేశ్రేష్ఠి, వీర భ ద్రశ్రేష్ఠి ప్రముఖులు మన వర్ణముకన్న నెక్కుడు వర్ణముగల రాజ శ్రేష్ఠునకు మన కన్య నియ్యుటయు వలనఁ దక్కువ లేదు. ఎన్ని విధ ముల చేతనైనం గన్య నియ్యవచ్చునని,

ఈ వచనములను విన్న పాలకొండ పురవాసుఁడగు వీరయ్య శ్రే ష్ఠి యన్యకులమందుఁ గన్యనిచ్చిన సంగతిని విన్న మాత్రమునఁ జాం ద్రాయణవ్రత మాచరింప వలయును. స్వకులమందు గుణశ్రేష్ఠుఁడుగా నుండు వానికిఁ గన్యాదానము చేయడ మర్హమని పెద్దలు చెప్పఁగా వినలేదా యనెను.

ఆ మాటల నాలకించి, కొండజెట్లనిరి. అజ్ఞానుఁడు దరిద్రుఁడు, కరహీనుఁడు కృతఘ్నుఁడు మిత్రద్రోహి, ఇట్టివారు కన్యాదానమునకు నర్హులుగారు. అట్టివారికిఁ గన్యనిచ్చినఁ, జాంద్రాయణవ్రత మాచరిం పవలయునని, శాస్త్రవేత్తల వలనఁ బ్రతిపాదింపఁ బడుచున్నది గుణ హీనుఁడైనను, రాజునకుఁ గన్య నియ్యవచ్చుననిరి.

అంత ధర్మపురాధీశుఁడగు, గణపకుల గోత్రోద్భవుఁడైన ధ ర్మయ్యశ్రేష్ఠి యీ మాటలు విని చిఱునవ్వు నవ్వి, య శాస్త్రీయమగు నీ మాట లేల. రాజ సంబంధము మనకుఁ దగదు. స్వకులములోఁ గ న్య నిచ్చుట దగిన దనెను.

అంతఁ గొండదఱు రాజునకుఁ గన్యాదానము చేయుటవలన, మ నకు మంచి కలుగును. చేయకపోయిన విపత్తు సంభవించును. గనుక, రాజునకుఁ గన్య నిప్పించి, మన పట్టణములకుఁ బోదమనిరి.

అది విని, మాధవశ్రేష్ఠి మొదలుగాగల వారు రాజునకు మన ము కన్య నియ్యక పోయిన మన కేమి. ఈ పట్టణము కాకపోయిన, వే ఱొక పట్టణములో మన ముండవచ్చును. మన ముండుచోటు లభివృద్ధి గా నుండును, గనుక చింతింప వలదని చెప్పిరి.

ఆనంట పురాధీశులగు వైశ్యవరు లీ విమయమును గురించి యిన్నిమాటలేల. పెండ్లికి నిశ్చయింపఁబడిన దినము సమీపించెను, క న్యాదానము చేసి యిచ్చెద మనుటయు లేదనుటయు, శీఘ్రముగా ని శ్చయించిన మేము మా యూరికిఁ బోదుమనిరి.

అందుకు, ఘంటసాల పురవాసులగు భద్రయ శ్రేష్ఠి, సుభద్ర య్యశ్రేష్ఠి, రుద్రయ్యశ్రేష్ఠి ప్రముఖులు మన వంశము యొక్క మాన మును గాపాడుకొని మనము పోవుట మంచిదనిరి.

శివపట్టణపువారు వివాహ నిశ్చయముచేయకనే మనమెట్లు మన యూళ్లకుఁ బోవచ్చును. కన్యయొక్క తండ్రి యిష్టముచొప్పున జరుగవలయుఁగాని బంధువుల యిష్టప్రకారము జరుగునా రాజునకుఁ గన్యాప్రదానము చేయక మనమేమి చేయఁగల మనిరి.

అంతఁ బేరిశిష్ట గోత్రుఁడగు సంజీవ శ్రేష్ఠి కన్యాదానము చేయుటయందుఁ, దలిదండ్రులు బంధువులతో యోచించి, చేయవలసినది గదా యని చెప్పెను.

ఇట్లు సభికులందఱు నత్యగ్రి కోపముతోఁ గన్ను లెఱ్ఱ చేసుకొని, కొందఱు రాజుపక్షమును గొందఱు కులపక్షమును, నవలంబించి పరస్పరము చర్చించుకొను చుండుట కుసుమశ్రేష్ఠి చూచి మాళిశ్రేష్ఠి ప్రముఖులతో, నాలోచించి, సభాసదులగు వైశ్యవరులను గూర్చి మహా వినయముతో, నీ విషయమును గురించి యెట్లు జరిపింపవలయునో, యది చక్కఁగా యోచించి, జరిపింపవచ్చును. ఇప్పుడు మన యిండ్లకుఁ బోదమని బైలుదేరి స్వస్థానములం జేరిరి.

పిదప నా కుసుమ శ్రేష్ఠి, తత్తత్పురవరాధీశులగు వైశ్యవరుల యాలోచనలను దూతలవలనఁ దెలిసికొన్నవాఁడై తమ కులగురువగు భాస్కరాచార్యుల గృహమునకుఁ జని, యా వృత్తాంతమును వారికిఁ దెలుపఁగా వారు తమ శిష్యులగు వైశ్యవరులను రావించి, యథోచితస్థానములఁ గూర్చుండ నియమించి, వాసవకన్యను రాజున కిచ్చుటమీకు నిష్టమా యియ్యకుండుట యిష్టమా, యని యడిగెను. అంతఁగొందఱు వైశ్యులు రాజునకుఁ గన్యనివ్వడము సమ్మతము లేదని చెప్పఁగా మీరు కన్య నియ్యని యెడల రాజునకు నిశ్చయముగాఁ గోపము వచ్చునని భాస్కరాచార్యులు చెప్పెను. అట్లు రాజునకుఁ గోపము వచ్చిన మేము కన్యతోడఁ బ్రాణత్యాగము చేయుచున్నామని యా వైశ్యులు ప్రత్యుత్తరం బిచ్చిరి. అంత, భాస్కరాచార్యులు విచారించి, మీరందఱట్లు ప్రాణత్యాగము చేయఁగలవారని యడగిన, వైశ్యులు తమలోఁ దా మాలోచించి, ప్రాణత్యాగము చేయ నిశ్చయించుకొన్న వారిని లెక్కించుకొని 102 గోత్రములవారము ప్రాణత్యాగము చేయఁ

గలవారమని చెప్పి, భాస్కరాచార్యుల యనుమతి వడసి శ్రీశైలగిరి స్వాములు సమూహాము చేయు స్థలమగు నగరేశ్వర ముఖమంటపము ను జేరిరి.

అనంతరము కుసుమశ్రేష్ఠి లేచి, సభికులకు పాదనమొసర్చి, లగ్ననిమిత్తము రాజు వచ్చు కాలము సమీపించెను. అవకాశము లేదు. పూర్వులగు మన బాలురు "కన్నె నిచ్చెదము లేదా వచ్చెదము" అని రాజుతోఁ బ్రతిజ్ఞచేసి వచ్చిరి. అని చెప్పఁగా నా మాటలను బాలనగరులు విని, యతికోపావేశంబునఁ గన్బొమలు ముడివడఁగాఁ గుసుమశ్రేష్ఠి మొదలుగాఁ గల వారిని జూచి, యహాహా, మీరు మంచి యాలోచన చేసితిరి. చంద్ర వంశస్థుఁడగు నా రాజుయొక్క పరాక్రమము మును జక్కఁగా దెలుసుకొనలేక యతనికిఁ గన్యనివ్వడము లేదని నిశ్చయించితిరి. ఆ రాజు సకల రాజ్యములను జయించి, యఖండ మండలాధీశత్వమును వహించి దుష్టనిగ్రహ శిష్టపరిపాలనం బొనర్చుచు, శౌర్యౌదార్యాది గుణములు గలిగి, కీర్తిశాలియ భూతుఁడై శ్రీమన్నారాయణాంశ సంభూతుఁడై ద్వితీయ వర్ణమందుఁ బుట్టి మనకంటె నెక్కుడు కులము గలవాఁడై యున్నాఁడు. మనము మూఁడవ వర్ణమున జన్మించి, యా రెండవ కుల ధర్మములకుఁ దక్కువయగు, ధర్మములనే యాచరించుచుందుము. శాస్త్రక్రమము ననుసరించి బ్రాహ్మణులు నాలుగుజాతుల స్త్రీలను, క్షత్రియులు, మూఁడుజాతుల స్త్రీలను వైశ్యులు రెండుజాతుల స్త్రీలను వివాహము చేసికొనవచ్చును వృషలియను నాలవ వర్ణస్థుఁడు రజస్వలయైన దైనను, స్వజాతి స్త్రీని బెండ్లి యాడవచ్చును. ఇట్లుండఁగా నా రాజునకు మన కన్యను నిచ్చుటచే మనకేమి కొఱంత కాన నవశ్యమీవలయును. అట్లిచ్చుటవలన మనకు సకల సామ్రాజ్యములు గలుగుననిరి. ఆ మాటలను ౧౦౨ గోత్రముల వారు విని, యిదియేమి, కులధర్మ నాశకరమగు మాటలను జెప్పితిరి. రాజు లతిక్రూరబుద్ధులు- దురాచారులు- పరద్రవ్య పరదారాపహారులు. మనము సాధులము- అధర్మములను సహింపఁజాలని వారము- సదాచారులము- దానశీలురము- సుమతులము- ఇట్టిమనకు రాజులసం

బంధ మెట్లనుకూలించును. ధర్మవంతులు ధర్మవంతులతోడను, ద్రవ్య వంతులు ద్రవ్యవంతులతోడను- కులీనులు కులీనులతోడను- సదాచారులు సదాచారులతోడను- సాధులు సాధులతోడను- సంబంధము చేయుట తగియుండు నని చెప్పఁగా, ౬౧౨ గోత్రజు లతిరోషావేశులై. కులాభిమానగర్వులగు మీరు న్యాయ్యమును విడిచి క్రోధమునే యాపాదించుచున్నారు. పూర్వము మహాత్ముఁడగు యయాతి యను రాజు భార్గవుని కూఁతురైన దేవయానను వివాహము చేసికొన్నది. మీరు వినలేదా. అదిగాక, తొల్లియనేక క్షత్రియులు బ్రాహ్మణస్త్రీలను వివాహము చేసికొన్నారని మనము వినియున్నాము గదా, అట్లుండఁగా, నూరుజులమగు మనము, రాజున కేల కన్య నియ్యఁగూడదు. ఆవస్య మియ్యవలశినది. అందువలన సకల సామ్రాజ్య వైభవములఁ బడయవచ్చును, మితిలేని ధర్మములను జేయవచ్చును. మిక్కుటమైన ద్రవ్యసంపదచేత యజ్ఞ యాగాది క్రతువులఁ జేయవచ్చును. అట్టిరాజాధిరాజు మనకల్లుఁడయ్యెనేని, మనము దిగంత విశ్రాంత యశమును బొందుదుమనిరి.

ఈ మాటలను ౧౦౨ గోత్రములవారు విని యధిక కోపము కలవారై మీరు రాజపక్షపాతులరు- మీరు చెప్పునది సరియనిమాకుఁ దోఁచలేదు- యుగాంతరములయందు మహాత్ములగు వారివలన స్వేచ్ఛాప్రవర్తనముగా నశ్వమేధము- గోమేధము- మొదలుగాఁగలయాగములను శ్రాద్ధాదులయం దామిషభక్షణమును, వ్యాసమునితన తమ్ముని భార్యయందుఁ బుత్రోత్పత్తి కలుగఁచేసినట్లు, కనిష్ఠుని భార్యయందు జ్యేష్ఠుఁడు పుత్రోత్పత్తి కలుగజేయునట్టి దేవర న్యాయము మొదలగు ననేక కార్యములును శాస్త్రచోదితములై యాచరింపఁబడి యున్నవి. అవి యీకలియుగమందు వర్జింపఁదగినవని యాశాస్త్రములే మొఱపెట్టుచుండఁగా, నట్టికార్యము లిప్పుడెట్లుచేయఁదగు. వా సాదృశ్యముగల ప్రస్తుతోద్దిష్టకార్యమగు కన్యాదానము రాజునకు మనమెట్లు చేయఁదగు. మఱియును, చంద్రవంశస్థుఁడగు నీ భూపతియుత్తముఁడే. ఇతనికి మన కన్యనివ్వడ ముచితమే. అయిన నీఁకమీఁదనీ

కలియుగమందు౯ గేరళులు- కిరాతులు- కళింగులు- బర్బరులు- శకులు- యవనులు- సింహళులు- గాంధారులు- హూణులు- మ్లేచ్ఛులు- మొదలైన యధర్మ పరులు- పరద్రవ్యాపహారులు- మద్యపానులు- క్రూరకర్ములు- దురాచారులునగు నానా సంకర యోనిజులు భూపాలురు కాఁబోవుచున్నారు. వారులు బూర్వ దృష్టాంతమువలన సాధులగు మనకన్యలను వివాహమున కడుగుదురు. ఈకున్న బలాత్కారముగా గ్రహింతురు, అట్లుగ్రహించిన పక్షమునఁ బితరులకు నరకము గలుగును. అంత్యజులకును వైశ్యులకు నంతరాంతము లేకపోవును. సద్వకర్మములు నశించును, ఆకారణమును బట్టి, మనకన్యను జేనికిఁగూడ దనిరి.

అంత ౬౧౨ గోత్రజులు, ౧౦౨ గోత్రజులును జూచి, మీరు ధర్మముననుసరించి మాట్లాడుచున్నారు అజీర్ణభయముచేత భోజనముచేయక యాఁకలివలన మృతినొందిన చందంబున, సింకముందురాఁబోవు రాజుల నెపమునుబట్టి యిప్పుడు ధర్మపరతుఁడైన విష్ణువర్ధన మహారాజునకుఁ గన్యనివ్వకపోయిన నాతండీవైశ్యకులస్థులను బుత్రపౌత్ర మిత్ర బంధు దారా ప్రముఖులతోడ సంహరించి కన్యను గ్రహించును- అందుకేమి సంశయములేదు- అన్యాయముగా వైశ్యకుల నాశనమునకుఁ గాలము సమీపించిన దనిరి.

ఆ మాటలను ౧౦౨ గోత్రస్థులు విని, వాసవకన్యను మేమొక మాత్రము రాజున కియ్యము ఆ రాజు రాక్షస కృత్యమునువహించి, మమ్ముఁ జంపవచ్చిన మేమందఱము దారా పుత్రాదులతోఁ బరమేశ్వరుని ధ్యానము చేయుచుఁ, గన్యతోడ నగ్ని ప్రవేశించి కులపావనము చేసెదము. అందువలన రాజు సంశయములేక నశించును. అపకీర్తిఁగలిగిన పిమ్మట, రాజ్యాది సంపదలుండియు నేమి ప్రయోజనమని వచించిరి.

అంత ౬౧౨ గోత్రస్థులీ నిశ్చయమును విని, యహహా, మీరగ్ని ప్రవేశముచేయ నిశ్చయించుకొన్నది మిగులబాగుగానున్నది. తేలుకుట్టిన దొంగ పడి పాముకాటుఁబడ్డరీతిగాఁ మీరు కులధర్మములను బట్టి

పాలించువారివలెఁ గాలాగ్ని ప్రవేశమై, యాత్మహత్యను జేసుకొని, పతితులవుదురు. ఆత్మహత్యవలన మహానరకమనియు, సద్గతులు లేవనియు స్మృత్యాదులు మొఱపెట్టడము వినలేదా. జీవించియుండి సుఖము లనుభవించి ధర్మములను బాలింపవలయును గాని, చచ్చినవెనుక గలిగెడు కీర్త్యపకీర్తుల నెవరు వినఁగలరు. గనుక మేమగ్ని ప్రవేశము చేయము. అటువంటి బాంధవ్యము మాకు వలదనిరి.

పిదప ౧౦౨ గోత్రోద్భవులగు వైశ్యవరు లామాటల నత్యాశ్చర్యముతో విన్నవారై, లోకమున దేహికి జనన మరణములుసిద్ధము దేహత్యాగము చేసినైనను స్వధర్మమును బాలింప వలయును. గనుక క్షణభంగురమగు నీ దేహమును గులధర్మముల కొఱకుఁ ద్యజించెదము. యుద్ధమందును, గోబ్రాహ్మణుల సంరక్షణయందును, స్వధర్మము చెడిపోవు సమయమందును, నెవ్వఁడు తన దేహమును ద్యజించునో వాఁడు స్వర్గలోక ప్రాప్తుఁడగును. స్వధర్మ పరిపాలన కొఱకునాత్మహత్య చేయుడము వలనఁ బాతకము లేదనియు నటులస్వధర్మములను బాలించుటయుఁ దగ్ని ప్రవేశము చేయుట- నీళ్లలోఁ బడుట- కొండపైనుండి క్రిందదూఁకుట- మొదలగు కార్యములుచేసి ప్రాణత్యాగము చేయుట యుచితమనియు నందువలన స్వర్గాది పుణ్యలోకములు గలుగుననియు, శ్రుత్యాదులు ప్రతిపాదించుచున్నవి. అట్లగుటం జేసి, కులధర్మ పరిపాలనము కొఱకు మేమిప్పు డవశ్య మగ్నిప్రవేశము చేయుచున్నారము. మీరు మరణమునకు భయపడినవారైన మీ మీ యిండ్లకుఁ బోవచ్చును. ఒకవేళ మీరిపుడు చెప్పిన ప్రకారము కన్యనిమిత్తము రాజు దండింపవచ్చినఁ బలాయనులు కండు. ఇఁకను మాకన్యను మీకివ్వము. మీకన్యను మేము పుచ్చుకొనము. మీకు మాకు సంబంధ మక్కఱలేదు. మీ యిచ్చవచ్చినట్లు చేయవచ్చును- మాతోడ మీరుండఁదగరు. మాకుఁ గాలవిడంబన మగుచున్నది. అని ఖండితముగాఁ జెప్పఁగా ౬౧౨ గోత్రజు లతిఖిన్నులై తమతమ నెలవులకుఁ జనిరి. అంతట శ్రీనగరేశ్వర ముఖమంటపమందు నిలిచియున్న కులనిర్వాహకులగు నూటయిబ్బండ్రు నగరమువారును మహా వీ

రపరితాపశాలురగుచు, రాజురాకను దమకు సూచింపుఁడని, తమబాలురకాజ్ఞాపించి, కావలియుంచి యతి సంతోష కుతూహల స్వాంతులై, భాస్కరాచార్యుల చెంతకుఁ బోయి, నమస్కరించి, ముందు జరుగవలసిన కార్యములఁ దెలియఁజేయుమని యడిగిరి.

-*నూటయిబ్బండ్రు నగరమువారు నగ్ని ప్రవేశమునకు నిశ్చయించుట*-

అంత భాస్కరాచార్యులు- వైశ్యోత్తములారా! మున్ను నారదమునివలన విన్న రహస్యమును జెప్పుచున్నాను. ఏమనఁగాఁ, బూర్వము మీ సంబంధులగు వైశ్యులు కైలాసవాసము చేయుచుండఁగా వారికన్యయగు కీర్తికన్యను జిత్రకంఠుఁడను గంధర్వుఁడు కోరి యడుగఁగాఁ, గన్నియ నీయమని నిరాకరించిన యా వైశ్యులను గన్యాసహితము భూమియం దగ్ని దగ్ధుల రగుదురుగాక యని శపియించెను. అట్లు శాపహతులైన యా వైశ్యులు నా గంధర్వునకుఁ బ్రతిశాపమిచ్చిరి. ఆ గంధర్వుండు యిప్పుడు విష్ణువర్ధన నామమునువహించి, రాజుగాఁబుట్టినాడు. కైలాసవాసము మరల మీకు లభించుకాలము సమీపించినది. గనుక మీ రగ్ని ప్రవేశముచేసి, యుత్కృష్టపదవిని బొందుఁడని యాజ్ఞాపించెను.

ఈ యాజ్ఞను విన్నవాఁడై, కుసుమశ్రేష్ఠి వైశ్యసభకుఁ బ్రదక్షిణ నమస్కారములను జేసి, యంజలిబద్ధుఁడై కులధర్మములను బాలించుకొఱకు, నొకనిఁ బరిత్యజింప వలయునది ధర్మము గనుకఁ, బ్రస్తుతము, మన కులధర్మములను బాలించుటకై నా పుత్ర కళత్రాదులతోడ నగ్ని ప్రవేశము చేయ నా కనుజ్ఞయిండని సభికుల నడిగెను వారు నో మిత్రుఁడా యిప్పుడు నీవుచెప్పినది సరికాదు. కులము నీకొకనికే కాదు! కులస్థుల కందఱకుఁ గావలయునది. కన్య నీఁగూడదను క్రోధముతోఁ గుసుమశ్రేష్ఠిని సకుటుంబముగాఁ జంపినామని నెపము పెట్టి మనకులమువారినందఱ నశింపఁజేయునుగావ, శుభాశుభములను మనమందఱము నేక కాలములో నొక ప్రదేశమున ననుభవింప వల్లయునని చెప్పి తమ ప్రాణములను దృణప్రాయములుగా నెంచి, మొదలు నేకాగ్ర చిత్తులై యగ్ని ప్రవేశము చేయ నిశ్చయించుకొని, స్నా

ర్యాస్తమాన మైనందున సంధ్యాది కృత్యములఁ దీర్చుకొనుటకై తమ తమ గృహములకుఁబోయి, మఱునాఁడు ప్రాతఃకాలమందు స్నానసంధ్యాద్యనుష్ఠానములను దీర్చుకొని నగరేశ్వర మంటపమునకు వచ్చి, వివాహమునకు నిశ్చయించుకొన్న దినము సమీపించినది గనుక, మా యిష్టము చొప్పున నెవరు నడువరో వారు రాజువలన బాధలఁబొందుదురు ప్రాణభీతిగల యట్టివారు దేశమువిడిచి పోవలసినదని ప్రతివీధిని జాటించిరి.

—( వీరకంకణ ధారణము )—

ఇట్లు చాటించిన మాత్రమున, ౧౦౨ గోత్రజులును మేమగ్ని ప్రవేశము చేయుమని యచంచలముగా నిశ్చయించుకొని, దాగిరి. అగ్ని ప్రవేశము చేయవలయునని చెప్పినమాత్రము చేతనే ౧౦౨ గోత్రజులు దాగిరిగదా. ఇఁక నగ్ని ప్రవేశము చేయునప్పు డెందరు దాఁగుదురో యని సందేహించి వీరతాంబూలముల నిప్పింపుమని భాస్కరాచార్యుల నడుగగా, వారు కన్యా శుభకార్యముల యందుఁ దాంబూలము నివ్వవలయు నేనిట్టి కార్యమునకును దాంబూలమివ్వవలసి వచ్చెనే యని చింతించుచు నుండెను. అప్పుడు ధనదుఁడను వైశ్య బాలుఁడు తన భార్యయగు ధనవతీసమేతుఁడై దిగ్గునలేచి సభవారికి నమస్కరించి నవ్వుమొగముతో నగ్ని ప్రవేశమును గురించి తనకును వీర తాంబూలము నిప్పింపుఁడని యడిగెను. మహా బుద్ధిమంతుఁడును గులధర్మ నిర్వాహక శ్రద్ధగలవాఁడును నైన యా బాలునిఁ జూచి, వైశ్యపుంగవులు మిగుల నచ్చెరువడి, యీ బాలునకుఁగల కులోద్ధారకేచ్ఛ పారిపోవ నుద్దేశించిన గోత్రస్థులకు లేకపోయెనని వ్యసనముగలవారై, మహా వివేకముగల యో ధనదుఁడా, నీవు బాలుఁడవు. సంతతి లేనివాఁడవు. ఖ్యాతి కింతియె చాలును. నీవింటికింజని, యీ చాపల్యము విడిచి, సుఖించి యుండవలయునని చెప్పిరి. అందుకు ధనదుఁడయ్యా బిడ్డలు లేనివానికిని సంతతిగలవానికిని బాలునకును వృద్ధునకును గులగోత్రములు మంచినడతలు ప్రాణములును సమానమేగాని, వేఱుగాదు. గనుక వీరకంకణ తాంబూలమిచ్చుట క

నుజ్ఞ దయచేయ వలయునని వేడెను. అందుకు వైశ్యపుంగవులు శిరః కంపము చేసిరి. భాస్కరాచార్యులును "తథాస్తు" అని వీరకంకణతాంబూలముల నీయ నుద్యుక్తుండై వైశ్యులనుజూచి, యో వైశ్యులారా యీ ధనదుఁడు పసివాఁడు. సంతతిలేని వాఁడు- కులగోత్ర సంరక్షణ కొఱకుఁ బ్రాణత్యాగము చేయుచున్నాఁడు, గనుక నీ వైశ్యవర్గములో నందఱు దమతమ పితరులనుగూర్చి దానములు చేయునప్పుడు, తమ కులమభివృద్ధియగుటకై తొలుత నీచిన్నవానిఁ జక్కగా స్మరించి శక్త్యనుసారముగా నితనిపేర దానము చేయవలయునని చెప్పి, యిఁక నందఱును వీర కంకణ తాంబూలములఁ బట్టుఁడని యాజ్ఞాపింపఁగా, వైశ్యులు సంతోషించి కుసుమశ్రేష్ఠిని జూచి మనకన్య యతి సుకుమార శరీరము గల బాలికయై యున్నది. అట్టి శిశు వగ్ని ప్రవేశము చేయుట కెట్లు సమ్మతించును. ఆ సంగతి ముందుగాఁ దెలిసికొని, పిమ్మట మనము వీర కంకణ ధారణము చేయుట యుచితమనియును, ముందుగా మన మాతురపడి ప్రతిజ్ఞచేసి, వెనుక తప్పుటవలన మిక్కిలి పాపము ఘటించును గనుక, నీవుపోయి తెలుసుకొని రమ్మని చెప్పి, వైశ్యులందఱుఁ దమతమ గృహములకుఁ బోయిరి.

{ అగ్ని ప్రవేశమునకు వాసవకన్య యభిప్రాయము నడిగి తెలిసికొనుట. }

కుసుమశ్రేష్ఠియుఁ దనయింటికివచ్చి తత్కాలోచిత కృత్యములను దీర్చుకొని, శయ్యపైఁ గూర్చుండి, మాటిమాటికి నిట్టూర్పులు విడుచుచు, నెంతయాపద సంభవించెనని యాశ్చర్యపడుచుఁ, జిరకాలము బిడ్డలులేక పెక్కు తపంబులొనర్చి కడపట పుత్రకామేష్టి చేసి యీ బిడ్డలఁ గంటిని, కులము- రూపము- యౌవనమును గల వరునకీకన్యనిచ్చి వివాహముచేసి, యమూల్య నవరత్నాద్యనేక వస్తుయుక్తమగు నరణమిచ్చి యత్తింటికి బంపి, మాటిమాటికి నాడుబిడ్డ నల్లునిఁ బిలుచుకొని వచ్చి, బహువిధ బహుమతులఁ జేయుచు, నీలాటివేడుకలను జేసి చూతుముగదా యని యెంచియుంటిని. దైవికముగా నిట్టిమకస్మాద్విపత్తు సంభవించెను. కాఁగలది కాకమానదు. అనియెంతేని

గ్లేశపడుచు సుకుమారురాలును మహా భోగపాత్రురాలును, నగు నీ కన్య నేనేవిధముగా నగ్నిం బడవైతును- కులము నే తెఱుంగున దోష రహితముగాఁ జేతును. హా యీశ్వరా! యని దుఃఖించుచుండెను.

ఈలాగు చింతించుచున్న తండ్రిని బాలికలతోడ నాడుచున్న వాసవ కన్య చూచి, తండ్రియొక్క చింతను దెలుసుకొన్నదై యతని చెంతకుఁజని, చిఱునవ్వు నవ్వుచు నో తండ్రీ నీవేల చింతించుచున్నావు నీ మనస్సునఁ గల కొఱంతలేమో వాని నీపట్టినగు నాతోఁ జెప్పుము. "పుత్రాచ్ఛతగుణం పుత్రీ" యను వాక్యప్రకార మాఁడుబిడ్డలు కులోద్ధారకులు గదా- నీ కొఱతను నాతో సత్యముగాఁ జెప్పుము-అని యడుగఁగాఁ గుసుమశ్రేష్ఠి యాకన్యనుజూచి దుఃఖించుచు గద్గద స్వరముతో నో శుభకరురాలైన కూఁతురా! నామనోవ్యథ నేమని చెప్పుదును. అతికోమలమై. దిరిసెన పూవుతో సమానమైన దేహము గల నిన్ను నాకాశములనంటు కణములుగలిగి మహా జ్వాలలతో బ్రకాశించు నగ్నింబడవైవ వలసి వచ్చెను. నిన్నుఁ జక్కని పురుషునకిచ్చి, వివాహము చేసి, నీ వేడుకలను జూడ నాకుఁ బ్రాప్తిలేక పోయెనుగదా. విధి యీ ప్రకారము నున్నదని పలుదెఱఁగులఁ విలపించు తండ్రినిఁజూచి, మృదూక్తులతో వాసవి యిట్లనియె. ఓ తండ్రీ నీవు మూఢునివలె నేల విచారపడుచున్నావు. ధైర్యము తెచ్చుకొమ్ము- శరీరము నాశము కాఁదగినది- ఆత్మ నాశము కాఁదగినది కాదు. అట్టి నీరుబుగ్గవంటి యీ దేహము కొసమేల వ్యసనపడ వలయును. కులధర్మ స్థాపన నిమిత్తమీ శరీరము నుద్యజించి, యీశ్వరపదవిని బొందియెల్లప్పుడును సుఖింపుము. అనియిట్లు ధీరవాక్కులచేతఁ దండ్రికి హితమును బోధించి, పూర్వము నేను నీకిచ్చిన వరము సంప్రాప్తమగుకాలము ఘటించినది. నాకులోకమందుఁ దలిదండ్రులు బాధువులు స్నేహితులు విరోధులును లేరు. నేను జగన్మాతను నా మాయవలననే నేను నీవు- అనుభ్రాంతి గలుగుచున్నది. అందువలన నేను నీ బిడ్డనని యెంచుచున్నావు. కొన్ని కారణములనుబట్టి నేను నీ వంశమందు బిడ్డనై పుట్టితిని గాని నేను సామాన్యురాలఁ గాను. సాధ్వీ ద్వార్యంశ సంభవు

లను రాక్షసాంశముగల యీ విష్ణువర్ధన భూపాలుని సంహరింపఁ బోవుచున్నానని తండ్రిని సమాధానపఱచెను. కుసుమశ్రేష్ఠియు ర హస్యములగు నీ మాటలను విని, తన పుత్రినిఁజూచి, నీ మాటలనునే నెట్లు విశ్వసింతును- బంధువులతో నేమి చెప్పుదునని సంశయింపఁగా వాసవకన్య చతుర్భుజయై, తాటంకప్రకాశ కపోలయుగళయై, కోటీ ర హార కేయూర మంజీర కంకణా ద్యాభరణ విరాజితయై, స్వర్ణాం బర ధారిణియై, సూర్యచంద్రాగ్నులతో సమానమైన మహాతేజోవతి యై యావిర్భవించి తన నిజస్వరూపమును జూపెను. ఇట్టిరూపమును జూడఁ దండ్రియశక్తుఁడైనందున వతనికి దివ్యదృష్టినిచ్చెను. అంత నా కుసుమశ్రేష్ఠి యద్దేవికి సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి వి వ్యస్తుతులు సమర్పించెను. అనంతరమద్దేవి విష్ణువర్ధనరాజు మరణము- విరూపాక్షుఁడు మొదలుగాఁగల బాలనగరులు కాశికింబోయి యచ ట గయాశ్రాద్ధాదులు జరిపించుట మున్నగు భవిష్యత్కార్యములను దెలిపి సంతృప్తునింజేసి యథాప్రకారము కన్యయై నిలిచెను.

—(వాసవకన్య తనతండ్రితోడ సభకువచ్చుట.)—

అంతఁ గుసుమశ్రేష్ఠి నగరేశ్వర మంటపమునకుఁ బోవ నుద్యు క్తుఁడగుట వాసవకన్య చూచి, నేను నా యగ్నిహోత్రప్రవేశ మాహాత్మ్యమును గురించిన వీరకంకణ ధారణమును జూడవచ్చె దనని తండ్రియొక్క చెఱఁగు పట్టుకొనెను. ఆ వైశ్యపుంగవుండు నా వాసవీ కన్యఁ దనవెంటఁ బిలుచుకొనిపోయి, నగరేశ్వరునకు నచటవ చ్చియుండు వైశ్యముఖ్యులకును బ్రదక్షిణపూర్వకమగు నమస్కారము లను జేసి, కూర్చుండెను. పిదప భాస్కరాచార్యులు వీరకంకణముల ను గట్టుకొని కులధర్మములను బాలింప నగ్నిప్రవేశముచేయ నిష్ట ము గలవారందఱు నాలస్యముచేయక రావలయునని ఘంకామ్రో యించెను.

—(౧౦౨ గోత్రజులు వలాయనులగుట.)—

ఆ ఘోషమును మరుగైయుండిన ౧౦౨ గోత్రములవారగు వై శ్యులు విని, భయాకులితులై మనమిక్కడ నున్నపక్షమున నీ

వర్తమానము విని, యత్యంత రోష సంతప్త మానసుండై విష్ణువర్ధన మహారాజు వచ్చి, మనల నూటయిబ్బందురి గోత్రజులని యెంచి వధించును. మఱియుఁ, గృతయుగమున రేణుకయుఁ ద్రేతాయుగమున జానకియు, ద్వాపర యుగమున ద్రౌపదియు, శక్తిస్వరూపులై పెక్కండ్రకు మృత్యువులైన కరణి, నీ కలియుగమున నివ్వాసవి శక్తియై వైశ్యకులమువారి కందఱకును మృత్యువయ్యె. ఈ కన్య నష్టమైన మన కులగోత్రముల కేమికొఱంత సంభవించును. భాస్కరాచార్యులు చెప్పిన ప్రకారము మనము వెడలిపోకున్న నతఁడు మనలను బహిష్కృతులను జేయును గనుక నవశ్యము దేశాంతరగతుల మగుట మంచిదనిరి. మఱికొందఱు నగరమువారను పేరుగల మనకులమునకును- నీ నగరేశ్వర జనార్దనులకును బ్రాహ్మణులకును- నమస్కారములొనర్చి- స్వేచ్ఛగాఁబోదమనిరి, కొందఱు కులమును- నగరమును- గన్నియను నిందించుచు గములుగట్టి చంచల చిత్తులై, వాడవాడలం దిరుగుచునుండిరి. కొందఱు మనమున యిండ్లంగల పాపలలోఁ జక్కని కన్నియం దెచ్చి, శృంగారించి యా వచ్చిన భటసమూహంబులం గూర్చికొని మహా పరిభవముతో వెళ్ళి, రాజునకిచ్చి, రాజ్యభారంబెల్ల భరింపుదమనిరి. ఇంకఁగొందఱు రాజునకుఁ దెలిపి, సైన్యసాహాయ్యమును బొంది బలాత్కారముగా నా వాసవకన్యను రాజున కిప్పించి, సుఖపడుదమని యోచించి రాజసంబంధులకు రహస్యముగాఁ దెలుపఁగా, వారు వాసవీ మాయావృతులై రాజవివాహమునకు వీరే విఘ్నకారులని యెంచి, మీరిట్టికార్యములను జేయించిన మీకు శిరచ్ఛేదాది శిక్షలు చేయింతుమనిరి. అంత వైశ్యాధము లింక నాలస్యము చేయఁగూడదని కలంగి, భగ్నులై పెదవులు దడుపుచు డగ్గుత్తికలు పెట్టుచు, నశక్తులై పండ్లుగీటుకొనుచు హాయనుచు నక్కటాయనుచు, నాతురపడుచు దైవంబుల దూఱుచు, నిలువక పాఱుచు పాఱిపాఱి మగుడుచు, దమదమవారలం బిలుచుచు, నక్కడక్కడ నిలుచుచు, శివశివా యింత చేయఁదగునే యనుచుఁ, దత్తరించుచు భయభ్రాంతులై యొకళ్ళొకళ్ళ నమ్మక తల్లడిల్లి, యుల్లంబు ఝల్లుమన ఢిల్లపడి, స

ముద్రమువలె నల్లోలకల్లోలమై తల్లిబిడ్డల దిగవిడిచి, యొకళ్లొకళ్లఁద్దలకడచి, తమతమ నెలవుల వెదకికొని పాఱిపాఱి ముందు వెనుక గానక చీకాకుపడి, చీఁకట్ల మునింగి సుడివడి మూర్ఛలంజెంది కాలుగాల్లనం బెనఁచికొనిపడి, యొకింతదడవునకుఁ దెప్పిరిలి లేచి, దిక్కులను విమర్శించి స్థూలశరీరములను గదిల్చికొనలేక తోఁటలవెంబడింబడి యీరంబులు దూరువారును మగిడి పరతెంచి యిండ్లనున్న భార్యాశిశువులం గూర్చుకొని ముందర నడిపించుచు వెనుకబలముఁకలై పదిలపఱచి, శౌర్యంబులు వాటించుచు దుష్టచతుష్టయంబునుం బోలెడు ఖలులంగూడి నడచువారును గూఢవృత్తి నెఱుంగఁజేయక మెల్లమెల్ల నడచు వారలఁగూర్చుకొని ఒరుగు వారును నైపురంబువిడిచి. బహువిధ మార్గంబులం బోయిరి.

అట్లుపోయిన వారిలో ౮౦ గోత్రములవారు తురాషులను పేరువహించి తూర్పుదిక్కునకును ౨౦౦ గోత్రజులు గోపలను పేరుచేత దక్షిణ దిక్కును గూర్చియు ౧౩౮ గోత్రజులు దరదులను నామాంతరము గలిగి యుత్తర దిక్కును గూర్చియుఁ బోయిరి. ౧౮౬ గోత్రజులు క్రమలను పేరఁబెట్టకొలి దారాపుత్రాది సహితులై ఖిన్నవాణులై యంధకారములోను- సంకుచిత మార్గములోను నుండిరి. ౧౨గోత్రాలో ద్భవులు దారాపుత్రాది సహితులై ప్రాణభీతిచేత విదేశములకుఁబోయిరి. తక్కిన ౧౦౨ గోత్రజులగు వైశ్యశిఖామణులు ధీరులును- ధర్మవర్తనులును- యశోధనులును_ నాచారగరిష్ఠులును- శూరులును-సత్యసంధులును- ప్రతిజ్ఞతప్పనివారును- మహాత్ములును- స్వధర్మాభిమానులును_ నై నేనుముందు నేనుముందని గుండమును ప్రవేశించుటకు సిద్ధులై తేపువివాహ మహోత్సవము జరుగంగలదని పట్టణమంతయుఁ జాటించి డంకా మ్రోయింపుమని యాజ్ఞాపించి వీరకంకణములు కట్టవలయునని కోరిరి.

{ వాసవకన్య తన స్వస్వరూపమును సభ్యులకు జూపి, మాతులకన్యావివాహాది ధర్మములనుబోధించుట. }

అంత భాస్కరాచార్యులు కుసుమశ్రేష్ఠిం జూచి, యోయి సీ

క్షిద్ధ యభిప్రాయ మడిగి తెలుసుకొంటివేని యీ వర్తమానమును వీరి తోఁ జెప్పుము- ఆలస్యము చేయవలదని చెప్పఁగా, నా కుసుమ శ్రేష్ఠి తన కూఁతు ముఖమును జూచుచు నిలిచెను. అంత నా కన్నియ యధిక దివ్యతేజోమయురాలై విజృంభించినందున నా వైశ్యులాయ మఁజూడనేరకులై, స్తంభీభూతులై యుండిరి. అప్పుడద్దేవి యా వైశ్యులకు దివ్యదృష్టినిచ్చిన వారు నద్దేవికి నమస్కరించి, యనేక ప్రకారంబుల స్తుతియించి యంజలి బద్ధులైయుండ నా వైశ్యులంజూచి యాదేవి నా భక్తులలో నధిక శ్రేష్ఠత్వమును వహించిన యో వైశ్యులారా యగ్నిప్రవేశము చేయుటకు భయపడవలదు. మీరు సూర్య చంద్రులుండు పర్యంతము శాశ్వతముగు కీర్తిని వహింపఁగలరు. తొల్లికృత యుగమందు మహారథి కుఁడైన సురథుఁడను రాజును, సమాధియగు వైశ్యుఁడును నిరాహారులై నన్నుంగూర్చి ఘోరతపస్సుఁ జేసిరి. అం త సురథుఁడు నా యనుగ్రహమును బొంది, యిప్పటికిని శాశ్వతమైన స్వర్గమునందు సావర్ణిక మనువై సుఖంబున నివసించియున్నాఁడు. అప్పుడు సమాధింజూచి యోరీ నీవేమి వరంబువేఁడెదవని నే నడుగఁగా నా సమాధి యను వాఁడు నన్నుంజూచి, యోతల్లీ, పుణ్యపరిపాకమైన వెనుక మరల నీ కర్మభూమిని జెందవలయును. గాన నట్టి యశాశ్వతమైన స్వర్గపదము నాకువలదు. బ్రాహ్మణుఁడు బ్రహ్మతో సమానుఁడని వేదము ప్రతి పాదించుచున్నది. గనుక నట్టి బ్రాహ్మణత్వమును నాకు కృపచేసి, పితృవంశస్థులగు ౨౮ గోత్రజులు- మాతృవంశస్థులగు ౨౦ గోత్రజులు- మామగారి వంశస్థులగు ౧౨ గోత్రములవారు- చెల్లెలి వంశస్థులగు ౧౬ గోత్రములవారు కూఁతువంశస్థులు ౧౧ గోత్రములవారు- మేనత్త వంశజులు ౧౦ గోత్రములవారు- తల్లిచెల్లెలి వంశస్థులు ౮ గోత్రములవారు- ఇట్లు ౧౦౧ గోత్రజులైన మావారితోడ నాకు బ్రహ్మసాయుజ్యము గలుగునట్లు వరమిమ్మని వేఁడఁగా నేను మిక్కిలి సంతోషించి యతనిఁజూచి, యో సమాధీ నీవు వేఁడిన ప్రకారము జన్మాంతరమందు నేను నీ కులమందుఁ బుట్టి నీకును నీ బంధువులకును బ్రహ్మభావము నిచ్చెదనని చెప్పితిని. అట్లేసమాధియనువాఁడుతన బం

ధుప్రులతోఁడఁ గుసుమశ్రేష్ఠిగాఁ బుట్టెను. నేను నీ వాసవాంబగా జనించితి. కావున మీరు జడియక యగ్నిప్రవేశము చేయుండనియును, చిత్రకంఠుండను గంధర్వుఁడు విష్ణువర్ధన రాజుగా నీ భూమండలమందుఁ బ్రసిద్ధికెక్కియున్నాఁడు. వాఁడును నాచేత మృత్యుఁడై గంధర్వలోకమును బొందుచున్నాఁడనియును జెప్పెను.

మఱియు నికను భూలోకమందు గాలవ్యత్యయము సంభవించుచున్నది. గనుక మీరును - బ్రహ్మక్షత్రియులును ఇదివఱకు వేదోక్తవిధుల ననుసరించి శుభములను జరిపించుచు వచ్చినట్లుగాక యిఁకమీఁద మీరు సాలంకాయనమునివిధించిన ప్రకారము భాస్కరాచార్యులమూలముగా యావత్క్రియలుపురాణోక్తములుగా జరిపించుకొనవలయును భ్రష్ఠులైన ౬౧౨ గోత్రజులతో సంబంధమును భోజన ప్రతిభోజనములును జేయఁగూడదు. కాదనిచేసిన బ్రహ్మలోక గతులైన మీరును బతితులగుదురు. కన్యను యెంతమాత్రము రాజునకివ్వవలదు. బలవంతముగా నిచ్చినపక్షమున మీరును నారాజును సాంకర్యమును బొందుదురు. గనుక భయమునువిడి యగ్నిప్రవేశము చేయుండని చెప్పెను.

ఈ వాక్యములను వైశ్యబాలురువిని, ౧౦౨ గోత్రములును బ్రాకృతములై గర్భాదానము మొదలుగాఁగల కర్మములను, పౌరాణిక మంత్రరూపములగు గాయత్రియును, పురాణోక్తముగా జరిపించుకొనునట్లే మహాదేవి యాజ్ఞాపించుచున్నది. వేదోక్తముగా గర్మలను జరిపించుకొనుచు వచ్చిన మేము పురాణోక్త కర్మాచరణులై యెట్లు భూమిని వర్తింపఁగలమని చింతింపఁగా, వైశ్యపుంగవులు వారింజూచి, బ్రహ్మాంశసంభూతుఁడగు నీ భాస్కరాచార్యులు సాలంకాయన సూత్రప్రకారము వేద మంత్రార్థములను సంగ్రహించి గర్భాదానాది క్రియలను సద్వర్షిగణ సమ్మతముగా జరిపించును. అందునలన మీకు నుత్తమ లోకములు ప్రాప్తములగును. ఇఁక దీనిఁగూర్చి చింతింప వలదనిరి. అంత నాదేవి సంసారమం దభిమానమునువిడిచి యాలస్యముచేయక, శీఘ్రముగా నగ్నిప్రవేశముచేసి, యంతరిక్షమందు మీకై వచ్చి కాచియుండెడు దేవ విమానములను నెక్కి ముక్తిపదమును బొందుఁడని యానతిచ్చి

వైశ్యబాలురకు నాచంద్రార్కాభివృద్ధి గలుగునట్లు దీవెనలొసంగి యంతర్ధాన మాయెను.

పిమ్మట, సద్గుణసంపన్నులై ప్రకాశించుచున్న యా వైశ్యశిఖామణులు, పుత్రమిత్రకళత్ర సమేతులై తమప్రాణములను రక్షించుకొనుటకుగాను దేశాంతరగతులైన ౧౦౨ గోత్రములవారినిద్రక్షించుచుఁ, దమబాలురనుజూచి- ఓబాలులారా, కామాంధకారాములకు హేతుభూతమైన ధనలోభముచేతనైనను, గర్వముచేతనైనను బరిష్కృతులైన,యాక్రమగోపాదులతో మీరుసంబంధముచేసి,భోజనపఙ్క్తిభోజనములు జరిపించినయెడల,బ్రహ్మహత్య-సురాపానముగోవధయు మొదలుగాఁగల పాతకములను జేసినవారివలెనే నరకమును బొందుదురు. అట్టివారిని కులములోనుండి బహిష్కారము చేయఁదగును. వారివంశము నశించును. ఈమాయాజ్ఞ నుల్లంఘన చేయువారును. ౧౦౨ గోత్రజులవలె దారిద్ర్య పీడితులై రౌరవంబునంబడియెదరని వక్కాణించిరి.

మరియు నావైశ్యవరేణ్యులు, తమబిడ్డలయందుఁ బుత్రవాత్సల్యతచేత ధన కనక వస్తువాహన విద్యావినయసంపన్నులై,వ్యాధిపీడితులుగాక,చిరాయువులుగా నుండుమని మంగళాశాసనములు చేసి పూర్వముకులవృద్ధులైన మన పితామహులు కైలాసవాసము చేయుచుండఁగాఁ. గిరికన్యనిమిత్తము మాండవ్యముని విధించిన విధిని శిరసావహించి, మాతులకన్యా వివాహము ననుసరించుచు వచ్చిరి. అట్టి వివాహమునే ప్రస్తుతము దీదేవియు విధించెను. గాన, నట్టి వివాహమును మీరు తప్పక యనుష్ఠింపవలయును. అందుఁగూర్చిన వివరణములు మీకుఁదెలియుటకొఱకుఁ జెప్పుచున్నాము. ఎట్లనఁగా:—



## మాతులకన్యావివాహ నిర్ణయము.

ఉపోద్ఘాతము.

మాతులుండనఁగా మేనమామ. అతనికొమార్తె నతని సోదరి కుమారుఁడు వివాహముచేసికొనుట మాతులధర్మము- అనఁగా మేన రికంబగు.

ప్రమాణము- మాతులశ్చేతివిఖ్యాతో మాతుశ్చైవ సహోదరః । మాతులస్య సుతోద్వాహే మాతులంధర్మముచ్యతే ॥

వైశ్యులలో భగినీపుత్రులకు భ్రాతృపుత్రికలనిచ్చివివాహము చేయుట ప్రశస్తము. ఇది వృద్ధాచారము. ఈ దప్పక నాచరించు వాఁడు సర్వోత్కృష్టుఁడగును.

ప్ర- వైశ్యానాం భాగినేయేషు పుత్రీదానం ప్రశస్యతే। వృద్ధాచరిత మాచార మేవంకుర్వన్మహీయతే ॥

---

విధులు.

౧—— మేనమామకుఁ గూఁతురు గలిగినదిమొదలు మేనల్లునికి వరపూజ జరిపింప వలయును.

ప్ర- మాతులస్య యధాపుత్రీ జాయతేసుముహూర్తకే। భాగినేయం సమభ్యర్చ్యే త్తదాప్రభృతి మాతులః ॥

౨—— ఏకాక్షి- కుష్ఠురోగి- పాదరోగి- అఖండితుఁడు- ఛిద్రోష్ఠుఁడు- పెద్దపిఱ్ఱగలవాఁడు- వక్రనాసుఁడు- వికటుఁడు- మూఖుఁడు- దరిద్రుఁడు- వ్యత్యస్తమైన నడతగలవాఁడు- మెల్లకంటివాఁడు- మరుద్రోగి- వణుకుతలగలవాఁడు- అప్పులకాపు- త్యాగి- సదాకోపి- తిండిపోతు- కోఁతిమూతిగలవాఁడు- ఒంటిచేతివాఁడు- ఒంటికాలివాఁడు- చెవిటివాఁడు- పీనసరోగి- వేశ్యాసక్తుఁడు- మందుఁడు- దూరదేశస్థుఁడు- ఏకపుత్రుఁడు- తల్లిదండ్రులులేనివాఁడు- కుంటికాలివాఁడు- బుద్ధిహీనుఁడు- దుర్గుణుఁడు- దుర్బలుఁడు- పౌరుషహీనుఁడు- కొండెముచెప్పువాఁడు- జూదరి- విటుఁడు- రాజసేవకుఁడు- అసాందర్భ్యవంతుఁడు- స్వల్పరోగి- పొట్టివాఁడు- పొడుగాటివాఁడు- కృశించినవాఁడు- ఇట్టివారైనన్ను గన్యాదానమున కర్హులుగారు.

ప్ర— ప్రకాశో గుల్మరోగీచ పాదరోగోఽప్యసంశ్రితః । ఛిద్రోష్ఠ స్సగు ప్తోఽపి వక్రనాశో వికర్ణకః ॥ మూర్ఖో దరిద్రసంయుక్తో హ్యత్యంతగమనో శివా । తిర్యగ్దృష్టి మహద్రోగీ సదాకపిశ్లేష్మవాన్ ॥ ఋణీ త్యాగీ సదాకోపీ బహుభోజీ మహాహనుః । ఏకపా స్త్వేకచరణో బధిరో వాపి పీనసః ॥ వేశ్యాసక్తోఽపి మన్దోవా దూరస్థోఽప్యేకపుత్రకః । మాతాపితృవిహీనోవా వక్రీభూతకదోఽపిహ । బుద్ధిహీనో దుర్గుణోవా దుష్టో భ్రాతృవర్జితః ॥ పిశునో ద్యూతకారీవా కాముకో రాజసేవకః ॥ అసౌన్దర్య స్స్వల్పరోగీవా స్యా ద్దీర్ఘతనుకృశః । జామాతా భగినీపుత్రో నాత్రకార్యా విచారణా ॥

3- భ్రాతలును భగినులును- వసేకులుగానుండు పక్షమున భ్రాతృపుత్రికలను భగినీపుత్రులకు క్రమముతప్పక (అనగా జ్యేష్ఠ భ్రాతృసుతను జ్యేష్ఠభగినీసుతునికి, కనిష్ఠ భ్రాతృసుతను కనిష్ఠభగినీ సుతునికి) నిచ్చి వివాహముచేయవలయు అట్లుచేయువా రీలోకమున శ్రీమంతులై యుందురనుటకు సందియములేదు.

ప్ర- భ్రాతౄణాంతుబహుత్వేతు భగినీనాంతథైవచ । క్రమేణ భ్రాతృజాతానాం కన్యానాం వైశ్యసత్తమ ॥ భగినీనాంచతనయాః వ తయశ్చ యథాక్రమమ్ । జ్యేష్ఠ భ్రాతృ సుతాయాశ్చ జ్యేష్ఠాయా భగినీసుతః ॥ పతిఃకనిష్ఠభ్రాతుశ్చ సుతాయా స్తత్స్వసుస్సుతః । ఏవంక్రమేణ చాన్యేషాం భ్రాతౄణాం, భగినీసుతాః ॥ స్వక్షేయామాతులానాంతు కన్యానాం పాణిపీడనమ్ । కుర్వన్తో శ్రీమన్తో భవిష్యన్తి నసంశయః ॥

౪— పై నిబంధనకు వయసు ప్రతిబంధకమయ్యేని, భాగినేయులలో వయస్సు సరిపడ్డవాని కిచ్చి వివాహము చేయవచ్చును.

ప్ర— వయో ధర్మవిశేషేతు క్రమ ఏవవిధీయతే । జ్యేష్ఠస్యతనయా జ్యేష్ఠావయసాచ సుతస్స్వసుః ॥ కనిష్ఠో యదితత్త్రైవం నాత్సుతో చ కనిష్ఠయోః । కనిష్ఠభ్రాతృజాకన్యాః తూ జ్యేష్ఠాయదిస్వసుః ॥ జ్యేష్ఠయా స్తనయం జ్యేష్ఠం వయసా సమ్యగుద్వహేత్ । వయోధర్మవిశేషేణ జ్యేష్ఠో జ్యేష్ఠ కుమారికామ్ ॥ కనిష్ఠభ్రాతృజాంకన్యాం జ్యేష్ఠా

యా జ్యేష్ఠ ఏవచ। వయో జ్యేష్ఠస్సుతశ్చైవం కనిష్ఠాయాస్తతస్సుత॥ ఏవంవయోవిశేషేతు వినిగమ్యేత్సుతాంసుతమ్॥

౫. భ్రాతలలోఁ గొందఱికి నాఁడుబిడ్డలుండి, కొందఱికి లేనియెడమునఁ, గలిగినవారు లేనివారి వంతునకువచ్చిన భాగినేయులకుఁ గన్యలనీయ్య వచ్చును. తక్కిన భాగినేయులు లౌకికావునవివాహము చేసికొనవచ్చును.

ప్ర - క్రమేణభాగినేయానాం దాతవ్యాస్స్వసుతాక్రమాత్॥ స్వస్వభాగక్రమేణైవ వృణీధ్వం భాగినేయకాః। అసుతా భ్రాతరః కేచిత్సుతా భ్రాతరోపరే। అసుత భ్రాతృణాం భాగ స్స్వవశిష్టకుమారిభిః॥ పరిపాల్య సధాభక్త్యా శిష్టాస్త్వన్యత్రయోజయేత్। భ్రాతృణాంతుబహుత్వేతు ఏకస్యైవ సుతాయది॥ సర్వేషాంభాగినేయానాం దత్వా సిద్ధిమవాప్నుయాత్॥

౬. మేనల్లునికిఁ గన్యనిచ్చుచోఁ తిథి నక్షత్ర రాశ్యాది దోషములను నశుభావర్తదోషములను జేసినశకునములు గలదోషములను గుందేలు- పిల్లి- సర్పము- మొదలైనవాని గతిచేఁ గలుగు నపశకునముల నుభయులకును, బాధకమని యోచింపబనిలేదు.

ప్ర- తిథి నక్షత్ర రాశ్యాది దోషాన్నైవ విచిన్తయేత్। అశుభావర్తదోషంచ మిళితభ్రాతృమానసే॥ శశ మార్జాల సర్పాదినుర్నిమిత్త ప్రదర్శనమ్। భాగినేయాయ కన్యాయాందాతవ్యాయాన్నచిన్తయేత్॥ తస్యాంమాతులకన్యాయాం నేతాః దోషాన్నచిన్తయేత్। రాశి నక్షత్ర దోషాదీ నుభయత్ర నచిన్తయేత్॥

౭. మేనమామభార్య గర్భిణియైన యెడల, ప్రసూత్యాంతమువఱకు మేనల్లుఁడు వివాహముచేసికొనక కాచియుండవలయును. అట్లుఁగాచియుండిపుత్రుఁ డుపుట్టినయెడల, లౌకికావున వివాహము చేసికొనవచ్చును.

ప్ర— శృణుధ్వం బాలకాస్సర్వే మాతులీయది గర్భిణీ। తత్ప్రసూతేశ్చపర్యన్తం భాగినేయాః ప్రతీక్షేత్॥ మాతులస్యాసుపుత్రీవివాహం కర్తుముద్యతః। తదామాతులజాయాచే ద్గర్భిణీ చేన

యోగతః ॥ పుత్రోవా కన్యకా వేతి ప్రసవాన్తం సమీక్ష్యత । తతో వివాహః కర్తవ్య స్సర్వత్ర జనసమ్మతిః ॥

నిషేధవిధి

౮. పుటంధుఁడు - పాపి - క్రూరుడు - పంగు - మూఁగ - చిత్తభ్రమఁగలవాఁడు - కుష్ఠురోగి - మూర్ఛరోగి - పెద్దరోగముగలవాఁడు - నపుంసకుఁడని పేరుబడినవాఁడు - మరుగుజ్జువాఁడు - విరూపి - మద్యపాని - మాంసమునువిక్రయించువాఁడు - శూద్రాన్నమునుభుజించువాఁడు - కులభ్రష్టుఁడు - జీర్ణదేహుఁడు - వృద్ధుఁడు - సారాయి నమ్మువాఁడు - పెండ్లాముండియు మఱలఁబెండ్లియాడఁగోరువాఁడు ఇట్టివారు కన్యాదానార్హులుగారు.

ప్ర — జాత్యన్ధః పాతకీ క్రూరో పఙ్గుర్మూకో భ్రమాన్వితః । కుష్ఠో మూర్ఛీ రాజరోగీ షణ్డః కుబ్జో విరూపభృత్ ॥ మద్యపో మాంసవిక్రీతాక్యచిచ్ఛూద్రాన్నభోజనః । కులభ్రష్టో జీర్ణదేహో వృద్ధో వా మద్యవిక్రయః ॥ జీవద్భార్యో వివాహేచ్ఛు రయోగ్యాదానకర్మణి ॥

౯. — * అల్లునియొక్కయుఁ బుత్రికయొక్కయుఁ మేనమామలగోత్రములు సమానములైన, వివాహము చేయరాదు.

ప్ర — జామాతుఃకన్యకాయాశ్చ మాతులా వేకగోత్రిణౌ । యదిస్యాతాం నకుర్యాద్ది తయోరుపయమం బుధాః ॥

విశేష విధి.

౧౦. — మేనల్లునికి భార్యయుండి పుత్రులు లేకున్నను, భార్యగతించినను, మేనమామ ప్రీతిచే మఱల వానికిఁ దన కన్యనిచ్చి వివాహముచేయుట ప్రశస్తము. ఈవిధిననుసరించి దయచే ధర్మార్థము మేనమామ కన్యనిచ్చినపక్షమందుఁ మేనల్లుఁడువివాహము చేసికొనవచ్చును.

ప్ర — సభార్యో భాగినేయోవై పుత్రహీనో భవేద్యది । అభార్యోవాపి తస్మైచ ప్రీత్యా దానం ప్రశస్యతే ॥ సమ్మతేనతుతత్పార్శ్వం వినాశా స్త్రీణ బాలకాః । సభార్యః పుత్రహీనశ్చ కుర్యాత్ప

* ఈవిధిలాతిరీతివివాహములలోఁ బ్రశస్తము.

శ్రీగురుం శుభమ్.

## కన్యా విషయిక విధి.

౧౧.- మేనమామకూఁతురు - విరూపి - భయంకరస్వరూపి - మిగులస్థూలదేహముగలది - మిక్కిలి కృశించినది - పొడుగునాలుకఁగలది - పెద్దపెదవిగలది - మిగులనిడుదలగు కన్నులుగలది - ఏకాక్షి - పండ్లులేనిది - చెవిటిది - జొత్తుసి వెండ్రుకలుగలది - పుట్టంధురాలు - కాలులేనిది - లింగిపోతు - చిత్తభ్రమగలది - ఇట్టి విరూపములతోఁ గూడినదైనను, - దానివిడిచి లాతిచోట వివాహము చేసికొనఁగూడదు.

ప్ర -- నాపి మాతులకన్యాచ విరూపా భ్రూరదారుణా। అతిస్థూలా హ్యతికృశా దీర్ఘజిహ్వోష్ఠలోచనా॥ ఏకాక్షీ భిన్నదన్తోవా బధిరా తామ్రకేశినీ। జాత్యన్ధా పాదహీనావా బహుభోజీ భ్రమాన్వితా॥ ఏవం విరూపయుక్తావా యాచ మాతులకన్యకా। తాముత్సృజ్యనాన్యత్ర వివాహో విధిచోదితః॥

౧౨. * సమానప్రవరగల కన్యను వివాహము చేసికొనరాదు. చేసికొనినపిదప సమానప్రవరగలదియని తెలిసినపక్షమున నాచిన్నదానిఁ దల్లివలె భావింపవలయును.

ప్ర -- ఏకప్రవరజాం కన్యాం జ్ఞానతః పరివర్జయేత్। అజ్ఞానాదుద్వాహితాస్యపి మాతృవత్పరిపాలయేత్॥

## దత్తపుత్రుని మేనరిక విధి

౧౩. భగినియొక్క దత్తపుత్రుఁడామెకు సగోత్రుఁడయ్యేనేని, వానికి దనకూఁతునిచ్చి వివాహము చేయవలయును. ఆదత్తపుత్రుఁ డన్యగోత్రుఁడయ్యేనేని కన్యనివ్వవలెనని నిర్బంధము లేదు.

ప్ర -- భగినీ దత్తపుత్రస్య స్వగోత్రస్యపవిత్రతః। స్వసుతాభక్తితో దేయా నాన్యథాకర్తుమర్హథ॥ అన్యగోత్రస్య దత్తస్య నదేయా మాతులీసుతా। యదిదేయా శాస్త్రహా నిర్నభవేత్తత్ర బాలకా॥

## చవితి పుత్రుని మేనరిక విధి.

౧౪. ఇష్టముండినచోఁ బీజధర్మమునుబట్టి, తనసోదరి చవితికు

* [illegible]

మానుఁకుఁదక్షిణఁ ఁయునిచ్చి వివాహము చేయవచ్చును.

శ్లో -- నాశక్తిర్మాతృజాపుత్రం తత్రైవాతీవభక్తితః । బీజధర్మమను స్మృత్య దద్యాత్కన్యాం విశోత్తమ ॥ కన్యాహి భగినీస్వస్య తద్భర్తా నాన్య వివాహితా । తస్యాగపుత్రోऽపి జామాతా ప్రీత్యా దత్తాతు గృహ్యతామ్

ఫలశ్రుతి.

భూమియం దీమాతులధర్మమును భయభక్తులతోఁ బాలించువా రలీలోకమునఁ బుత్రపౌత్రులతోడ భోగముల ననుభవించి చిరకాలము దేవేంద్రలోకమున నుందురు. ధరణియందు మాతులకన్యా పాణిగ్రహణ ము చేయువారలు సకల జనసమ్మతులై యొప్పుదురు. మనకులమున నామాతులధర్మము నతిక్రమించువారలనేక బ్రహ్మహత్యాది దోషము లఁ బొందుదురు.

శ్లో॥ యేమాతులంగధర్మమిదంధరణ్యాంభయేన భక్త్యాపరిపాలయన్తి భుక్త్వేహ భోగాన్ సపుత్రపౌత్రశ్చిరాయుతిష్ఠన్తి సురేంద్రలోకే వైశ్యో విఖ్యాతి. భువి మాతులకన్యకాయాగ పాణిగ్రహే ప్రథిత సర్వజనాను రక్తః । యేస్వత్కులే ప్రతిదధాతి నధర్మమేత త్తేప్రాప్నువన్తి బహువి ప్రవధాది దోషమ్ ॥

రాగ - లోభ - రాజబలాత్కార - మత్సరములవలన నీధర్మము ను విడిచి వర్తించు - మూఢబుద్ధులు వైశ్యవంశపరిభ్రష్టులై నశింతురు. ధార్మికులగు వైశ్యోత్తము లట్టివారిని బహిష్కరించి కులభ్రష్టులఁగావింతు రు. ఈధర్మము విడుచువారలు నిక్కముగ నరకమునఁబడుదురు. ఈలో కమున దరిద్రులై పుత్రసహితముగ భ్రష్టులై తిరుగుదురు.

శ్లో. రాగాల్లోభాచ్చరాజ్ఞాంచ బలాత్కారాచ్చమత్సరాత్ । యేధ ర్మమేతత్త్యక్త్వాప్రవర్తన్తే మూఢబుద్ధయః ॥ తేనాశ ముపగచ్ఛన్తుగ్రశ్రే ష్ఠా వణిగన్వయే । సద్వైశ్యాస్తాన్పరిత్యజ్య బహిఃకుర్వన్తు ధార్మికాః ॥ త్యక్త్వాతుమాతులంధర్మం పతన్తి నరకేధృవం । ఇహలోకే దరిద్రాస్యు ర్భ్రశ్యచ్చ సుతైస్సహ

శ్రీకన్యకాపరమేశ్వరీ దేవిచే నుపదేశరూపముగాఁ జెప్పఁబడిన యీ మాతుల ధర్మమును విడిచి బాహ్యులుగాఁ జేయువారును, చే

యించువాఁడును, నిజగర్భముచేఁబొట్టపగిలిచచ్చు కర్కాటకంపగిది న
శింతురు.

ప్ర. ఇదంయోమాతులం ధర్మం దేవ్యాప్రోక్తంతు దుష్టధీః। అన్యథాకర్తుమారబ్ధ స్తంచాశ్యనుకరోతియః॥ వినశ్యేతాం స్వగర్భే ణా కర్కటీవ నసంశయః॥

ఈ మాతులధర్మము నతిక్రమించు పురుషుని సంతతినశించును. ఆమనుజుఁడు తత్క్షణంబున చండాలత్వమును బొందును.

ప్ర. ఇదంచ మాతులంధర్మమతిక్రమతి యఃపుమాన్। సంవత్తిర్నా శమాప్నోతి సద్యశ్చణ్డాలతాంవ్రజేత్॥

మాతులకన్యా వివాహనిర్ణయము.

సంపూర్ణము.

---

సాలంకాయనముని ప్రత్యక్షమగుట.

ఇట్లు మాతులకన్యా వివాహధర్మమును దెలియఁజెప్పి సంతుష్టమానసులై యంత్యోత్తమైన స్నానమాచరించి తద్యోగ్యాంబరానులేపన మాల్య భూషణ ధారణులై శ్రీవింధ్యవాసినీ సమేత నగరేశ్వరస్వామిని శ్రీకోనకమలసమేత జనార్దనస్వామిని దమయిష్టార్థసిద్ధియగునట్లు పూజించి, తత్ప్రీతి యగుదానములనాచరించి, గురుపూజచేసి మీఁదజరుగవలయు దానింగూర్చి తెలుపుమని గురువులగు భాస్కరాచార్యుల నడుగఁగా, నాతండు వైశ్యులనుజూచి, యెవఁడు బ్రాహ్మణుల యాజ్ఞవడసి యగ్నిజలప్రదేశములచేతఁ గాని ప్రాయోపవేశముచేతఁగాని, పర్వతపు శిఖరముమీఁదనుండి క్రిందపడుటచేతఁగాని తనదేహమునువిడుచునో వానికిఁ బుణ్యలోకముగలుగునని చెప్పి కొంతదడవు ధ్యానింపఁగా శిష్యసమేతుఁడైన సాలంకాయనముని ప్రత్యక్షమాయెను వారినిజూచి యావైశ్యులు సాష్టాంగ దండప్రణామము లాచరించి, యుచితాసనమునఁగూర్చుండఁబెట్టి యర్ఘ్యపాద్యాదులొసంగియంజలిబద్ధులై విష్ణువర్ధనరాజువలన నీదుష్టకార్యము సంప్రాప్తమైనందున దేహత్యాగము చేయునట్లుగా నిశ్చయించుకొనియున్నాము. ఇంతలో మా భాగ్య

వశమున మీరు దిర్యంతము నుండెదరు. గాన మేము కృతార్థులమైతిమని విన్నవిం చిరి. అంత నా సాలంకాయన ఋషీశ్వరుఁడా వైశ్యసింహులను జూచి, మీరగ్నిప్రవేశము చేసిన మీగోత్రములు నిష్కల్మషములగును, గాన మీరు పురాణోక్తకర్మములు నడుపుటకు అర్హులయ్యెదరని మునీశ్వరునివలన వి నంపఁబడియున్నది. క్షీరసముద్రమునుండి యమృతవిషములు భేదింపఁబ డినరీతిగా. వైశ్యకులములో మీరు ౧౦౨ గోత్రములవారు పరిశుద్ధుల రైరి, రాథంతరకల్పమునందు బ్రహ్మయాగపురుషునుండి పుట్టినవారై, వై వస్వతమన్వంతరంబున నగరల గోకర్ణసంభవులైన వైశ్యవంశ సంభూతు లలో మీరలు సాత్వికాంశము గలవారలు. భ్రష్టులైన ౬౧౨ గోత్ర ములును దామసాంశము గలవారు. వారు మధు మాంస భక్షకులయ్యె ను, వేదోక్తాచారము గలవారమనియుఁ దామే వైశ్యులమనియుఁ జె ప్పుకొందురు. ఆకారణమునుబట్టి మీగోత్రములు ప్రాకృతనామములు గలవియగును. మీకర్మలు పురాణోక్తములగును. కీర్తికన్యావివాహము నకై మును నందికేశ్వరుడు విధించినప్రకారము భాస్కరాచార్యులిది మొదలు వివాహాదికృత్యములను జరిపించుగాక, దానికి వ్యతిరిక్తముగా జరిపింపక పరిశుద్ధులరై, యీశ్వరపదవిని బొందుఁడని యనుగ్రహించె ను. అంత వైశ్యులామునియాజ్ఞను శిరసావహించి, ప్రాకృతగోత్రములఁ దె లియఁజేయుమని యడుగఁగా, సాలంకాయనముని యిట్లనియె. వైశ్యు లారా, ప్రాకృతగోత్రములలో ద్వ్యర్షేయగోత్రములు పదియారు-త్ర్యా ర్షేయగోత్రము లేదు- చతురార్షేయగోత్రమొకటి దశార్షేయగోత్రమొ కటి - ఏకార్షేయగోత్రములు డెబ్బదియేడును గూడ * ౧౦౨ గోత్ర ములయ్యె.

ఈ ౧౦౨ గోత్రములును, బూర్వము బ్రహ్మదేవునివలన ననుగ్ర హింపఁబడిన ప్రకార మిప్పుడు పరిశుద్ధములు కాఁబోవుచున్నవి. ఆగో త్రములలో ప్రవరలననుసరించి, మీరు సంబంధాసంబంధములను జేయ యుఁగాని, వేఱుకితరగాఁ జేయఁగూడదని మునినాథుఁ డానతిచ్చిన వైశ్యులు ప్రాంజలులై, యీ ౧౦౨ గోత్రములకుఁ బ్రాకృతగోత్రముల

* గోత్రప్రవరను జూచిన నీనివరము చక్కఁగాఁ దెలియును.

ను నామమునచ్చిన కారణమును మాకు దెలియఁజేయుమని వేఁడఁగా, మునిపుంగవుఁ డాసంగతి యనావశ్యమైనదైనను, మీరడిగినందున. నా కారణమును విశదముగాఁ దెలియజేయుచున్నాను సావధానులరై వినుండని యిట్లనియె.

ప్రాకృత గోత్రములగుటకు మూలము.

తొల్లి గోదావరీతీరమందు లోకగురువగు బ్రహ్మ యశ్వమేధక్రతువును జేయుచుండఁగా నచటికి బ్రహ్మక్షత్రియవైశ్యులువచ్చియుండిరి. బ్రహ్మ వారినిజూచి మీలోనెన్నెసి గోత్రములవారు వచ్చియున్నారని యడుగఁగా, బ్రాహ్మణశ్రేష్ఠుఁడగు దూర్వాసమహామునీశ్వరుడు ౧౮ గణములుగల ౧౦౯ గోత్రజులగు బ్రాహ్మణులందఱము వచ్చియున్నామనెను. ధనంజయుఁడనుక్షత్రియుఁ డేకగణముగల యేడు గోత్రములయందుఁ బుట్టిన రాజులందరము వచ్చియున్నారమని చెప్పెను. సమాధి యను వైశ్యుఁడు ౭౧౪ - గోత్రజులగు వైశ్యులమెల్లరము వచ్చియున్నారమని చెప్పెను. అదివిని వైశ్యులు పెక్కుగోత్రములు గలవారుగాన, వారిని బ్రహ్మపిలుపింపగావారిలో ౬౧౨ గోత్రజులు గర్వితులై చేతులుతట్టి కేకలువేయుచు, బ్రాహ్మణుల నపహాస్యముచేసిరి. తక్కిన ౧౦౨ గోత్రజులు ముఖముమీఁద గుడ్డలు కప్పుకొని, చిఱునవ్వు నవ్విరి. దానిఁజూచి, బ్రాహ్మణు లతికోపావిష్టులై మీరు వైశ్యధర్మ మునువిడిచి, గోత్రహీనులై కులభ్రష్టులవ్రదురుగాకయని శపించిరి. అనంతరము ౧౦౨ గోత్రములవారు బ్రాహ్మణులయొద్దకుఁబోయి. నమస్కరించి, శాపవిమోచనమగు నట్లనుగ్రహింపుఁడని ప్రార్థింపఁగా మీ గోత్రములు ప్రాకృతగోత్రములను నామమును వహించి, భూతలమందుఁబ్రసిద్ధంబులై, పవిత్రంబులగుఁగాకయనియుఁ, గన్యానిమిత్తము మీ రగ్నిప్రవేశముచేసిన నీశాప విముక్తమగుననియు, నబ్యాదేవు లనుగ్రహించిరి. గాన నదిమొదలు మీలో ౬౧౨ ఒకభాగముగాను ౧౦౨ మఱియొక భాగముగాను విభక్తములై యున్నవి ఆకారణమునట్టి యిప్పుడా ౬౧౨ గోత్రజులు గర్మహీనులును మధుమాంసరతులును బ్రహ్మద్వేషులునై దేశాంతరగతులైరి. మీకాశాపవిమోచనకాల

ము సమీపమైనది. మీవంశస్థులిది మొదలు వేదోక్త విధి సమానముల
గు పురాణోక్త కర్మముల నాచరింపవలయును. అందువలన మీవంశజు
లు సర్వశ్రేయములఁ బొంది యాచంద్రార్క స్థాయిగా వృద్ధిఁబొందఁగ
లరని యనుగ్రహించి సాలంకాయనముని బ్రహ్మర్షిమండలమును తన యా
శ్రమమునకుం జనెను.

## అగ్నిగుండముల నిర్మాణము.

అనంతరము వైశ్యులత్యానంద భరితులై, తమతమ యిండ్లకుం
జని, మఱుదినము ప్రాతఃకాలమందు జరుపవలయు కృత్యములను దీర్చు
కొని, నగరేశ్వర మాలయమునకువచ్చి, యాసీనులైరి. కుసుమశ్రేష్ఠి
యుఁ గన్యాసమేతుఁడై వచ్చి, యుచితాసనమునఁ గూర్చుండెను. భా
స్కరాచార్యులును నిత్యకృత్యములఁదీర్చుకొని యచటికివచ్చి వైశ్యుల
చే, బూజితుఁడై కూర్చుండెను. అంత నావైశ్యవరులు తమగురువుంజూ
చి, తామగ్ని ప్రవేశము చేయు నిశ్చయమును వారికిఁ దెలియఁజేసి, త
మకు వీరకంకణములను ధరింపఁజేయుమని యడిగి, వాసవకన్యంజూచి
యగ్నిగుండప్రవేశవిషయమై నీయభిప్రాయమును దెలియఁజేయుమని
యడిగిరి. అంత వాసవకన్య వారలంజూచి, తొల్లి వేదవతి యనుకన్య
తన్నుఁ దనతండ్రి నారాయణునకిచ్చి వివాహముచేయునట్లు నిశ్చయించి
పరలోకస్థుడైనందునఁ, దాను నారాయణునింగూర్చి తపస్సు చేయు
చు రావణునిచే మోహింపఁబడినదై, చిచ్చురికి, సీతయైపుట్టి, నారా
యణాంశ సంభూతుఁడగు శ్రీరామునిం బెండ్లాడెను గాన, నేను నాతం
డ్రియిష్టప్రకార మగ్నిప్రవేశము చేయుటకు సిద్ధమైయున్నానని చెప్పె
ను. అదివిని, భాస్కరాచార్యులు వల్లెయని, యథావిధిగా వీరకంకణ
ధారణములను జేయించి, యగ్నిగుండములను నిర్మింప నాజ్ఞాపించెను.

## వైశ్యులు తమ బాలురకు ధర్మములు మొదలుగాఁగలవానిబోధించుట.

ఆమీఁద వైశ్యులు తమబాలురనుజూచి యో బాలనగరులారా-
మీరిది మొదలు సమస్త కార్యములయందును విద్యావాసినియుక్త శ్రీన
గరేశ్వరస్వామిని - గోత్రకముల సమేత శ్రీజనార్దనస్వామినిబూజించుచు

రావలయును. భాస్కరాచార్యుల యాజ్ఞప్రకారము సత్కర్మములను జరిపించుచు, వారిని ధనధాన్య భూషణాంబరాదులచేతఁ దృప్తిఁ బొందించుచు రావలయును. మాతులకన్యావివాహ విధుల ప్రకారము మీరు తప్పక జరిపించుచు రావలయును. వాణిజ్యముచేత జీవనములను జరుపుకొనుచుఁ, బరోపకారములను - దానాదిక్రియలను నిత్యము చేయుచు రావలయును. అబద్ధములాడనను వార్ధకదశయందు మునులతోఁ జేరి వారివృత్తి నాచరింపవలయును. బాల్యమునందు విద్యాభ్యాసము చేయవలయును. యౌవనకాలమందు భోగముల నిర్వహింపవలయును. మన కులాచారముల ననుసరింపనివారితో సంబంధము చేయవలదనియుఁ జెప్పిరి. మఱియు స్వజనులయందు దాక్షిణ్యంబును. పరజనులయం దనుకంపయు, దుర్జనులయందు శౌర్యంబును, విద్వజ్జనంబులయందు గౌరవంబును, శత్రువులయందు ప్రతాపంబును గురువులయందు క్షమయును మాయాజనులయందు ధూర్తతయుఁ మొదలగు, సద్గుణవిశేషంబు లమరియుండువార లీలోకంబున ఖ్యాతిగలిగి, సమస్త సంపదలు గలిగియుందురని తొల్లింటి శాస్త్రవేత్తలు ధర్మజ్ఞానబీజంబులుగఁ బలికియున్నారు గాన నాబుద్ధిమతుల నేమంక యనుష్ఠింపవలయునని యుపదేశించి, పిదప భాస్కరాచార్యులనుజూచి ప్రాంజలులై, సాలంకాయన మునీంద్రుండు విధించినప్రకారము మీరు మాకులము నుద్ధరించుచు, మాకు గురువులరై యుండవలయునని చెప్పి, తమసర్వస్వమును నాలుగు భాగములుగాఁ జేసి, మొదటిభాగమును భాస్కరాచార్యాది పురోహితులకు సమర్పించి, రెండవభాగమును దేవతాగారప్రతిష్ఠాది ధర్మములకును, మూఁడవభాగమును దమ బాలులకును, నాల్గవభాగమును వృద్ధుల యౌర్ధ్వదైహిక క్రియలకు నుచిత త్యాగంబులకు నుపయోగపఱచి యనంతరము పెండ్లి మొదలుగాఁగల శుభాశుభ కార్యములయందు భాస్కరాచార్యులకు కట్నంబుల నేర్పఱచి; దానశాసనంబు లిఖించియిచ్చిరి.

దానశాసనము.

స్వస్తిశ్రీవిన్ధ్యవాసీ యుతనగరేశగ కోసకములో. లక్ష్మీనాధ

నార్దనస్తు సువిశాం విఘ్నేశ దిక్పాలకాః । సూర్యేన్దారబుధేజ్య శుక్ర రవిజ స్వర్భానవః కేతుసం సాన్నిధ్యం బృహదద్రి పట్టణవరే కుర్వన్తు దీర్ఘాయుషమ్ ॥ కల్యాద్యబ్ద గణేష్ట నేత్ర రసదృక్సఙ్ఖ్యాగణే వత్సరే ప్రాప్తే శ్రీప్రభవే తపస్యపి సితేపక్షే ద్వితీయే గురౌ । వైశ్యైర్భాస్కర బద్ధితార్య ధరణీ బృన్దారకా యోత్సుకైః । శ్రీవ్యష్టాదశ పట్టణాధిపతిభి ర్దత్తంశుభం శాసనమ్ ॥ గ్రామేషు । సంస్థితానాం గృహాణేష్వపి సన్నికృష్ట మస్మాకం । అభ్యాగతేషు సద్యోవక్షేపక్షే భవత్సువిద్వత్సు ॥ వత్యార్ఘ్య ప్రముఖవిధిం కృత్వాక్షత గన్ధమాల్య తాంబూలైః । సంపూజ్య భోజనాదిక మధ పరికల్ప్యాతి భక్తితాత్పర్యాత్ ॥ దాశ్యామశ్చధసంప్రీత్యాగృహేవో నిష్కమష్టకమ్ । కల్యాణే షణ్ణయం నిష్కం సీమన్తేచ తదర్థకమ్ ॥ గర్భాధానే తదర్థంస్యా గర్భాప్రుంసవనేపిచ । పుత్రేజాతే తదర్ధంతు తదర్థంపుత్రికోత్సవే ॥ శాన్తికే పౌష్టికేచైవ పైతృకే వృద్ధికర్మణి । అన్యేషు పుణ్యకాలేషు గ్రహణే చన్ద్రసూర్యయోః ॥ నిత్యోత్సవే సర్వదేవవ్రతాదిషు సమన్తతః । యూయంచాపి ప్రదానార్హానమూచన్ద్రభాస్కరమ్ ॥ సోదరాణాంవిభాగేషు క్రయవిక్రయ వస్తుషు । ధర్మాంశంచ ప్రదాస్యామోయుష్మాకం నాత్రసంశయః ॥ ప్రయాగాదిషుతీర్థేషు గఙ్గాద్యాసు సరిత్సుచ । కురుక్షేత్రాది దేశేషు పుణ్యక్షేత్రేషు నిత్యశః ॥ యుష్మాకందీయదేదానంతద్రవ్యం చాక్షయంభవేత్ । ఏతస్యసాక్షిణో దేవా నగరేశ జనార్ధనాః ॥ ద్యావాపృథివ్యౌభూతాని చంద్రార్కావగ్నిరూర్జకః । యఇదం కురుతే ధర్మాంసబాంధవ సుతైస్సహ । అభూతసంప్లవం యావద్లోకే పతతిరౌరవే ॥ ఏవంవిదం యఃకరోతి మత్కులే వైశ్య శేఖరః ॥ సపుత్రపౌత్రైరాకల్పంవర్ధతాం వసుధాతలే ।

స్వస్తిశ్రీ కలియుగ గతాబ్దంబులు ౪౬౨౭ అగునేటి ప్రభవ సం॥ ఫాల్గునశుద్ధ ద్వితీయాగురువారమునాడు శ్రీమద్గురుభాస్కరాచార్యులవారికి నష్టాదశ వైశ్యపురవాసులగు నూటయిబ్బంద్రు నగరమువారుబృహదద్రియను పెనుగొండపట్టణమున శ్రీవింధ్యవాసినీసమేత నగరేశ్వర - శ్రీ కోనకమలాసమేత జనార్దన-విఘ్నేశ్వర-దిక్పాలక -నవగ్రహముల సన్నిధిని వ్రాయించియిచ్చిన దానశాసనమేమన్ననుః

మేము పట్టణమందుండిన నెడఫ్రలయందుండిన మీరు నేం చేసిన యెడల భక్తిపూర్వముగా గంధపుష్పాక్షత తాంబూలాదులచేత సన్మానించి, ప్రతికుటుంబమువారు నెనిమిదినిష్కములు వర్షాశనమిచ్చెదము వివాహములందు ౧౨ నిష్కములును. సీమంతమునందాఱును, గర్భాధాన- పుంసవనములయందు మూఁడును పుత్రోత్సవమున నేకార్థంబున, పుత్రికోత్సవమున నుపనయన శాంత్యాద్యనేక శుభాశుభ కార్యములయందును గ్రహణాది పుణ్యకాలవ్రతాదులయందును, సముచితముగాఁ గట్నములనిచ్చెదము. సోదరుల ద్రవ్యవిభాగకాలములయందును, వస్తుక్రయవిక్రయ లాభములయందును, ధర్మాంశమునిత్తుము. కాశీప్రయాగాది దివ్యస్థలములయందును. గంగాది పుణ్యనదీతీరములయందును, కురుక్షేత్రాది పుణ్యక్షేత్రములయందు నెల్లప్పుడు మీకును దానము చేతుము. నగరేశ్వర జనార్దన భూమ్యంతరిక్ష పంచభూత సూర్యచంద్రాగ్నుల సాక్షిగాఁ, బైనిబంధనల చొప్పునఁ గట్నములిచ్చించి సకల శ్రేయములు పొందుదుముగాన నీకవిూద మాకులమువారు వాడుక చొప్పున నడిపించి పుత్రపౌత్ర కళత్రాదులతోఁగూడి సకల సౌఖ్యముల ననుభవింతుము గాకయని యిట్లష్టాదశపట్టముల నూటయిబ్బండ్రు నగరమువారు వ్రాయించియిచ్చిన దానశాసనము.

శ్లో॥ స్వదత్తాద్ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనమ్। పరదత్తాపహారేణ
స్వదత్తం నిష్ఫలంభవేత్ ॥

{ వైశ్యభృత్యుఁడగు మల్లుసికినగ్ని ప్రవేశార్థము వీరకంకణ మిప్పించుట, }

ఇట్లు వైశ్యులు భాస్కరాచార్యులకు దానశాసనము వ్రాసియిచ్చి, తమభృత్యులనఁ జూచి, మీరు గుండములనిర్మించి శుభము జరుగఁబోవుచున్నదని వీధుల వెంబడిఁ జాటించి, పతాకములను నిలిపి, తోరణములఁగట్టి, పద్మస్వస్తిక ప్రముఖ రంగవల్లుల నమర్చి, పట్టణమునలంకరింపుఁడని యాజ్ఞాపించిన, నాభృత్యులలో మల్లుఁడనువాఁడు మీ యాజ్ఞానుసారముగాఁ జేయుచున్నాను - అయితే నా తండ్రియగు మలరుఁడనువాఁడు పూర్వము వింధ్యవాసినీదేవినిగూర్చి తపస్సు చేయఁగా, నా

మీ పతివ్రతలైన వైశ్యు లగ్నిగుండప్రవేశము చేయునప్పుడు, నీసంతతి వారిలో నొకఁడు, వారితోఁ జిచ్చుఱికిన, ఛత్రప్రభృతులకు ముక్తిగలుగునని యనుగ్రహించె. అదియుంగాక నేనిదివరకు మీవలనఁ బెంపఁబడి మీ పాదపద్మముల ననుదినంబుఁ గొలుచుచుండి, మీరు ముక్తికిఁ బోవ నిచట నుండనొల్లను - గాన నగ్నిప్రవేశార్థము నాకు వీరకంకణమిప్పింపవలయుననియు నట్లిప్పింపనిచో ఖడ్గముచేత నాశిరమును ఖండించుకొనుచున్నాననియుం జెప్పెను. అంత భాస్కరాచార్యులు వైశ్యులం జూచి, గంగతో నూరుకాలువలుగలసి పావనమైనచందంబున, వీని మీతోడ ముక్తిఁ జెందనిండని హితముచెప్పి, వానికిని వీరకంకణ తాంబూలము లిప్పించెను. పిమ్మట, భాస్కరాచార్యుల యనుమతిప్రకారము మల్లుఁడను నా భృత్యుఁడు, నడుమ ప్రధానగుండమును దానికిఁజుట్టును బాచకోణములుగల ౧౭ గుండముల నమర్చి, చక్రాకారముగాఁ దానికిరుప్రక్కల ౨ గుండములును, నాలుమూలగుండములు ౬ ను, వర్తులాకారములగు గుండములు ౧౩ ను, నాలుగుమూలలుగలగుండములు ౬౮ ను, వెరశి ౧౦౩ గుండముల నిర్మించి, వైశ్యులకుఁ దెలియఁజేసెను

{ వివాహకార్యనిర్వాహార్థము రాజపురోహితుడు
పెనుగొండకువచ్చి, వాసవీమాయామోహితుఁడై యుండుట. }

అనంతరము రాజపురోహితుఁ డగు నొక వృద్ధబ్రాహ్మణుఁడు రాజప్రేషితుఁడై వచ్చి పెనుగొండద్వారంబుననిలిచి తనరాకను దెలియఁజేయఁగా, వైశ్యవరులు భాస్కరాచార్యులతోఁడ నెదురేగి, యా బ్రాహ్మణుని సకలమర్యాదలతోఁ బిలుచుకొనివచ్చి, యుచితాసనంబునఁ గూర్చుండఁబెట్టి, రాజాజ్ఞప్రకారమా బ్రాహ్మణుఁడు తెచ్చియిచ్చిన కానుకల నంగీకరించి సంతుష్టహృదయారవిందులై యాతనికిఁ బ్రతిమర్యాదలను జరిపించిరి. ఆతండు నా మర్యాదల నంగీకరించి రేపు జాములోపల వివాహము కావలసియున్నది గనుక రాజు వివాహనిమిత్తము వచ్చుచున్నాఁడు. వివాహమునకుఁ గావలయు ప్రయత్నములను మీరు చేసియున్నారా? మీ కులాచారప్రకారము మేము జరిపింపవలయునది నాతోఁ జెప్పిన, నేను రాజునకుఁ దెలియఁజేసి యా[illegible]

తము నడిపించుచున్నారని చెప్పఁగా, భాస్కరాచార్యులు రాజపురోహితు నవలోకించి, యేడుదినములు పాణిగ్రహణ మహోత్సవము జరుగవలయును. పాణిగ్రహణపూర్వదినమున నగ్నిపూజ చేయవలయును. చేయవలయు కార్యములనేకములు గలవు- వాని ముందు తెలియనగును- అనివివాహవిధులను గొంత తెల్లంబుగఁ దెలుప, నుల్లంబురంజిల్లి యావిప్రులు తనకై వైశ్యులచే సర్వకల్యాణసంపన్నముగా నృత్యగీతవాద్యములచేత శోభిల్లునట్లు సమర్పఁబడిన యొకవిడిది ప్రవేశించి యచ్చటి వైభవములంగని, మైమఱచి రాజకార్యమును దలంపఁడయ్యె. పిమ్మట వైశ్యపుంగవులు మంగళస్నానములు చేసి, వస్త్రాభరణాద్యలంకృతులై, యాశ్రితులగు బ్రాహ్మణులకు పారితోషికములను బీదలకు దానములను జేసి, యగ్నిగుండసమీపములకు వచ్చినిలిచిరి,

— * వైశ్యస్త్రీలకు వాసవకన్య తన స్వరూపమును జూపుట. * —

అంత వైశ్యస్త్రీలాదట సంతోషహృదయారవిందులగుచు వాసవకన్యకు గంధామలకస్నానము చేయించి, సమస్తాభరణముల నలంకరించి. నుదుటఁగస్తూరితిలకమిడి, మిక్కిలి సన్నమైన పచ్చని వస్త్రమును గట్టి, పిదపఁ గన్యనుజూచి. యజ్ఞానము చేత మురిపించుచుండగా, వారికి నావాసవి సౌమ్యాకారమైన తన స్వరూపమును జూపెను వైశ్యస్త్రీలు నారూపమును ముహూర్త మాత్రము దర్శించి, సంతోషించి, నిశ్చలచిత్తులై యుండఁగా. సాక్షాత్పార్వత్యంశ సంభూతురాలైన యావాసవకన్య యథాప్రకారము కన్యాస్వరూపిణియాయెను.

{ వైశ్యులతికోలాహలముతో నూరేగి గుడస్థలమునకువచ్చి స్వస్త్రీలతోఁడ గుడి ప్రవేశము చేయుట. }

అనంతరము కుసుమాది వైశ్యపుంగవులు శ్రీనగరేశ్వరాలయమునకుఁబోయి, శ్రీనగరేశ్వర వింధ్యవాసినులను, శ్రీజనార్దన కోసకములను యథావిధిగాఁ బూజించి, ధన కనక వస్తువాహన - భూములాను సమర్పించిన ధిమాగధ వైతాళికాదులునుతింప, గాయకులు వీణావ్య నేక వాద్యవిశేష ములతో నృత్యగీతములు సలుప భటులుపరివేష్టించిరాఁగాఁ దమ పట్టణపు రాజవీధుల వెంబడినరిగి, భాస్కరాచా

ల యాశ్రమమునకువచ్చి యతనివలన స్వస్వనిర్దిష్టగుండములఁ దెలిసి
కొని, యచ్చటనుండి బైలుదేరి గుండప్రవేశ స్థలమునకరిగిరి, అనంతరము
వైశ్యస్త్రీలును సర్వాభరణ భూషితులై, గంధమాల్యాంబరములనుధ
రియించి, పరస్పరము గంధపొడి మొదలుగాఁగల నానావిధవసంతోచి
త పరిమళద్రవ్యములను జల్లుకొనుచు నత్యానందభరితులై గుండప్రవే
శ స్థలమునకు వచ్చి. వారువచ్చునప్పుడు గలిగిన ఘోషము పట్టణము
నకంతయు వినఁబడియె.

అప్పుడు రాజుచేత ముందుపంపఁబడి, యాపట్టణమందు వసిం
చియున్న, రాజభటులా ఘోషమును వినివచ్చి, వైశ్యుల యగ్నిప్రవే
శమాహాత్మ్యమును జూచి వాసవకన్యా మాయచేత, రాజ వినాశ
కృత్యములు కాఁబోలునని భ్రమించి యుండిరి.

అనంతరము వైశ్యులు వారివారి గుండములముందు నిలిచి యా
చమనీయాది క్రియలాచరించి, శ్రీశంకరమూర్తిని మదినిదలఁచి, నిజప
త్నీసమేతులై యగ్నిగుండములయందుఁ బ్రవేశించిరి. అంత నాయగ్ని
హోత్రుఁడు తన తీక్ష్ణత్వము నుపసంహరించి యావైశ్యుల దేహముల
కుఁ జల్లగానుండునట్లు చేసెను, - దానంజేసి వైశ్యులు తమశిఖలయం
దు ధరించిన పువ్వులేనియుఁ గమలక పద్మసహితములగు కొలంకుల
లో రాజహంసలు క్రీడించినచందంబున నాయగ్నిగుండములయందుఁ బ్రకా
శించుచు నత్యాకులితాశ్చర్యమనస్కులై, మధ్యాగ్నిగుండ ప్రదేశమం
దు నిశ్చలచిత్తయై ధ్యానముచేయు వాసవకన్యను జూచుచుండిరి. అప్పు
డా వాసవాంబ యాయనలగుండమందుఁ బ్రజ్వలించు వీతిహోత్రుని
జూచి, యనేకవిధముల సంస్తుతులుచేయుఁగా, నాయగ్నిదేవుఁ డవ్వాస
వకన్యకుఁ బ్రసన్నుఁడై, గురుమాతాపితృశుశ్రూషణనిరతులును, దైవ
భక్తిగలవారును, ధర్మాసక్తులును, సత్యవంతులును, వేదాంతజ్ఞానులు
ను నై, నీసంబంధులుగానుండు నీవైశ్యోత్తములను నిర్దయుఁడనై య
కారణముగా దహించుటకు నాకిష్టములేదు. పూర్వము మహాపతివ్రతా
శిరోమణియును గర్భిణియునగు భృగుపత్నిని సత్యభీతుఁడనయి కలహాప్రా
క రాక్షసునకుఁ దెలియఁజేయుటచే నా భృగుమహర్షి సర్వభక్షకుఁడవగు

నినన్ను మహాదారుణముగా శపించెను. అది మొదలు సత్పురుషులను హింసించుట యందు మహాభయగ్రస్తుండనైతిని, గాన నీ మహాత్మ్యములను. నేను దహింప నోపననను ఈ వృత్తాంతముల నా శ్రోత్రములు విని, యత్యాశ్చర్యమును బొందియుండిరి. అంత వాసవకన్య యగ్నిహోత్రునిఁ జూచి, ఓయగ్నిహోత్రుఁడా నీవు భూతభవిష్యద్వర్తమాన కాలవేదివి. నీకుఁ దెలియని దేమియున్నది, పూర్వమీ కుసుమశ్రేష్ఠికి ౧౦౧ గోత్రములవారిలోఁ బుణ్యపదవి నిప్పించునట్లునే వరంబొసఁగినది నీకుఁ దెలియదా? దేవతుల చేతను నుతింపఁబడు నో యజ్ఞపురుషుఁడా, యీ వైశ్యులపై కృపనునిచ్చి, కాలయాపనము చేయక, శీఘ్రముగా దహింపుము, నీదయవలన వీరలనిత్యమగు నీ తనువును విడిచి నిత్యమును - పునర్జన్మరహితమును నగు పదవిని బొందనిమ్ము. రాజు స్వకులధర్మములను త్యజించి, వైశ్యకన్యయు నిర్దోషురాలును నగు నన్ను వివాహము చేసికొనఁగోరి యీ యిచ్ఛను మానక యున్నాఁడు. రాజు వచ్చు కాలము సమీపించినది. వాఁడు రాకముందే యీ వైశ్యులయందుఁ గృపయుంచి, శంకర పదవికిఁ బంపుమని విన్నవింపఁగా, యజ్ఞేశ్వరుండు మిక్కిలి సంతోషించి, యంతరిక్షమును దాఁకు జ్వాలలుగలిగి, ప్రళయ కాలాగ్ని చందంబునఁ బ్రజ్వలించెను. అంత కుమున్న వైశ్యులందఱు లేచి మరల నలంకృతులై, తమతమ యుద్దిష్టగుండముల యెదుట నిలిచిరి.

{ వాసవకన్య తన సోదరులగు బాలనగరులకు బుద్ధిమతులు జెప్పి, యికను వైశ్యకులమందుఁ బుట్టఁగల కన్యలు - రూపహీనులై యుండునట్లు శపించుట. }

అపుడు వాసవకన్య బాలనగరులనుజూచి మీరు నన్నుఁ గూర్చి చేయనుద్దేశించిన దానములను భాస్కరాచార్యులకిచ్చి నామంత్రముల నెల్లప్పుడు జపించుచు, గృహమందేనియు, సూర్యావాసమైయుండు స్థలమునందేనియు, శ్రీ జనార్దనస్వామి సన్నిధినేనియు, శ్రీచక్రస్థాపన చేసియుండు స్థలముననేనియు, నన్నావాహనచేసి, సాలంకాయన మహర్షిప్రోక్తమగు మంత్రముచేత నెల్లప్పుడును బూజించుచు వివాహ

కాలములయందును వన తటాక గృహాది నిర్మాణ కాలములయందును, నన్నుఁ గలశరూపముగా నర్చించుచు రావలయును, ఇట్లు పూజించినవారు సకలసంపదైశ్వర్యములుగలిగి వర్ధిల్లుదురు గావుత యని వచించి కోథలామాత్రిష్ఠయై, విష్ణువర్ధనభూపతి యావైశ్యసంఘ మగ్నిప్రవేశమైన సంగతి విన్నమాత్రమునఁ బెక్కుతునకలైన తలగలవాఁడై చచ్చెను అవిశపించి యిదిమొదలు లీవైశ్యకులమందుఁబుట్టు స్త్రీలు చింతాకువంటి నేత్రములు - పొట్టివెంట్రుకలు - మిట్టపండ్లు - బలిసినవదనము - నాటు వోయిన స్తనములు - నలుపురూపు - దొడ్డకాళ్ళు - పొట్టిచేతులు - పెద్దకడుపు - కుఱుచయగుదేహము - గూనివీఁపు - పొట్టిముక్కు - మెల్లకన్ను - గద్గదస్వరము - వికటవర్చస్సు - మొదలగు వికృతరూపములు గలిగి, జన్మింపవలయును. ఇటువంటి వికారరూపముఁగలిగినను, సులక్షణులై, పుత్ర పౌత్ర ధనధాన్యసంపదాభివృద్ధిగలిగి, దీర్ఘసుమంగలులై, యుండవలయును - అనియనుగ్రహించి యోగాగ్ని జనితస్వరూపము నెత్తి భాస్కరాచార్యులయెదుట నిలిచెను

-* ఈశ్వరుఁడు ప్రత్యక్షమై వాసవకన్యకఁగోరిన వరములిచ్చుట *-

అప్పుడు శ్రీ సాంబమూర్తి వృషభవాహనారూఢుండై, సమస్తగణములతోఁ బ్రత్యక్షముకాఁగా వైశ్యులందఱు నత్యాశ్చర్యానంద సంతోషమగ్నులై యయ్యుమాపతినిఁజూచి, పులకాంకితదేహులై, సాష్టాంగదండప్రణామములాచరించి ప్రాంజలులై స్తుతించుచుండిరి వాసవకన్యయు నతివినయభయభక్తులతో నుమాపతిని స్తుతించిన, నతండు మహాసంతుష్టుండై నీకుంగావలయు వరమడుగుమనఁగా, వాసవకన్య నీపాదపద్మములయం దెల్లప్పుడు చిత్తముగలిగియుండున ట్లనుగ్రహించి, నూటరెండుగోత్రజులగు నీ వైశ్యులను యోగీశ్వరేశ్వరులకును నగమ్యమగు నీపదవిం జేర్చునట్లనుగ్రహింపుమని వేఁడెను. ఈశ్వరుఁడు నట్లయగుఁగాకయని యనుగ్రహించి, వాసవకన్య చెయిపట్టుకొని యగ్నిలోనికి యాకన్యను దనతొడలపైఁ గూర్చుండఁబెట్టుకొని, యగ్నిమధ్యంబున బ్రకాశించెను.

-* వైశ్యులగ్నిప్రవేశముచేసి, కైలాసపదవిని బొందుట *-

అప్పు డావైశ్యులీశ్వరాంక స్థయగు వాసవకన్యను జూచి, పుల కాంకితశరీరులై, స్తుతించి తమకునీశ్వరపదవినిప్పింపుమని వేఁడుకొనఁగా నామెయాప్రకారము వరమొసంగి యీశ్వరునితోడ నంతర్ధానమయ్యె. వైశ్యులు నీశ్వరధ్యానపరాయణులై, యజ్ఞగుండములకుఁ బ్రదక్షిణము వచ్చి భాస్కరాచార్యులకుఁ బ్రణమిల్లి, యజ్ఞగుండములలో దుముకిరి. అప్పుడు దేవతలు పుష్పవర్షము గురిపించిరి. దేవదుందుభులు మ్రోసెను. శైవకింకరులు విమానములను దెచ్చియావైశ్యులనెక్కించుకొని, కైలాసమునకుఁ బిలుచుకొనిపోయిరి. అచట నా వైశ్యులుసాయుజ్యమును బొంది, యీశ్వర సేవాపరతంత్రులై, ప్రవర్తించుచుండిరి.

అంతనిచట వైశ్యబాలురు తమ మాతాపితరులనుద్దేశించి మిగుల దుఃఖించుచుండఁగా. భాస్కరాచార్యులు. వారికి హితోపదేశముచేసి, శోకమునుమాన్పెను. వారిచేత యథావిధిగాఁ బైతృక కర్మములను జరిపించి, బ్రాహ్మణులకు దశదానాద్యనేక దానములను జేయించెను.

అంత భూజనులు వైశ్యులను మిక్కిలి శ్లాఘించుచు, విష్ణువర్ధన భూపతిని దూషించుచునుండిరి,

-- * విష్ణువర్ధన భూపాలుని మరణము. * --

ఇట్లు వైశ్యవరులందఱు నగ్నిప్రవేశము చేసినపిమ్మట రాజభటులాహా వైశ్యులెంతసాహసముచేసిరి. మనము మదిరాపాన మత్తచిత్తులమై యుక్తకాలములో నీసంగతులను రాజునకుఁదెలియఁజేయక పోతిమి. ఇపుడేమిచేయుదమని మహాభయభ్రాంతులై, రాజ మహాక్రోధమున కుంజని, యావిశేషంబులను రాజునకుఁ దెలియఁజేయక యుండిరి. అట విష్ణువర్ధనరాజును దన సభామంటపంబునఁ గొలువుండి, వివాహమహోత్సవమునకు రాత్రి మూఁడుజాములవేళ బైలుదేరవలయునని నిశ్చయించి కవి గాయక వంది మాగధ పాఠక పరిహాసకాదులను గజ తురంగబలములను, ముందునడిపించి, సిద్ధముగానుండుమని పుత్రునకాజ్ఞాపించి,తానును గాలచోదితుఁడై యంతఃపురంబునకుఁ బోయి, భోజనము చేయఁబోఁగాఁ బరిశీప త్రైర్ణములలో నమర్పంబడిన రాజ్యవ్యాది భ



ష్యభోజ్యము లరుచికరములును- దుర్గంధయుతములును-హాలాహలస్స
మానులునుగానగు పడినందునఁ నాయన్నాదులను వర్జించిరను వంట
వారిని, శిక్షించి, తనకుఁ గలిగియుండు మహా క్షుద్బాధవలన మనఃక్లే
శమునుబొంది, పడకింటకిఁజని, పానుపుపైఁబవ్వళించి, పాపైనను బ్రా
వెదననితలఁచి, దానిఁదాఁవఁబోవ నదియును బురుగులుగలసిన రక్త
ముగనిఁదోఁచినందున దానివర్జించి, వాసవీశాపశాఖిఁతుఁడై, యతి
క్రూర సర్పముకరణి నిట్టూర్పులు విడుచుచుఁ బొరలుచుఁ బ్రలాపించు
చునుండె. ఆసమయమున రాజాంగనలువచ్చి, రాజునకు ననేక సుఖో
పచారములంజేసి యెన్నడులేని వ్యాకులము నేఁడుమీకేలగలిగెను-
ఇదేమియాశ్చర్యము- రేపుజామునకు ముహూర్తమని యనేకవిధముల
సమాధానములు చెప్పఁగా రాజు కొంత నెమ్మదితో నిద్రించెను- ఆ
తనిభార్యలు నలుగడలం గూర్చుండి యుండిరి.

వాసవకన్య విష్ణువర్ధన మహారాజుయొక్క శిరముదు ఛేదించి
యతని నతని మంత్రిని పాశములతోఁగట్టి యీడ్చుకొనిరమ్మని, శక్తి
నిబ్రేరేపించి, తానుయోగాగ్నిం బ్రవేశించినందున, నాశక్తిరాజుస్వ
ప్నమునందు వచ్చి, మహాభయంకర స్వరూపురాలై కానంబడి ఖడ్గ
ముచేత నరుకుట బల్లెముతోఁ బొడుచుట, మొదలగు ననేకవిధబా
ధలు పెట్టఁగా, వానిసహింపలేక బొబ్బలిడుచు, భయముచేత వడవ
డంకుచు దేహము చెమర్పఁగా లేచి నిట్టూర్పులు విడుచుచుఁ గూర్చుండి
తానుగన్న కలనుదన భార్యలకుఁ దెలియజేసెను. అంతఃపురవృద్ధులా
స్వప్నమునువిని గ్రామదేవతలపూజ జరుపకయే రేపు నీవు పెండ్లి
యాడంబోయెదవుగాన, నీకు నిట్టికుస్వప్నమాయెను. నీవుబలి మొదల
గు వానిచే నాగ్రామదేవతలను దృప్తిఁబొందించి, సుఖంబు లనుభవిం
పుమనిచెప్పిరి. రాజును దనమంత్రుల కాజ్ఞాపింపఁగా, వారును గ్రా
మదేవతలకుఁ బూజలుచేసి యావర్తమానమును రాజునకుఁ దెలియఁ
జేసిరి. అదివిని రాజు సంతోషించి, శత్రుమర్దనమను దనపట్టపేనుఁగు
నెక్కి నిర్గమనవేళకు బైలుదేరి, పెనుగొండపురమునుఁ జూచి వచ్చు
చుండెను. అప్పుడు దాగియుండిన రాజభటులు ధైర్యముఁ దెచ్చుకొని,

యతని మొదటికి జని భీతితో నంజలిబద్ధులై యో రాజా! వైశ్యులు మహాకష్టోపాయంబునఁ గట్టినవెల్లనలంకరించి రేపు వివాహముకాఁ గలదని యూరంతయుఁ జాటించి వాసవకన్యతోడ నగ్నిప్రవేశము చేసి మృతులైరని చెప్పుచుండఁగా నతి భయంకర స్వరూపముగల శక్తిరాజు నెదుటనిలిచెను. ఆశక్తిఁ జూచి రాజు భీతిల్లి, తల పలుశకలంబులై పగిలి, భూమిపైఁబడి చచ్చెను. శక్తియు నారాజపరివారము నమితమైన బాధలఁబెట్టి చంపి, పిదప దేవతాస్తుతులంది, కైలాసముఁ జేరెను. హతశేషులగు కొందఱు భటులు రాజసదనంబునకరిగి, రాజపుత్రులు మున్నగువారితోఁ జెప్పఁగా వారు మహావ్యసనాక్రాంతులై యేకారణమువలన నిట్లు రాజ మొదలగువారు మృతిఁబొందిరని యడుగ్గఁగా, నొకభృత్యుఁడు - వాసవకన్య వైశ్యసమూహముతో నగ్నిగుండ ప్రవేశము చేయునప్పుడు మహాఘోర కాళీస్వరూపమెత్తి వచ్చి, రాజమంత్రి పరివారములను ముహూర్తమాత్రములో హతము చేసెనని చెప్పెను. ఆమాటలువిని, కొందఱు భయభ్రాంతులై, భూమి మీఁదంబడి చచ్చిరి. కొందఱు మూర్ఛిల్లిరి. కొందఱు పర్వతగుహలయందు డాగిరి. అంత నారాజపుత్రుఁడు మహాదుఃఖాకులిత మానసుఁడై, వ్యసనపడుచుండఁగాఁ, దత్పురోహితుఁడగు ధౌమ్యమహర్షి యతనిఁజూచి, పూర్వమీశ్వరుని ఫాలాగ్నివలన దహింపఁబడిన మన్మథుని భస్మరాసిలో భండాసురుఁడను రాక్షసుఁడుద్భవించి, లోకపీడనము చేయుచుండఁగాఁ, బార్వతీదేవి లలితయై వానిసంహరించెను. తివాఁడు శుంభాసురనామముతోఁబుట్టి, మహాదుష్టుఁడై దేవతలను బీడించుచుండఁగా, మహేశ్వరి చండికయై, యతనిం దెగటార్చెను. అంతనారక్కసుఁడు చిత్రకేతుఁడను గంధర్వుఁడై జన్మించి, యాదేవి నతిభక్తితోఁ బూజింపఁగా, నామె ప్రసన్నయై నీవు భూలోకమందు విష్ణువర్ధన రాజువై పుట్టి నాచేతన సంహరింపఁబడి నాసన్నిధికివచ్చి చేరుదువని వరంబిచ్చెను. ఆ గంధర్వుఁడే నీ తండ్రియై పుట్టెను. ఆదేవి యాకుసుమశ్రేష్ఠికిఁ గూఁతురైపుట్టి, వాసవకన్యయై వర్ధిల్లుచుండె. ఇట్లుండఁగాఁ, బూర్వకర్మవశమువలన మీతండ్రి యీ వాసవ కన్యనుగోరి, సాధువృ

లగు వైశ్యులను బాధింపఁగా, వారు స్వకులధర్మ సంరక్షణార్థముబం ధుజనసమేతులై యగ్నిప్రవేశము చేసిరి ఆ పాపమువలన మీతండ్రి నిజమంత్రి పరివార సహితుఁడై మృతినొందెను కాన నీవు దుఃఖము మాని నీతండ్రికి దహనాది క్రియలనాచరించి, పెనుగొండకుఁబోయి వైశ్యులయందు విశ్వాసముగలిగి, యేడుదినము లాదేవినిగూర్చి మహాభక్తితోఁ దపస్సుచేసి, యాదేవి యనుగ్రహము వడసి, ధర్మరాజు వలె సుఖంబున రాజ్యపాలన మొనర్చుచుండుమని హితోపదేశముచేసి, యూరడించెను.

{ విష్ణువర్ధన మహారాజ పుత్రుండు తనతండ్రికి నూర్ధ్వక్రియల నాచరించి వైశ్యబాలురను శరణుచొచ్చుట }

అనంతరం మారాజపుత్రుడు దుఃఖముమాని, మహాభక్తిపరాయణుఁడై, తనతండ్రికి దహనాది క్రియలాచరించి, వైశ్యులకు సమాధానముచెప్పి, మంత్రి సామంతరాజ సమేతుఁడై, పెనుగొండ పట్టణమునకువచ్చి, తనరాక వైశ్యుల కెఱుంగించెను ఆ సమాచారమువిని, వైశ్య బాలురు మిగుల భీతిల్లిరి భాస్కరాచార్యులకడకేగి, రాజపుత్రుఁడేతెంచె- వీఁడు మనలనేమిచేయునో యని చింతించిరి. అదివిని భాస్కర గురుఁడు మీరు భయపడకుఁడు. ఆ రాజపుత్రుఁడు మీకు సమాధానము చెప్పి, మీయనుగ్రహము నకుఁ బాత్రుఁడగుటకు వచ్చెనని, వైశ్యబాలురతోఁ జెప్పి, వారితోడ రాజపుత్రునకెదురేగి యాతని బిలుచుకొనివచ్చి, నగరేశ్వర ముఖమంటపమునఁ గూర్చుండఁబెట్టిరి. అంతరాజపుత్రుఁడు వైశ్యులనజూచి యనేకములగు నుపచారవార్తలుచెప్పి నారాజ్యమునఁ జతుర్థాంశ మిచ్చుచున్నాను. దానిఁ బాలించుచు నాకు స్నేహితులరై యుండుఁడని చెప్పఁగా భాస్కరాచార్యులు రాజపుత్రునిఁజూచి యీవైశ్యులు తమపితలను ద్దేశించి, గయాప్రయాగలయందు సత్క్రియ లాచరింప నుద్యుక్తులైయున్నారు. కృషి వాణిజ్య గోరక్షణ వ్యాపారములుగల వీరికి రాజ్యభారమెట్లుచేయఁదగు. గానవీరు రాజ్యమొల్లరనఁగా రాజు దానివిని సత్క్రియలు జరుపఁబోవువారి నాటంకపఱుప నాకుఁ దగదు గాన, మీ

రుబోయిరండు. మీరు వచ్చువఱకు నేను నాపట్టణము వెలపట నొకగృహమున వసించి, నిద్రాహార రహితుఁడనై ప్రాయోపవేశ వ్రతమాచరించి, మీరు వచ్చిన పిదప దేవ్యనుగ్రహమును బొంది, రాజ్యపాలనమొనర్చెదను- అని చెప్పుచుండఁగా, నట్లయొనర్చ వలయునని యశరీరి పలికెను. అచ్చటి వారందఱు నామాటలకు సంతసించిరి అంతనా రాజపుత్రుఁడు వైశ్యులకు సకలవిధ బహుమానములను చేసి, వారిచేఁ జేయఁబడిన ప్రతిసన్మానముల నంగీకరించి, మంత్రిసామంతులతోఁ దనపట్టణమునకుఁబోయి తన పురోహితుండగు ధౌమ్య ఋషీశ్వరునాజ్ఞవడసి తనతండ్రికిఁ దిలోదకాది క్రియలనాచరించె. పిదపఁ గన్యకాదేవి యనుగ్రహమును బొందువిధముఁ దెలుపుమని ధౌమ్యునడుగఁగా, నతండొక సంవత్సరము వఱకు మితాహారుఁడవును జితేంద్రియుఁడవును నై, దీక్షవహించి, భక్తితో దేవిని బూజించి తద్విషయిక మంత్రరాజమును జపించితివేని, యద్దేవి ప్రసన్నయై నీకు సుఖంబులం గలుగఁజేయునని చెప్పి, యాఋషి తన యాశ్రమమునకుఁ జనెను.

దే వీ పూ జా వి ధా న ము .

అంత నారాజపుత్రుఁడు ధౌమ్యోపదిష్ట మార్గంబున ॥ శ్లో ॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ । ప్రసన్నవదనంధ్యాయే త్సర్వవిఘ్నోప శాంతయే ॥ అనుశ్లోకము చదివి సంకల్పము చెప్పి శ్లో ॥ కల్యాణగుణసంపన్నాం కామితార్థ ప్రదాయినీమ్ । చిన్మయాకాంచిదానన్దాం వన్దేవాసవకన్యకామ్ ॥ శ్రీచక్రసదనాం దేవీం సర్వలోకైకనాయకీమ్ । జగత్పూజ్యాం జపారక్తాం సర్వదా హృదిభావయే ॥ అనిధ్యానించి ఆవాహయామి దేవేశీం కన్యకాపరమేశ్వరీమ్॥ వరదాభయహస్తాభ్యాం సర్వాభరణ భూషితామ్ ॥ అని యావాహనము చేసి, నవరత్నమయందివ్యం జాంబూనద వినిర్మితమ్ । అర్పయామ్యాసనం దేవీ వైశ్యవంశ ప్రవర్ధనీ ॥ అని యాసనముసమర్పించి, గంగాదిసరిదాసీతైః పాద్యైర్నిర్మలోదకైః అర్ఘ్యంతవప్రదాస్యామి కృపయాస్వీకురుష్వమే ॥ అని యర్ఘ్యముసమర్పించిపఙ్కజపల్లవ మృదుపాదయుగం మానిహృదయ కమలస్థమ్ । ప్రక్షాళయామిసలిలైస్తైర్ద్వామలైరతిశీ

తైలైశ్చ పరిప్లుతైః ॥ అని పాద్యముసమర్పించి. సువర్ణకలశానీతంచా
సీతంనిర్మలోదకమ్ । గృహీత్వాదేవిమద్దత్తం సమ్యగాచమనంకురు ॥
అని యాచమనీయముసమర్పించి, శర్కరామధుసంయుక్తం కదళీఫల
మిశ్రితమ్ । మధుపర్కం గృహాణేదం కన్యేత్రిపురసున్దరి ॥ అని మ
ధుపర్కము సమర్పించి, అన్తఃపురేమహాదేవి గాత్రాణ్యుద్వర్తన పూర్వ
కమ్ । పఞ్చామృతస్నానమిదం కురువాసవకన్యకే ॥ అని పంచామృత
స్నానమాచరించి, గఙ్గా గోదావరీ చైవ కావేరీ యమునా తథా ।
స్నాపయన్తిభవానీంత్వాం స్వైస్స్వైర్నిర్మలవారిభిః ॥ అని శుద్ధోదకస్నా
నమాచరించి, కనకమయామ్బరయుగళంవిమలంమృదులంచకఞ్చుకం ర
మ్యమ్ । ధౌతంధారయదేహే గిరికన్యే కన్యకాపరమేశి ॥ అని వస్త్ర
ముసమర్పించి, తాటఙ్కహస్తకటకాది విభూషణైస్త్వాం । మాణిక్యని
ర్మితమనోహర కాఞ్చనాద్యైః । అఙ్గానికల్పతరుపల్లవకోమలాని । శ
ర్వాణిభూషయ హిమాచలకన్యకేత్వమ్ ॥ అనిభూషణముల నలంకరిం
చి. కస్తూరితిలకంఫాలే కాశ్మీరంచ సుశోభితమ్ । గళే శ్రీచన్దనంవక్షః
స్థలే రఞ్జయకన్యకే ॥ అని కస్తూరి కాశ్మీర చందనముల సమర్పించి,
అక్షతాన్ క్షతజాభాంస్తే దాక్షాయణిజనస్తుతే । జగతాం రక్షణేనిత్యాన్
దీక్షితేస్వీకురుష్వహి ॥ అని యక్షతలు సమర్పించి, మల్లికాజాజి పున్
నాగ కరవీర మహోత్పలైః । విస్తారయామికబరీ మమ్బవాసవక
న్యకే ॥ అని పుష్పములు సమర్పించి.

—( అంగ పూజ. )—

కమలాసనాయైనమః । అని పాదములను, గూఢగుల్ఫాయైన
మః ॥ అని గుల్ఫమును, పీనజఘనాయైనమః ॥ అనిజఘనములను, సు
వృత్తజానవేనమః ॥ అని జానువులను, కుమారికాయైనమః ॥ అని
యూరువులను అరుణదుకూల ధారిణ్యైనమః ॥ అనికటిని సునాభ్యై
నమః ॥ అని నాభిని అతిమృదుల హృదయాయైనమః ॥ అని హృదయ
మును కల్పవల్లీసమ భుజాయైనమః ॥ అని భుజములను కమ్బుకణ్ఠ్యైన
మః ॥ అని కంఠమును బిమ్బోష్ఠ్యైనమః ॥ అని యోష్ఠమును కున్దద
న్తాయైనమః ॥ అని దంతములను స్నిగ్ధగణ్డస్థలాయైనమః ॥ అనికపోల

ములను సునాసాయైనమః ॥ అని నాసికను కమలలోచనాయైనమః॥ అని నేత్రములను సుభ్రువైనమః ॥ అని కనుబొమలను అర్ధేన్దుఫాలాయైనమః ॥ అని ఫాలమును తాటఙ్కాలఙ్కృత శ్రోత్రాయైనమః ॥ అని శ్రోత్రములను సర్వోన్నతాయైనమః ॥ అని శిరమును వాసవ్యైనమః ॥ అని సర్వాంగములను బూజించి.

### ద్వాదశ నామ పూజ.

ఓం మహాదేవ్యైనమః ॥ వైశ్యకులదేవతాయైనమః ॥ కుసుమగర్భజనితాయైనమః ॥ ద్వ్యధికశతగోత్ర నిర్ణేత్ర్యైనమః ॥ మతఙ్గవరత్రియధాత్ర్యైనమః ॥ సమాధిమోక్షవరప్రదాత్ర్యైనమః ॥ హేమదత్తశ్రేష్ఠికోత్తరకులమోక్ష ప్రదాత్ర్యైనమః ॥ కీర్తికన్యకాయైనమః ॥ విష్ణువర్ధన కాళరాత్ర్యైనమః ॥ బుధప్రియాయైనమః ॥ స్వభక్తవైశ్యకైలాస ప్రదాయైనమః ॥ కన్యకాపరమేశ్వర్యైనమః ॥ అనునీ పండ్రెండు వచనములచేత ద్వాదశనామ పూజచేసి.

### —( అష్టోత్తరశతనామపూజ. )—

ఓం రేణుకాయైనమః । రామజనన్యైనమః । జమదగ్నిప్రియాయైనమః । సత్యైనమః । ఏకవీరాయైనమః । మహామాయాయైనమః ॥ కాళరాత్ర్యైనమః । శివాత్మికాయైనమః । మహామోహాయైనమః । మహాధీర్యైనమః । సిద్ధవిద్యాయైనమః । సరస్వత్యైనమః । యోగిన్యైనమః । చణ్డికాయైనమః। సిద్ధాయైనమః। సిద్ధలక్ష్మ్యైనమః। శివప్రియాయైనమః। కామదాయైనమః కామజనన్యైనమః మాతృకాయైనమః మన్త్రసిద్ధిదాయైనమః మన్త్రసిద్ధ్యైనమః । మాతృమణ్డలవల్లభాయైనమః। చన్ద్రికాన్త్యైనమః। సూర్యకాన్త్యైనమః । శుచిస్మితాయైనమః । యోగీశ్వర్యైనమః । యోగనిద్రాయైనమః । యోగదాయైనమః । శ్రీయైనమః । ప్రభావత్యైనమః। అహరస్త్రస్వరూపాయైనమః । క్రోధరూపాయైనమః । మనోగత్యైనమః । మనశ్శక్త్యైనమః । స్మృతిఘూర్ణాయైనమః । చక్షుస్త్వగ్రినారసాయైనమః । మాతృకావత్యైనమః। ఉదర్కస్థాయైనమః। చణ్డహాసాయైనమః । మహారవాయైనమః । మహావీరాయైనమః । మహాశూరాయైనమః । మహాలాపాయైనమః । రథస్థితాయైనమః । బహ్నిపత్ప్రి

యాయనమః । తన్వ్యైనమః । బ్రహ్మపత్రాయనమః । చతుర్భుజాయనమః । నాదప్రియాయనమః । నాదలుబ్ధాయనమః । అధ్వరామృతజీవిన్యైనమః । అమృతాయనమః । అమృతపాన్దేష్టాయనమః । సిన్ధుపాయనమః । పాత్రిశాలిన్యైనమః । చన్ద్రహాసధరాయనమః । శూరాయనమః । విరాధమరుమాలిన్యైనమః । శిరోధరాయనమః । పాత్రికరాయనమః । వరదాయనమః । పరవశిన్యైనమః । త్రిమూర్త్యైనమః । వేదజనన్యైనమః । వేదవిద్యాయనమః । తపోనిష్ఠ్యైనమః । తపోయుక్తాయనమః । తపోలక్ష్మ్యైనమః । తపస్విన్యైనమః । పరాత్పరాయనమః । లలితాయనమః । పాత్రికాయనమః । శాస్త్రాయనమః । రాజసాయనమః । రక్తదన్తికాయనమః । ఏకలాయనమః । రేణుతనయాయనమః । కామాక్ష్యైనమః । సత్పరాయణాయనమః । ఇన్ద్ర్యైనమః । మాహేశ్వర్యైనమః । బ్రాహ్మ్యైనమః । వైష్ణవ్యైనమః । బడబానలాయనమః । కౌబేర్యైనమః । ధనదాయనమః । యామ్యైనమః । ఆగ్నేయాయనమః । వాయుతన్వ్యైనమః । నిశాయనమః । ఈశాన్యైనమః । నైఋత్యైనమః । సౌమ్యాయనమః । మాహేన్ద్ర్యైనమః । వారుణ్యైనమః । సమాయనమః । సర్వర్షిపూజనీయాఙ్ఘ్ర్యైనమః । సర్వయన్త్రాధిదేవతాయనమః । సర్వాభీష్టప్రదాయనమః । సవార్థాయనమః । నవపల్లవభాయనమః । భిల్లవేషధరాయనమః । భిల్లబర్బరాయనమః । అలకమణ్డితాయనమః । భృఙ్గివాదసరసాయనమః । గుఞ్జాహారవిభూషణాయనమః । శ్రీమహాదేవ్యైనమః । శ్రీబాలాత్రిపురసున్దరీ స్వరూప శ్రీవాసవామ్బాయనమః । శ్రీకన్యకాయనమః । అనియష్టోత్తర శతనామార్చనచేసి, నానావిధ పరిమళ పత్రి పుష్పాణి సమర్పయామి ॥ అని యుచ్చరించి పత్రిపుష్పములను సమర్పించి, కాలాగరు ప్రభృతిభిః కల్పితంసుమనోహరమ్ । కల్యాణీకమనీయేద్ధం ధూపందాస్యామి తేశివే ॥ అని ధూపమునర్పించి, కార్పాసవర్తికాయుక్తం కామధేనుఘృతోజ్వలమ్ ॥ లోకప్రకాశకందేవి దీపందర్శయకన్యకే ॥ అని దీపదర్శనముచేయించి అన్నంపాయసభక్ష్యభోజ్యమధురం రమ్భాఫలైరన్వితం । నానావ్యఞ్జనసంయుతం సపిపీతం సౌవర్ణపాత్రేస్థితమ్ । దుగ్ధంచాపి మధుప్రియాఢ్య

త రథి స్వచ్ఛోదకం వాసితం । శ్రీసర్వేశ్వరి కన్యకే ప్రీతమిదం స్వాపోశ నంముంజ్యతామ్ ॥ అని నైవేద్యము సమర్పించి, ఉత్తరా పోశనం దేవి గృహీత్వా లోకనాయకే । హస్తప్రక్షాళనాదీం స్త్వం కురుకన్యా మహేశ్వరీ ॥ అని యుత్తరాపోశనమును, హస్తప్రక్షాళనాదులను జేయించి, ముక్తాచూర్ణంచ కర్పూరం క్రముకై ర్నాగదళైర్యుతమ్ । ఏలాదివాసితం తత్పరమేశ్వరి తేర్పయామి తాంబూలమ్ ॥ అని తాంబూలము సమర్పించి, కర్పూరదీపం కపిలాజ్యపూతం కార్పాసవర్త్యా పరికల్పితంచ। మనోహరం మంజుల హేమపాత్రే నిక్షిప్య కన్యే తవదర్శయామి ॥ అని నీరాజనము నర్పించి మహాలక్ష్మీ మాహేశ్వరీ శారదా భువనేశ్వరీ । ఇదత్తసౌభాగ్యమాయుః పుత్రాదదాతు తే॥ అనియుత్తరనీరాజనము సమర్పించి, కరవీరైర్జాజికుసుమైశ్చమ్పకైర్వకుళైస్శుభైః । శతపత్రైశ్చ పున్నాగైర్మంత్రపుష్పం దదామి తే ॥ అని మంత్రపుష్పమును సమర్పించి, పదేపదే మహాపుణ్యం పాపఘ్నంచ పదేపదే । పదేపదే శిభాగ్యంచ ప్రదక్షిణముదాహృతం ॥ అని ప్రదక్షిణముచేసి, నమోనమస్తే దేవేశీ నమోవాసవకన్యకే । కీర్తికన్యే మహాదేవి నమస్తే జగదీశ్వరీ ॥ అని నమస్కారముచేసి, మయాకృతాని పాపాని గణనారహితానిచ । కృపయా వీక్ష్య తే దృష్ట్యా పాహివాసవ కన్యకే ॥ అని క్షమార్పణచేసి, శ్రీకన్యకా పరమేశ్వరిని నుతించుచుఁ, బటగృహమున నిద్రాహార రహితుఁడై దేవీ మంత్రమును జపించుకొనుచు నుండెను.

—(వైశ్యబాలురు గయాశ్రాద్ధాదులు జరిపించుట. )—

అనంతరము వైశ్యులు తమతమ పితరులకు ౧౧ వ దినమున నిపాపాంజల్యాది క్రియలు సలిపి, విప్రులకును విప్రకన్యలకును, సువాసినులకును బసపుగుంకుమల వస్త్రములనిచ్చి, గురువందన మాచరించి, బంధుమిత్ర సమేతులై గయా శ్రాద్ధాదుల జరిపింపఁ దీర్ఘయాత్ర బైలువెడలి ప్రతిదినము ౧౦౦౦ బ్రాహ్మణ్యమునకు నన్న ప్రదానము చేయుచు, భాస్కరాచార్యులవలన ననేకపుణ్యకథలను వినుచుఁ బ్రయాగకరిగి, యచ్చటి మహాత్మ్యములను విని యుక్తదానములాచరించి, కుంభోత్సవ వాసి శివరాత్రి వ్రతనిమిత్తము కాశికింబోయి, మహా

పాపవినాశినియగు గంగయందు స్నానమాడి విశ్వనాథాదులను దర్శించి శివరాత్రిదినమున నిద్రాహార రహితులై భాస్కరాచార్యుల వలన బంచాక్షరీ మంత్రోపదిష్టులై యారాత్రి యంతయు నా మంత్రమును జపించుచుండిరి. ఆ మఱునాఁడు పారణచేసి, యది మొదలనేక సత్కథల వినుచు నేకమాస పర్యంత మాపుణ్యక్షేత్రమునందు నివసించి పిమ్మట గయాక్షేత్రమునకు వచ్చి యచట స్వస్వపితృ ప్రీత్యర్థము యథాశాస్త్రముగాఁ బిండప్రదానాది క్రియ లాచరించిరి. పితరులు నిత్యానందభరితులై స్వస్వరూపములతోఁ బ్రత్యక్షులై యా పిండంబులఁగైకొని, తాము మహాదేవి యనుగ్రహము వలనఁ గైలాసవాసముచేయుచు నిత్యానంద భరితులమై యున్నామని చెప్పి మీరు పుత్ర పౌత్రాభివృద్ధి గలిగి మహదైశ్వర్య సంపన్నులరుగా నుందురు గాతయని దీవించి యంతర్హితులైరి. అనంతరము దేవి ప్రసన్నయై, యాబాలనగరు లర్పించిన దండప్రణామాది వందనముల నంగీకరించి, ప్రాంజలులైయుండు తన భ్రాతలను జూచి మీరు చేసిన సత్క్రియలవలన మీ పితరులు తృప్తిఁబొందిరి. పూర్వము సమాధియను వైశ్యుడు శ్రీ గౌరీదేవిని బూజించిన రీతిని మీరిది మొదలు భాస్కరాచార్యోపదిష్ట ప్రకారంబున నన్నుఁ బ్రత్యహము పూజించి, ధన కనక వస్తు వాహన సమృద్ధియుఁ బుత్ర పౌత్రాభి వృద్ధియుఁ గలిగి సుఖింతురు గాకయని యనుగ్రహించెను. పిదప నా బాలనగరు లాదేవి నవలోకించి యమ్మా యేడహోరాత్రములు నీవు మాపట్టణమందు బ్రత్యక్షమయి యుండవలయునని వేఁడఁగా నట్లనే చేయుదునని యనుగ్రహించి భాస్కరాచార్యుల నెల్లప్పుడు మిక్కిలి భక్తితోఁ బూజించుచుండ వలయునని చెప్పి, యంతర్ధానమాయెను. అంత నావైశ్యులందఱు సంతోషించి యాదేవికి నమస్కారము లొనర్చి, పుండరీక మహాముని శ్రేష్ఠుని సేవించి యతని వలనఁ బితృశ్రాద్ధవిషయిక విధుల నితిహాసముల విని, పితృక్రియలను ముగించి యనేక లింగప్రతిష్ఠలను జేసి, కాశీతీర్థ మెత్తించుకొని యా క్షేత్రము విడిచి జగన్నాథ మార్గమున వచ్చి, రాజమహేంద్రవరము చేరి యచ్చటఁ బ్రాహ్మణోపవిష్టులై తమరాక నెఱుగు

చూచు విష్ణువర్ధన భూపాలపుత్రునిఁగని యాదిన మచట నివసించి మ ఱునాడు రాజపుత్రుఁడు తమ వెంబడిరాఁగాఁ బెనుగొండ నగరముచే రి నగరేశ్వర జనార్దనులను దర్శించి బ్రాహ్మణ సంతర్పణాదులను జరిపించిరి.

—(*) గాలవ పిప్పలాది ఋషులు ప్రత్యక్షమగుట (*)—

అప్పుడు రాజపుత్రుఁడు దేవీస్మరణచేయుచు, వైశ్యులగృహ మందు మహా సంతోషాంతరంగుఁడై, యా రాత్రి గడిపెను. మఱు నాఁడు వైశ్యులును రాజపుత్రుఁడును మంత్రి పురోహితులు మొదల గువారితో నగరేశ్వర మంటపమునకు వచ్చిరి. అప్పుడు వైశ్యులను రాజపుత్రుఁడు చూచి, మాతండ్రి చేసిన యపరాధనములను క్షమిం చి, నారాజ్యములో నర్ధరాజ్యము దేవీ ప్రసాదార్థముగై కొని,పరిపాలిం పుఁడని వేఁడఁగా నా వైశ్యులు వాణిజ్యముచేత జీవించు మాకు రా జ్యపాలన మెట్లుతగును గనుక మాకు రాజ్యమక్కఱ లేదనిరి. అది విని యారాజపుత్రుఁడ సంతృప్తుఁడై, యీ మంటపమునందు నేను దేహ త్యాగము చేసెదనని నిశ్చయించెను. అంత వైశ్యులు మిగుల భీతులై యుండఁగా, నచటికి గాలవ, పిప్పల, మందపాల, సుతీక్ష్ణ, గర్గ, గోభి ల, జాబాలి, గౌతమాది మహామునులు తమతమ శిష్యగణములతో విచ్చేసి రాజపుత్ర వైశ్యులచేఁ జేయఁబడిన యతిథి సత్కారముల నం గీకరించి, రాజపుత్రునింగని, నీతండ్రి మరణమునకై దుఃఖింపకుమని కొన్ని నీతివాక్యములు నితిహాసములుం జెప్పి యాతనిఁ దృప్తినొందించి దేవ్యనుగ్రహమును బొంది రాజ్యాభిషిక్తుఁడవు గమ్మని యాజ్ఞాపించి వై శ్యులను జూచి యీ రాజు సమర్పించు నర్ధరాజ్యమును దేవి కర్పిం పుఁడని చెప్పిన వియూపాతు శ్రేష్ఠి యా వాక్కులను విని తులాదండ ములచేత జీవించు మాకు రాజద్రవ్య మక్కఱ లేక యే మాస్వధర్మా ర్జిత ద్రవ్యముచేత నాదేవిని బూజించుచున్నారమని చెప్పెను. అంత నా రాజపుత్రుఁడు కోపావేశుఁడై మీరు నాప్రార్థన నంగీక రింపరేని, యీక్షణంబ ప్రాణములు విడిచెదనని సత్య ప్రతిజ్ఞచేసెను. ఈ మాట లను వైశ్యవరులు విని మహా వ్యాకుల చిత్తులై దేవిఁగూర్చిప్రార్థించిరి.

—(౦) దేవీ ప్రసన్నము (౦)—

అప్పుడా మహాదేవి తన భక్తులైన వైశ్యబాలుర ప్రార్థనలకు సంతోషించి కిరీట, కుండల, హార, కేయూర, మణి, మేఖలాది సర్వాభరణ భూషితురాలును, విశాలనేత్రములు కలదియును, బూర్ణచంద్రునితో సమానమైన ముఖబింబము గలదియును వభయ హస్తములచే నొప్పు నూర్ధ్వ బాహుద్వయమును బద్మకేరములను ధరించిన యధోబాహుద్వయమును నగు చతుర్భుజములు గలదియును, బింబోష్ఠియును నై చిఱునవ్వుతో ప్రత్యక్షమాయెను.

—(౦) దేవీ ప్రమాణము (౦)—

శ్లో॥ విమానస్థాం మహాదేవీం సర్వాభరణ భూషితామ్ । చతుర్భుజాం విశాలాక్షీం రాకాచంద్రనిభాననామ్ ॥ వరాభయకరస్తోర్ధ్వ బాహుద్వయ విరాజితామ్ । అధోబాహుద్వయాభ్యాంతుధృతపద్మశుకీంతథా ॥ సుస్మితాంచారువదనాం బింబోష్ఠీంచారు కుండలామ్ । కిరీటహార కేయూర మణిమేఖలభూషితామ్ । ఋషయోరాజతనయో వద్భుర్వైశ్యాసత్తమాః.

—(౦) దేవీస్తుతి. (౦)—

అట్లు ప్రత్యక్షమైన యాదేవిని వైశ్యవరులును, విష్ణువర్ధనభూపాల పుత్రుండును నచట వచ్చియుండు ఋషులును దర్శించి.

శ్లోకములు.

౧. భద్రరూపి నమస్తేస్తు భక్తానాం భద్రదాయిని,
మహాకాళినమస్తేస్తు అసురాణాంచమర్దినీ.

౨. నారాయణి నమస్తేస్తు భక్తవాంఛిత దాయిని
మాయాయైతేనమస్తేస్తు సర్వమోద విధాయిని.

౩ వాసవ్యైతేనమస్తేస్తు వసోర్విష్ణోస్సహోదరి,
దుర్గాయైతేనమస్తేస్తు సర్వదుఃఖవినాశిని.

౪. విజయేతేనమస్తేస్తు భక్తానాంవిజయావహే,
వైష్ణవ్యైతేనమస్తేస్తు విష్ణుభక్తాకృతాలయే.

౫. చండికాయై నమస్తేస్తు శుమ్భాసురవినాశిని.

కృష్ణాయైతే నమస్తేస్తు కృష్ణస్యచ సహోదరీ.
౭. కన్యకాయై నమస్తేస్తు కామకోష్ఠస్వరూపిణీ.
అమ్బికాయై నమస్తేస్తు శజ్కరార్ధశరీరిణీ.
౮. నమస్తే పరమేశ్వర్యై పరాప్రకృతిరూపిణీః
శారదాయై నమస్తేస్తుబ్రహ్మశక్త్యై నమోనమః.

అనిస్తుతియించి. యామహాదేవికి విధివద్వందనాదు లాచరించిరి. అంత ఋషులీరాజుతండ్రి చేసిన యపరాధములను మన్నించి, నీపాదకమలములను సేవించు వీనియెడఁగరుణించి రక్షింపుమని దేవిని వేఁడఁగా నామహాదేవి సంతోషించి, యట్లగుఁగాకయని యనుగ్రహించెను. అనంతర మారాజపుత్రుఁడు లేచి, నిలిచి, యంజలిబద్ధుఁడై. యోదేవీ నేనుసమర్పించు రాజ్యమును స్వీకరించి, నన్ను నీభక్తునిఁగాఁజేసి, పుత్రపౌత్రి సంపద్వైభవములు గలిగియుండునట్లనుగ్రహింప వలయునని యు, మృతుఁడైన నాతండ్రిని జూపవలయుననియు వేఁడెను.

—( శ్రీకన్యకాదేవి రాజపుత్రునకు వరములొసంగుట. )—

ఇట్లు వేఁడుచున్న రాజపుత్రుని ప్రార్థన నాదేవి యంగీకరించి యతండు కోరిన వరంబులొసంగి, మృతుఁడైన విష్ణువర్ధన భూపాలునిం జూపెను. అప్పుడా రాజపుత్రుఁడు దివ్యాంబరములను ధరించి, దివ్య భూషణాలంకృతుఁడై దివ్య గంధాను లేపనము చేసి, దివ్య విమానారూఢుఁడై యుండు తనతండ్రికి నమస్కరించి నిలిచెను. అంతనా విష్ణువర్ధనరాజు తనపుత్రునింజూచి సంతోషచిత్తుఁడై, దేవ్యగ్రహామ గోరు నీ వలన నేను ధన్యుఁడనైతిని. నీవు సత్యవ్రతముగల యీ వైశ్యులను రాజ్యాది సుఖములచేత సంతృప్తులం జేయుము. ఆదిశక్తియనీ ఋష్యాదులచే స్తుతింపఁబడు నీ మహాదేవిన్ని భ్రీత్యహము పూజించి,మిగుల శ్రేయమును బొందుమనిచెప్పి, యా దేవికి నంజలిచేయుచు,నిలుచుండెను. పిదప నాదేవి తనతమ్ములగు విరూపాక్షశ్రేష్ఠి మొదలుగాఁగల బాలనగరులనుజూచి, యీరాజొసంగు వస్తువుల నెల్లనంగీకరించి నూఱు సంవత్సరముల పర్యంతము జీవించి యుండుఁడనియు, రాజునా ప్రీతికైయిచ్చు రాజ్యమును బ్రాహ్మణులకు దానముచేసి, శాశ్వతమై

న పదమును బొందుడనియు నాజ్ఞాపించెను. వైశ్యులు నట్లుచేసెదమని యొప్పుకొనిరి. అంత నారాజ పుత్రుడు మహాసంతుష్టాంతరంగుడై విరూపాక్ష శ్రేష్ఠింజూచి, యతిగంభీరముతో రాజ్యాభిషిక్తుడవుగమ్మని వేడగా, నావిరూపాక్ష శ్రేష్ఠి సకలరాజ్యములను భరింపశక్తిగల యీ మహాదేవికిఁ బట్టాభిషేకము చేయఁదగినదని చెప్పఁగా నందఱును సంతోషించిరి.

—( దేవీ పట్టాభిషేకము. )—

అంత భాస్కరాచార్యులును ధామ్యుడును, యోచించి, పట్టాభిషేకమునకు వలయు వస్తువులను సిద్ధపఱచి యేడహోరాత్రముల నిర్విఘ్నముగా దేవికిఁ బట్టాభిషేకముచేసి, యువరాజ్య పట్టాభిషేకమును విరూపాక్ష శ్రేష్ఠికిఁజేసి. యత్యానంద భరితులై యుండిరి అంతనా పట్టాభిషేక మహోత్సవమునకు వచ్చియుండిన ఋష్యాదులు మిగులసంతోషించి, తమతమ యాశ్రమములకుఁ బోయిరి. అంత మహాదేవి విరూపాక్ష శ్రేష్ఠి మొదలుగాఁగల వైశ్యులంజూచి యిట్లనియె.

—{ శ్రీకన్యకాదేవి బాలనగరులకులోక ధర్మములు మున్నగువాని దెలుపుట. }—

కర్మరూపములగు ధర్మాధర్మములచేతఁ బుణ్యపాపంబులు సిద్ధించుచున్నవి. పుణ్యముచేతఁ బుణ్యలోకమును, పాపముచేత నరకమును సంప్రాప్తమగుచున్నది గాన, నెల్లవిధములచేత ధర్మముల నాచరింప వలయును.

బ్రహ్మ విష్ణురుద్ర పంచభూత యజ్ఞాదులు వేదములవలనఁబ్రీతి పొందింపఁబడుచున్నవి. అట్టివేదములు బ్రహ్మముఖమందుఁ బుట్టినబ్రాహ్మణుల యధీనములైయున్నవి. గాన నాబ్రాహ్మణులు సర్వపూజ్యులువారు తృప్తినొందిన, సర్వలోకములు తృప్తినొందును గనుక, శుభాశుభ కార్యములయందు బ్రాహ్మణప్రీతి చేయవలయును.

కలియుగమునఁ గ్రతువులు- తీర్థయాత్రలు- జపములు- వ్రతములు- మున్నగువాని, విధ్యుక్తముగా జరిపించుట యశక్యము- గాన

యథోచితదానముచే నాఫలములు పొందవచ్చును. గాన మీరట్టిదానముచే, భాస్కరాచార్యులు మొదలుగాఁగల ద్విజులను దృప్తిపొందింపవలయును.

అయాయుగములకుఁ దగినట్లు ఋషులచే విధింపఁబడిన కులధర్మములను దప్పక మీరాచరింపవలయుచు.

భాస్కరాచార్యుల యనుమతి ననుసరించి సర్వ శుభాశుభములను జరిపింపవలయును.

త్రైవర్ణికులగు మీరు గోగర్భమందు వాసముచేసి, గోకర్ణము నుండి యుద్భవిల్లి, మాతయగు గోవును బూజించుచుండినందున, గోమటులను పేరుగలిగి సదా గోపాలనము చేసెదరు.

పాత్రికృతములగు గోత్రములను నాయా గోత్రజుల ఋషులను వర్జనీయవస్తువులను తటాకములను దపస్స్థానములను జపక్షేత్రాదీప సంఖ్యలను నిష్టదేవతలను, దానములను జెప్పెదను. అవి మీకులవృద్ధులగు పూర్వులచే నాచరింపఁబడినవి గాన, మీకుఁ దెలియఁదగినవి.

వీని మీరాసక్తితోవిని, సకల సౌఖ్యముల ననుభవింపుఁడని గోత్రములను జెప్పఁదొడంగెను. ఎట్లనఁగా:—

## గోత్రప్రవరకు ప్రమాణములు.

---

### ద్వావింశేయ గోత్రాణి.

---

ఉద్వాహకుల.
రవిశిష్టకుల.

౧ ఉద్వాహ రవిశిష్టాఖ్యగోత్రజానామ్మహావిశా
మ్। ఋషిః పరిభాతో ముక్తానాం దానంపుష్ప
మ్బధిస్సరః ॥ పినాకినీతటే కోటిదశదివ్యజపఃప
రం। క్షేత్రాణ్యశీతి దీపాస్స్యుష్షష్టిసఙ్ఖ్యాభువిస్మృ
తః। కుసుమేశో మహాదేవో వర్జ్యంస్యాద్వృద్ధవారకమ్। కుసుమ్భకం
భువిప్రోక్తం వివాహే వర్జయేత్సదా॥ ౧

మనస్యకుల.
మానాభకుల.

౨ శ్రీశైలేన్యర్బుదజపో మాణ్డవ్యోమునిసత్త
మః। మహాదానప్రదాతౄణాం దక్షేశః కులదై
వతమ్। దక్షాఖ్యసరసీపుణ్యా క్షేత్రాణిత్వేకవిం
శతిః। దీపాస్తుషట్పఞ్చాశన్మాంజిష్ఠవసనానిచ।
వర్జ్యాదారుహరిద్రాస్యాన్మన్యకాహ్వాయగోత్రిణామ్। మానాభకుల
గోత్రాణాం సమ్బన్ధోనేతరేతరమ్ ॥ ౨

అనుపకుల.
అనుపాలకుల.

3 కనకాద్రావలక్షజపోఽగస్త్యో సన్మునిసత్తమః
సర్వతీర్థాఖ్యసరసీ సకలేశస్తుదైవతమ్॥ అఖ
ణ్డాపేకపఞ్చాశ క్షేత్రాణిదశసప్తచ। దాని
యంమహిషీప్రోక్తాత్త్యాజ్యం నిష్పావధా
న్యకమ్॥ అనుపాఖ్యకులగోత్రాణామనుపాలాహ్వయగోత్రిణామ్। పర
స్పరంచసమ్బన్ధస్త్యాజ్యంవైవాహికంమతం॥ ... ... ... ౩

ఇంచుపకుల.
ఘూంటకుల.

౪ దీపాస్త్రింశద్గోపనామక ఋషిగక్షేత్రాణిష
డ్వింశతి। స్యాద్దారక్రముకంచకైరవసుమం
వర్జ్యంప్రసిద్ధంసరః। చన్ద్రాఖ్యంశతలక్షముత్తమ
జపగపుణ్యేన్ద్రకీలేనగే। భూయాదించుప ఘూ
ణ్టకాఖ్యజనుషాం దేవశ్చకీర్తీశ్వరః ॥ ఇంచుపాహ్వాయ గోత్రాణాం

సైంహ్రకాహ్వయ గోత్రిణాం । వివాహశ్చ పరివర్జస్స్యాద్గోదానం ఋషి
సమ్మతేః ... ... ... ౪

౫ సహ్యాచలే కోటిజపుగ పూర్ణిమాపస్తు సన్మునిః ।
తుర్యాటకుల. తులశిష్ట — తుర్యాటకుల గోత్రాణాం తులశిష్టాఖ్య గోత్రిణాం
విజయేశో బర్బరాఖ్య స్సరోదానేగజో మతః । క్షే
త్రాణి సప్తషష్ట్యాశ దక్షిణానవసప్తతిః ॥ ద్రోణశాకంభ వేత్త్యాజ్యాం ద్వ
యోరపిచ గోత్రిణోః । ఏతయోస్తుద్వ యోర్నైవ వివాహోయుజ్యతే
విశోః ॥ ... ... ... ... ౫

౬ సిన్ధుప్రదేశే లక్షజపశ్రీశ్రీలాఖ్యకులగోత్రిణాం । శ్రీరంగ
శ్రీలకుల శ్రీరంగకుల — కులగోత్రాణాం సైన్ధవందానముచ్యతే ॥ శివోదే
వోజ్జ్వనోనామసరః ప్రోక్తమ్మునిపిభిః । దీపా
త్రింశచ్చ కైదార్యం చత్వారింశ చ్చసఙ్ఖ్యయా ॥ తేషాంవర్జ్యంసూక్ష్మ
శాకంప్రాస్యైక్షైరణ్డతైలకం । శ్రీవత్సాఖ్య మునివరో ద్వయోరపిచ గో
త్రిణోః ॥ ఏతయోర్నైవవైవాహ్యం పరస్పరముదీరితం ॥ ౬

౭ కృష్ణవేణ్యాం కోటిజప స్స్వర్ణదానం ప్రశస్యతే । ప
ఘంటాస్థూలకుల గణపకుల — ల్లవాఖ్యో మహామాని ర్గణేశగ కులదైవతం ॥ పు
ష్టినామసరో దీపావింశతి క్షేత్ర సప్తతిః । రమ్భా
ఫలం పరిత్యాజ్యంఘంటాస్థూలాఖ్య గోత్రిణాం ॥ తథా గణపకులాఖ్య
స్యపల్లవోమునిరీరితః । తేషా మన్యోన్య సమ్బన్ధో వివాహే నప్రచోది
తః ॥ ... ... ... ... ౭

కావేర్యా మర్బుదజపగ కన్దర్పోమునిరుచ్యతే । కా
౮ మేశ్వరః కామసరో దాసీదానం ప్రశస్యతే ॥
శ్లేష్మకుండలకుల. చరకుల — క్షేత్రాణ్యక్షణ్ణాగపఞ్చాశచ్ఛిగన్ధో మాతులుఙ్గకం
శ్లేష్మకుణ్డల గోత్రాణాం వర్జ్యం చరకుల గోత్రి
ణాం ॥ త్యాజ్యో వివాసమ్బన్ధో సర్వదా మునిసమ్మతేః ॥ ౮

౯ హిమాచలే కోటిజపో మునిస్స్యాద్దాల్భ్యనామ
ఫలకకుల పటనకుల — కః । ఫలదానం విశిష్టంస్యా ద్వ్యాసేశః కులదైవతం
గన్ధసార సరగపుణ్యాం చత్వారింశ దక్షండకాః । క్షే

త్రాణిపఞ్చషష్ట్యాశ్చ వర్జ్యం క్షీరఫలంభవేత్ ॥ పలకాహ్వాయగోత్రాణాం పటనాహ్వాయగోత్రిణాంఇతరేతరసమ్బన్ధో వివాహోనప్రకీర్తితః ॥ ౯

౧౦ దేశిష్ట దయశిష్టాఖ్యగోత్రిణాం దేవలోఽతిమునిః ॥ గవాందానం ధర్మసరో ధనదేశ్వర దేవతం । గ

దేశిష్ట / దయశిష్ట — జ్ఞాతీరే లక్షజప శ్చత్వారింశచ్చ దీపికాః । క్షేత్రాణివింశతి ర్వర్జ్యా దేవదారుచ దాడిమం॥

ప్రవరైక్యా ద్వివాహస్తు సమ్మతోనభవేదిహ । ౧౦

౧౧ నాగేశఃకులదైవతం గజఘటాదానాని నాగామ్బుధిః కాసార స్త్వణపీఠమర్కకుసుమం వేత్రం భవేత్కేతకీ । వర్జ్యం త్రింశదపిప్రదీపకళికా క్షేత్రాణిషట్సప్తతిః కైలాసే నియుతంజ

మధునకుల / మధ్యకుల

పస్తుముదితో మైత్రేయసద్గోత్రిణాం ॥ మధునాఖ్యకులస్యైవ ఋషిర్మైత్రేయఇష్యతే । జ్యేష్ఠస్యనేష్యతే నాగచతుర్థ్యాం తిలపిష్టకం । మధునాహ్వాయగోత్రాణాం మధ్యాఖ్యకులగోత్రిణాం । వివాహోనైవకార్య స్స్యాన్మునిభిస్సముదీరితం ॥ ౧౧

౧౨ విన్ధ్యాచలే లక్షజపః ప్రకుర్వతాంభూమిప్రదానం సనకోమునిస్స్మృతః । వర్ణేశ్వరో రత్నసర శ్చతుర్నవ క్షేత్రాణిదీపాస్సనకా ఖ్యగోత్రిణాం

సనకుల / శౌనకుల

సనకాహ్వాయగోత్రాణాం శౌనకాహ్వాయగోత్రిణాం । వర్జ్యంకోశఫలంజ్ఞేయం వివాహోన పరస్పరం ౧౨

౧౩ హేమాచలే కోటిజపం నారదోమునిరుచ్యతే నిత్యంజలప్రదాత్యా ణాముత్తరేశస్తుదైవతం ॥ ఉత్తరాబ్ధిసరోనామ క్షేత్రాణినవసప్తచ । పఞ్చత్రింశత్తుదీపాస్స్యు రపామార్గంతువర్జితం । ఉత

ఉతకాల / ఉతశిష్ట

కాలోతశిష్టాఖ్య గోత్రయోర్నకరగ్రహః ॥ ౧౩

౧౪ గఙ్గాసాగరయోస్సఙ్గే దశలక్షజపఃపరం । కన్వాఖ్యమునిశిష్యాణాం ద్రాక్షేశఃకులదైవతం।

కౌటకుల } తామ్రామ్బుధిసరో నామ క్షేత్రాకర్ణాస్తువింశతిః।
కర్ణాటకుల } సదక్షిణాంచోష్ట్రదానం వర్జ్యాస్స్యుర్ధవలాభకాః
కౌటకర్ణాటకాఖ్యాక గోత్రిణోర్న కరగ్రహః॥ ౧౪

నర్మదాయాంకోటిజపో జపస్సుర్నామమహా
౧౫ మునిః । మతంగజప్రదాత్యానాం త్రిపురేశస్తు
చన్నకుల } దైవతం। వనమాలాహ్వయసరో క్షేత్రదీపాస్త్ర
జానుకుల } యోదశ । వర్జ్యంకర్పూర మమృతఫలమ్మునిభిరీ
రితం ॥ చన్నాహ్వయేజానుకులే జాతానాం గోత్రిణాంవిశాం। పరస్ప
రంపరిణయం నైవకుర్యాద్విశాంవరైః॥ ౧౫

సరయ్వాంచజపఃకోటి స్సుతీక్ష్ణస్తుమహాము
౧౬ నిః। జపాసుమంచనిష్పావం వర్జ్యాస్స్యుర్మునిస
దంతుకుల } మ్మతేః ॥ ధర్మేశ్వరోధర్మసరో క్షేత్రదీపా శ్శత
దొంతకుల } ద్వయం । దంతాఖ్యకులగోత్రాణాం దొంతాఖ్య
కులగోత్రిణాం। కన్యాప్రదానమేతేషాం వివాహేన పరస్పరమ్ ౧౬

—(త్ర్యార్షేయగోత్రాణి)—

౧౭ } మార్గల్యో మునిరీశ్వరస్తుజగతి స్యాన్నాథ వో
మునికుల } దీపికా - త్రింశత్పన్త తివర్జితోమృగమదః క్షేత్రా
మూలకుల } ణిషడ్వింశతిః। దానేయో మహిష స్సరశ్చమల
నాభీలస } యామ్బోధిఃపటీరాచలే రమ్యేలక్షశతంజపఃకృ
తవతాం మున్యాఖ్య సద్గోత్రిణామ్ ॥ మునికులగోత్రజవైశ్యా మూల
కులాఖ్యకగోత్రసమ్భూతాః। నాభీలసాఖ్యగోత్రాస్సమ్బన్ధంనైవకార్య
మార్షమతేః ॥ ఏక ప్రవరగోత్రాణా మేతేషాంచ త్రిగోత్రిణామ్ । క
స్తూరీ శ్వేతబృహతీ శిగ్రుశ్చ పరివర్జయేత్ ॥ ౧

౧౮ } చత్వారింశ దఖణ్డ దీపకళికా క్షేత్రాణిష ట్త్రిం
హారశిష్ట } శతి - ర్దేవస్స్యాద్వృషభేశ్వరస్తు సరసీనర్మాహ్వ
యరశిష్ట } యకీర్తితా । రక్తంశాకము పేక్షు మేవశకటీదానం
యరసకుల } సరయ్వాస్తటే - లక్షంస్యాద్ధరశిష్టగోత్రజను
షాం ఘోరానుపాంతోజపః ॥ హారశిష్టాఖ్యగోత్రాణాం యరశిష్టాఖ్య

గోత్రిణామ్ । యరసాహ్వాయగోత్రాణామాత్రేయాఖ్యో మహామునిః । రక్తశాకంచ వేత్రంచ తిమూలంచ యథాక్రమమ్ । వర్జ్యాహ్యుక్తాశ్చ బుహ్మైక్యాద్వివాహోనప్రచోదితః ॥ ౨

౧౯ చంద్రకుల చంద్రశిష్ట చంద్రమూల — తోతాద్రిశృఙ్గమధ్యేతు జపగణ్కోటిగప్రకథ్యతే అఖణ్డాస్తు నవత్రింశ దశ్వదానం ప్రశస్యతే ॥ చత్వారింశచ్చైవ సప్తక్షేత్రాణిసుమహాత్మనాం । జతుకర్ణాఖ్యమానీశ శ్చన్ద్రాఖ్యకులగోత్రిణామ్ చన్ద్రశిష్టాఖ్యగోత్రాణాం చన్ద్రమూలాఖ్యగోత్రిణామ్ ॥ క్షీరేశ్వరో మహాదేవః పున్నాగసరఉచ్యతే ॥ శఙ్ఖశ్చయాపకం నిత్యం చన్దనంచాపివర్జితం ॥ ఏతత్త్రియాణామన్యోన్యం నైవవైవాహికాక్రియా ॥ 3

౨౦ ప్రోలేఖకుల. పుంసిమాసులకుల ప్రోలిశిష్ట — మథ్యార్జునేకోటిజపః పౌణ్డ్రికోనామ సన్మునిః ఆన్దోళికప్రదాత్మ్యాణాం ప్రోలేశఃకులదైవతం॥ భువనాప్తిసరోదీపా శ్చత్వారింశత్ప్రకీర్తితాః క్షేత్రాణితుత్రిషష్ఠ్యా శద్భల్లాతకఫలాన్యపి కుజ్కుమం సాఙ్కవంచైన వర్జ్యానితు యథాక్రమం ప్రోలేఖకులగోత్రాణాం పుంసిమాసుల గోత్రిణాం ॥ ప్రోలిశిష్టాఖ్యగోత్రాణాం వివాహంన పరస్పరం ॥ ... ... ౪

సింహాచలేకోటిజప స్సత్యకాఖ్యో మహామునిః

౨౧ చింత్యకుల చింతాలకుల చింతమశిష్ట — ప్రణవేశో మహాదేవ శ్చివామణి సరస్స్మృతః ॥ చిత్రవస్త్రప్రదాత్మ్యాణాం క్షేత్రాణినవవింశతిః । ద్వాత్రింశద్దీపికాఃప్రోక్తా వర్జ్యానితుయథాక్రమం । తిన్త్రిణీపర్ణపుష్పాణి భల్లాతకఫలంతథా । శృఙ్గబేరంచ సమ్బన్ధో వివాహేన పరస్పరం ॥ చింత్యాఖ్యకులగోత్రాణాం చింతాలాఖ్యాక గోత్రిణా । చింతశిష్టాఖ్యగోత్రాణాం సమ్భావనయశాలినాం ॥ ౫

౨౨ శ్రీశైలేన్యర్బుదజపోవాయువ్యోమునిరుచ్యతే । మహాషోడశదానాని రామేశఃకులదైవ

ప్రవంగకుల } తం ॥ రాజామ్బుధిసరఃపుణ్యాంచత్వారింశత్ప్రి
ప్రవకశిష్ట } దీపికాః । క్షేత్రాణిపఞ్చపఞ్చాశత్సర్షపాలజగ
ప్రవక్యాలకుల } న్ధికా । హంసకాసపరివర్జ్యాస్స్యుర్వ్రీ గ్గాఖ్య
కులగోత్రిణాం । ప్రవకశిష్టాఖ్యగోత్రాణాం ప్ర
క్యాలాహ్వాయగోత్రిణాం ॥ ప్రవరైక్యాద్వర్జనీయోవివాహోముని
సమ్మతేః॥ ... ... ... ... ౬

మలయాద్రాలక్షజపోవామదేవోమహామునిః ॥
౨౩ కుమ్భేశ్వరగకోనసరోక్షేత్రాఖణ్డాస్త్రిసప్తతిః ।
ఉపమన్యుకుల } పుణ్యాక్షేత్రేష్వన్నదానంపిప్పలీపరివర్జయేత్ ఉ
ఉపలాలకుల } పమన్యోర్భవానాంచ ఉపలాలాఖ్యగోత్రిణాం ॥
ఉపసకుల } ఉపసేననవైవాహ్యంసర్వర్షిగణసమ్మతం ॥ ౭

## —(చతురార్షేయగోత్రమ్)—

శ్రీశామ్భోనిధనామదివ్యసరసీ శ్రీశేశ్వరో దేవ
౨౪ తా ॥ ఖర్జూరంపరివర్జనీయమనిశం స్యుర్వింశతిర్దీ
ప్రౌఢశీల } పికాః త్రింశత్క్షేత్రగణాః పరాశరముని శ్శ్రీశైలశృఙ్గే
ప్రాక్బాలకుల } జపో । లక్షం దానవిధాఫలంచ విహితంస్యాత్ప్రౌఢ
ప్రాణశీలకుల } శీలాంసదా । ఏవంప్రాగ్బాలకాఖ్యానాంప్రాణశీలాఖ్య
కామధేనుకుల } గోత్రిణాం। కామధేన్వాఖ్య గోత్రాణాం ఋషిర్దీపా
హ్యానుక్రమాత్ ॥ కర్పూరం కేతకీపుష్పం లికుచం
వర్జితంభవేత్ । చతుర్ణాంగోత్రిణాంచైవ వివాహోనపరస్పరం॥ ౮



దశార్షేయ గోత్రమ్.

క్షేమవ్యాఘ్రనఖాని లోమశజమఫ్యర్హాని వ

౨౫
పునగోశీల.
గోశీల.
ఉత్తమగోశీల.
పల్లవగోశీల.
పటుగోశీల.
సత్యగోశీల.
భీమగోశీల.
శ్రీగోశీల.
నందిగోశీల.
సూర్యకుల.

ర్యాస్స్మృతా శ్చత్వారింశ దతిప్రశస్తకళికా దానే సువర్ణంమతం। పుష్పాఖ్యా సరసీవరశ్చ పృథివీశానోఽధిదేవోమహా । లక్షం పున్నశిలాఖ్యగోత్రజనుషాం మన్త్రాన శైలేజపః॥ పున్నశిల గోత్రజనుషాంక్షేత్రాణిత్రింశ దాహితఫలాని । కూటస్థఃపుల స్త్యజాత శ్చైతేషాం మునిరితి జగత్ప్రసిద్ధిః॥ గోశీలోత్తమగోశీలా పల్లవః పటుగోశిలః । సత్యగో భీమగోశీల శ్శ్రీగోశీల ఏవచ ॥ నన్దిగోశీల పునగో సూర్యో దశగణోభవేత్ । ఏతేషాందశ గోత్రాణాం । వివాహానపరస్పరం ॥ క్షేత్రాఖణ్డాస్స మావర్జ్యం దేవకాఞ్చనమేవచ । దానానిదశ గోత్రాణాం తుల్యాని మునిసమ్మతేః ॥ అంతర్వేదిస్థలే పుణ్యే దశకోటి జపఃపరం ।

దశార్షేయగోత్రే
దశమగోత్రం
సూర్యకులగోత్రం

శ్రీసూర్య కులగోత్రాణాం షట్త్రింశద్దీప మణ్డలం॥ క్షేత్రాణి పఞ్చషష్టిస్స్యాత్పౌలస్త్యో నామ సంయమిః । సువర్ణే శస్తు దైవంస్యా త్సువర్ణామ్బనిధిస్సరః ॥ శ్యామేతుస్సర్వదా వర్జ్యంస్వర్ణదానం ప్రశస్యతే । నవగోత్ర భవైర్వైశ్యైస్సూర్యాన్వతస్య కులోద్భవైః॥ సూర్యశిష్టాఖ్య గోత్రేణ త్యాజ్యావైవాహిక క్రమాః॥ ౧

ఏకార్షేయగోత్రాణి.

౨౬
గ్రంధిశిల.

షష్టిర్దీపలతాస్తు గౌతమఋషిః క్షేత్రా వళీ సజ్ఖ్యయా। పఞ్చాశ ద్విజయేశ్వరస్తు నిజయాంమ్బోధి స్తటాక స్స్మృతః వర్జ్యంస్యాద్భువి దేవకాఞ్చనసుమం దానంత్వ్రతంకీర్తితం కోటిర్గ్రన్థి శిలాఖ్య గోత్రజనుషాం సహ్యాద్రిశృంగేజపః॥ ౧

౨౭
బుధనకుల.

కనకాద్రా లక్షజపో భార్గవస్తుఋషీశ్వరః । బుధనాహ్వాయగోత్రాణాం గవాందానం ప్రశస్య

తే ॥ నాగేశో దైవతం ప్రోక్తం నాసికామ్బు నిధిస్సరః। ఏకోనాశీతిదీపా శ్చక్షేత్రాణినవసప్తచ॥ జమ్బీరంసర్వదావర్జ్యంమునిభిస్సముదీరితం॥౨

౨౮ వ్యాళకూలకుల. విమలాద్రౌ లక్షుజపో జైమిని స్తుమహా మునిః। వ్యాళకూలాఖ్య గోత్రాణామఖణ్డా ఏకవింశతిః॥ క్షేత్రాణిచ ద్విపఞ్చాశ ద్విమలేశస్తు దైవతం । నవనీతాఖ్యకాసారఃపూర్ణస్స్యాదుజ లైశ్శుభైః॥ ధాత్రీఫలంచవర్జ్యం స్యాద్దానంక్షౌమంచరాజితం ॥. ౩

౨౯ కోరటకుల. రత్నాచలేలక్షుజపో మతఙ్గాఖ్యో మహా మునిః । గజప్రదాయినాం నిత్యం కోరటాహ్వాయగోత్రిణాం ॥ కుమారేశో మహాదేవో ధరణీనామకంసరః । క్షేత్రాణిదీపాః పఞ్చాశ ద్వర్జ్యం కూష్మాండకంసదా ॥ ... ... ౪

౩౦ పెద్దిశెట్ట. జయవాట్యాం లక్షుజపో జయేశఃకులదైవతం ॥ ఋషిః ప్రీతిమనాఃప్రోక్తో మునిభి స్తత్వదర్శిభిః ॥ రాజామ్బుధిసరోదానే మహిషః పరికీర్తితః। అఖణ్డదీపాః పఞ్చాశత్క్షేత్రాణ్యప్యేకవింశతిః ॥ పెద్దిశెట్టాఖ్యగోత్రాణాం వర్జ్యం స్యాత్పూష్మముద్గరాః ॥ ... ... ... ... ౫

౩౧ పేరుశెట్ట. గఙ్గాతటేర్బుదజపో దైవతంపాణికేశ్వరః। సర్వనామసరోదానే ముక్తాఫలమితీరితం॥ క్షేత్రాణి సుపవిత్రాణి విఖ్యాతానిచవింశతిః। అఖణ్డదీపాఃపఞ్చాశ ద్దావికందధివర్జితం ॥ పేరుశెట్టాఖ్య గోత్రాణాం బృహదశ్వోమహామునిః॥౬

౩౨ ఇనకోల. సౌన్దర్యాఖ్య మహామునిస్తురగదః విశ్వేశ్వరోదేవతా । వర్జ్యం కోకనదం భవేదపిచతుఃపఞ్చాశదిష్టాస్సదా । దీపా వీరసముద్రనామక సరః కోటిర్జప సఙ్ఖ్యయా । హేమాద్రావినకోల గోత్రజనుషాం క్షేత్రాణిషష్టిర్భువి ॥ ౭

౩౩ సూరశెట్ట. నర్మదాయాం కోటిజపస్సువర్ణేశస్తుదైవతం । ఋషి స్సనత్కుమారాఖ్య స్స్వర్ణదానం ప్రశస్యతే ॥ సూరశెట్టాఖ్యగోత్రాణాం దీపాస్స్యుః పఞ్చవింశతిః। క్షేత్రాణిసప్తతిశ్శృఙ్గి సరోవర్జ్యంతు బిమ్బకం ॥ ... ... ౮

౩౮ } బదరీకాశ్రమే ప్రస్యే దశలక్షజపః పరం
కరకపాల } ఋషీశ్వరః కౌశికాఖ్యోగారిశో వైనతంభవేత్
గఙ్గాసముద్రః కాసారః క్షేత్రాణి నవవింశతిః। అఖణ్డదీపాష్టత్రింశద్వ
స్త్రదానం ప్రశస్యతే॥ అర్కప్రసూనం వర్జ్యంస్యాదితి సన్మునిసేవితం।
నిత్యం కరకపాలాఖ్య గోత్రాణాం సతతంవిశాం॥ ... ౯

౩౯ } విజయాద్రౌ లక్షజప స్సాన్తాలకులగో
సాంతాలకుల. } త్రిణాం। సుమన్తేశో భవేద్దైవం చఞ్చరీకాహ్వ
యంసరః॥ వాల్మీకాఖ్యోమహామౌని రఖణ్డాః పంచవింశతిః। క్షేత్రాణి
నవచాష్టౌచ సప్తసన్తానముత్తమం॥ శమీాత్యాజ్యా భవేన్నిత్యం ఋషి
భిఃపరికీర్తితం॥ ... ... ... ౧౦

౩౬ } తుహినాద్రౌ లక్షజపస్తుమ్బురుర్నామసంయ
తప్పాలకుల } మిః। తులాభార మహాదానం క్షేత్రాణ్యేకవిం
శతిః॥ త్రింశదీపాస్తు దేవస్స్యాద్విమలోఽశ్వతక్షంసరః। వర్జ్యంస్యాత్పి
ప్పలీనిత్యం తుప్పాల కులగోత్రిణాం॥ ౧౧

౩౭ } గోదావర్యాం లక్షజపః పేశలాఖ్యోమ
పిప్పలకుల } హామునిః। గోదానంభూరియశసాం పిప్పలాహ్వ
యగోత్రిణాం। భీమేశ్వరోభానుసరః క్షేత్రా ఖణ్డాస్తుషోడశ। పిణ్యాకం
సర్వదావర్జ్యం వర్జ్యాచగజపిప్పలీ॥ ౧౨

౩౮ } వారణాశ్యాం లక్షజపో వరుణాఖ్యో మ
వసంతకుల } హామునిః। హిరణ్యదానం ముఖ్యం స్యాద్వసన్త
కులగోత్రిణాం। వామదేశోమహాదేవో నిర్గుణ్డీసరసీమతా। క్షేత్రా
ణిపఞ్చత్రింశత్స్యు ర్దీపాస్తునవపఞ్చచ॥ సన్తతంపరివర్జ్యంస్యా ద్ద్వా
ర్తాకంవకుళంభువి॥ ౧౩

౩౯ } చత్వారింశద ఖణ్డదీపముకుళా క్షేత్రా
పుచ్ఛకుల } ణిదానమ్మణేః। క్లుప్తంస్యాద్విమలేశ్వరస్తు విమ
లామ్భోధిస్సుకాఞ్చన్మునిః। స్యాచ్ఛ్రీమత్పురుషోత్తమే దశశతం శ్రీమ
జ్జపంకుర్వతాం। నిత్యంపుచ్ఛకులాఖ్యగోత్రజనుషాం వర్జ్యాసితాలాబ
వః। భవ్యంబ్రాహ్మణభక్తిశిష్టనిరతై ర్వర్జ్యంకళింగంస్మృతం॥ ౧౪

౪౦ మాసంతకుల } దేవస్యాన్నదసేశ్వరస్తు కపిలాచార్య స్స రోమాళవి। సిన్ధుర్వింశతిదీపికాగణనయా త్రింశత్తుకైదారకం। మాషావర్జ్యతమా సదాచకపిలా ధేనుఃప్రదేయాయుతం। మాసంతాహ్వాయ గోత్రిణాం ఘనజపోమన్నాకిసిరోధసి। దస్యే ప్రత్యాబ్ధికశ్రాద్ధే గయాంయాంతీర్థకర్మణి। అష్టకాసుచప్రీత్యర్థే మాషాభోజ్యానసంశయః॥ ౧౫

౪౧ విక్రమశిష్ట } గోదావర్యాస్తటేపుణ్యే దశలక్షజపఃప ౪౦। విశ్వామిత్రోమునివరో విక్రమాఖ్యాకగోత్రిణాం। షట్పఞ్చాశత్ప్రదీపాస్స్యుః క్షేత్రాణ్యప్యేకవింశతిః। విశ్వేశ్వరోమహాదేవో విజయామ్యోభనిధిస్సరః। సువర్ణదానంసంప్రోక్తం నిషిద్ధంబ్రహ్మదారవః॥ ౧౬

౪౨ అయనకుల } వేదారణ్యేకోటిజపః పిఙ్గళాఖ్యోమహాముని। అయనకాహ్వాయగోత్రాణాం మహాదానానిషోడశ। భోగేశ్వరోమహాదేవః పున్నాగాఖ్యసరస్స్మృతః। పఞ్చాశద్దీపకళికాః క్షేత్రాణినవసప్తచ। అన్వయేసర్వదాత్యాజ్యా మతసీద్వాదశావినా॥ ౧౭

౪౩ మండుకుల } కేదారేన్యర్బుదజపో ధేనుదానంప్రశస్యతే। కపిలాఖ్యోమునివరో మణ్డుకాహ్వాయగోత్రిణాం। కోటీశ్వరోదైవతంస్యా త్కమలామ్బునిధిస్సరః। క్షేత్రాణిదీపాః పఞ్చాశత్త్యాజ్యాశ్చాతశలాటుకాః॥ ౧౮

౪౪ బలిశిష్ట } భారద్వాజఋషిః ప్రదీపకళికా స్త్రింశచ్చకేదారకం। చత్వారింశదభీష్టదైవతమపి శ్రీ భార్గవోవర్జితం। కారుణ్యాద్బలసాగరాఖ్య సరసీ దేయాతుశాటీతటే। పమ్మాపయాబలిశిష్టగోత్రజనుషాం లక్షంజపంకుర్వతాం॥ ౧౯

౪౫ పద్మశిష్ట } జగన్నాథేయుతజపో మునిరాజో మహాముని। అన్నదానకృతాంనిత్యం పద్మశిష్టాఖ్యగోత్రిణాం। సరస్వతీశోదేవస్తు నామ్నాసర్వాంమ్బుధిస్సరః। అఖణ్డదీపాష్షట్త్రింశత్క్షేత్రాణీసప్తవింశతిః। పఙ్కేరుహంపద్మమూలం పద్మశి

ష్టాఖ్యగోత్రిణాం । త్యాజ్యంహిసర్వదాతైశ్చ వంశస్థైరతిభక్తితః ॥ ౨౦

౪౬ అనంతకుల } మేరాజపఃకృతవతాం నియుతంచకోటి భూమిఃస్మృశాంబుషి వర స్వాకఋష్యశృంగః । క్షేత్రాణిసప్తనవతిర్నన సప్తదీపా భూమా వసన్తకులగోత్రభువాంప్రసిద్ధాః । అనన్తదానకర్త్యాణామనన్తేశస్తుదైవతం । రాజమాషాస్తువర్జ్యాస్స్యుస్తటాకోఽనన్తశామకః ॥ ౨౧

౪౭ విన్నకుల } సరస్వత్యాస్తటేపుణ్యే దశకోటిజపఃపరం । మన్దపాలోమునివరో విన్నకాహ్వాయగోత్రిణాం । సువర్ణదానంవిదితం ప్రాసాదాహ్వాయకంసరః । సోమేశ్వరోమహాదేవః ప్రదీపాఏకవింశతిః । పఞ్చత్రింశత్తుకేదార్యాం వర్జ్యంనిత్యంచమైణవం ॥ ౨౨

౪౮ కౌమరిశిష్ట } వృద్ధాచలేకృతవతాం జపలక్షముగ్రసేనోమునిః కౌమరిశిష్టకులేన్నదానం । భృఙ్గేశ్వరోమహాదపూపసరస్తుపష్టిః । క్షేత్రంప్రదీపమపివర్జ్యతమంకురణ్ణాం॥

౪౯ మోరుకుల } మూలస్థానమహేశ్వర స్సరసికామూలామ్బురాశ్యాహ్వయా । దీపాషోడశహింగుజంతు ఫలవర్జ్యాంశాద్భవేద్వింశతిః । క్షేత్రాణ్యత్ర ప్రదానమాతలఫలం సూనుర్మృకణ్డోర్మునిః । లక్షంమోరుకులాఖ్య గోత్రజనుషాం శ్రీవేఙ్కటగ్రాజపః ॥ ౨౪

౫౦ మాంజికుల } పుష్పాచలేకృతంభక్త్యా జపంద్వాదశలక్షకం । మూలేశ్వరోమహాదేవ్యా సరోఽభినవనామకం । అఖణ్డదీపాష్షట్త్రింశ త్క్షేత్రాణినవపఞ్చచ । కన్దమూలప్రదానంచ క్షౌమదానందినేదినే । ముఞ్జవ్రతోమునివరస్త్యాజ్య మ్మారీచముచ్యతే । మాఞ్జికాహ్వాయగోత్రాణాం శీతలంవంశజైస్సదా ॥ ౨౬

౫౧ చనశిష్ట } రజతాద్రౌ లక్షజపశ్శాణ్డిల్యోభగవాన్ ఋషిః । దుర్గేశోదైవతం ధర్మసరోదేయం గజేశ్వరః । షణ్ణాఞ్చశత్క్షేత్ర సఙ్ఖ్యాస్స్యా దఖణ్డానవసప్తతిః । శ్యామాకాఃపరివర్జ్యాస్స్యు శ్చనశిష్టాఖ్యగోత్రిణాం ॥ ౨౭

౫౩ చత్వారింశదఖండదీపకళికా క్షేత్రావళీ
శ్రీశిష్ట సఙ్ఖ్యయా । త్రింశద్దానవిధౌ ప్రశస్తఉదితశ్చా
గోముని శ్శ్రీధరః । శ్రీసిద్ధస్సరసీకనిష్టచణకా వర్జ్యాశ్శిరీషేశ్వరః ।
కైలాసేజపమేకలక్షముదితం శ్రీశిష్టసద్గోత్రిణాం ॥ ౨౮

౫౪ ప్రహీణ్యాఖ్యాయగోత్రీణాం ద్విజపూజా
ప్రహీణుకుల రత్నైస్సదా । పమ్పాయాంలక్షజపిత మార్కండస
మహామునిః । పుష్పనామాచసరసీ దైవతంపర్వతేశ్వరః । దానేప్రశ
స్తంపనసం క్షేత్రాణీవింశతిద్వయం । దీపాస్త్రింశత్కరవల్లీ వర్జ్యం
మునిభిరీరితం ॥ ౨౯

౫౫ ప్రయాగే లక్షజపితం మునిర్గార్గ్యాహ్వ
భ్రమదకుల యోమతః । పీతామ్బరప్రదానంచ వీరేశఃకులదై
వతం । విశ్వామ్బుధిసరో దీపాస్త్రింశ త్క్షేత్రాణివింశతిః । వర్జ్యాక్షీర
ఫలంనిత్యం భవేద్భ్రమదగోత్రిణాం ॥ 30

౫౬ కైలాసాద్రౌనియుతదశకం మన్త్రరాజం
ఘనశ్రీలకుల ప్రజప్యా । కౌణ్డిన్యాఖ్యోఘనముని వరోదైవ
తం గౌతమేశః । కాసారస్స్యాత్కమలజలధి క్షేత్రకంచాష్టశీతి ర్దీపా
షష్టిర్భువికిల ఘనశ్రీలసద్గోత్రిణాంచ । ఘనశ్రీలాఖ్యగోత్రాణాం తు
లాభారప్రదాయినాం । గారుత్మతంఫలంవర్జ్యం సర్వదామునిసమ్మతేః॥

౫౭ రజతాద్రౌలక్షజపో భూమిదానం భృగు
పృథివిశిష్ట ర్మునిః । పృథివీశస్తుదేవేశః పృథ్విశిష్టాఖ్య గో
త్రిణామ్ । పార్థివోనామకాసార స్త్రయోవింశతిదీపికాః । క్షేత్రాణిన
వచాష్టౌచ వర్జ్యంజమ్బూఫలంమతమ్ ॥ 3౨

౫౮ దణ్డకాయాంలక్షజపో సంవర్తాఖ్యోమ
రెంటకుల హామునిః । వసన్తేశోవనసరః కన్యాదానం ప్రశ
స్యతే । క్షేత్రాణ్యశీతిర్దీపాస్స్యు స్త్రింశన్మునిభిరీరితమ్ । వర్జ్యంతుకురు
విందంస్యాద్రెణ్డకానాంచబాదరమ్ ॥ 33

౫౯ సింహాచలేజపోలక్షం హరివక్త్రోమహా
ఉశీరకుల మునిః । సువర్ణదానంసంప్రోక్తముశీరకులగోత్రి

ణామ్ । భీమేశో దైవతంనామ్నా భ్రమరాఖ్యోమహాసరః । షణ్ణవ్త్రిం శత్ప్రదీపాస్స్యుః క్షేత్రాణ్యష్టైకసప్తతిః । ధాత్రీఫలంసదావర్జ్యం సప్తర్షిగణసమ్మతమ్ ॥ ౩౪

౬౦ శుశాలకుల } నర్మదాయాంలక్షజపో మునిరజీరసోమతః । శుశాలకులగోత్రాణాం స్వర్ణపాత్రప్రదాయినాం । జగదీశోజలూకాఖ్య సరసీపఞ్చవింశతిః । క్షేత్రాణిదీపాః పఞ్చాశద్వర్జ్యం పాటలపుష్పికా ॥ ౩౫

౬౧ ...ద్రూపకుల. } ప్రయాగే స్యర్బుదజప శ్చిదూప్రకులగోత్రిణాం । పవిత్రపాణిస్తుముని శ్చిత్రేశో దైవతంభవేత్ । చిత్రామణ్యాఖ్యకాసారః క్షేత్రాణినవపఞ్చచ అఖణ్డదీపాః పఞ్చాశచ్ఛత్రదానంప్రశస్యతే! చామన్తికం సదావర్జ్యం సూక్ష్మశాకంకదాచన॥ ౩౬

౬౨ ...క్షమకుల. } ఉత్తమేభాస్కరక్షేత్రే శతకోటిజపఃపరం। అక్షయ్యాఖ్యోమునిః ప్రోక్తోదీక్షమాఖ్యాయ గోత్రిణాం సువర్ణదానందేవస్తుభాస్కరోభాసకంసరః।అఖణ్డాః పఞ్చపఞ్చాశత్ క్షేత్రాణినవసప్తచ ॥ ద్రాక్షాఫల సదావర్జ్య మితిసన్మునిసేవితం ॥ ౩౭

౬౩ ...ధరుకస్నకుల. } బ్రహ్మేశఃకుల దైవతమ్మునివరోబోధాయనోదీపికాః । పఞ్చాశద్ధరణీప్రదానకరణంక్షేత్రాణి షష్ట్యంశతిః । పారావర్జ్యతమా సరఃకమలజా మ్బోధిస్సురాద్రా జపోలక్షం చాప్యయుతంభవేద్బధరుకస్నప్రఖ్యాతసద్గోత్రిణాం ॥ ౩౮

౬౪ ...మానసభికుల. } మలయాద్రౌలక్షజపః పిశాబర్బో మహామునిః। ధనప్రదాయినాంనిత్యం యానసభ్యాఖ్యగోత్రిణాం। క్షేత్రాణి పఞ్చచత్వారిదీపా షట్సప్తసమ్మతః। కోటీశ్వరో మహాదేవః కాసారఃకోటినామకం॥ యవాస్తు వర్జ్యాస్సంప్రోక్తా విదితాజగతీతలే ॥ ... ... ... ... ౩౯

౬౫ ...గామిశిష్ట. } కర్పూరంపరివర్జనీయముదితం దీపాస్సప్తా వింశతి । స్త్రింశక్షేత్ర గణశ్చ దాన ముదితం హేమంమునిఃకామ్యకః కామాబ్ధిస్సరశ్చ మునీన్ద్రవినుతః పూర్ణేశ్వరోదేవతా। కాళిన్దిభువి కల్పితోఽర్బుదజపః షష్ఠిగ్నిమధ్యేసదా॥ కా

మీశిష్టాఖ్యగోత్రాణాం త్యాజ్యం కన్దమితీరితం ॥ ౪౦

౬౬. కదంబకుల. } నర్మదాయాః పుణ్యతటే దశాయుత జపోమ తః। కౌత్సాఖ్య మునిశిష్యాణాం కదమ్బకులగోత్రిణాం। నన్దీశ్వరో నన్దిసరః కన్యాదానం ప్రశస్యతే। చత్వారింశత్తు క్షేత్ర దీపావర్జ్యం నీలోత్పలమ్మతం ॥ ... ... ౪౧

౬౭. అనుమర్తణకుల. } మధురాయాం జపః కోటిఋషిస్సూలశిరోమ తః। హాలాస్య నాయకో దేవో జీవన్ముక్తిప్రదం సరః। విద్రుమాణాం ప్రదానంచ క్షేత్రాణీనవవింశతిః। అఖణ్డదీపాః పఞ్చాశదనుమర్తణగోత్రిణాం॥ స్ఫటికాస్తు సదావర్జ్యా స్సర్వైర్మునిభిరీరితం॥ ౪౨

౬౮. యలమంచకుల. } ఏలేశ్వరే కోటిజపః కృష్ణద్వైపాయనో మునిః మహోక్షదానం సంప్రోక్తం యలమంచాఖ్యగోత్రిణాం ॥ వైభవేశో వైభవాఖ్య కాసారో మునిసమ్మతః । అఖణ్డదీపా క్షేత్రాణి చత్వారింశత్తు వింశతిః॥ ఏలాస్తు సర్వదా వర్జ్యా స్తేషామ్మునిభిరీరితం ॥ ... ... ... ౪౩

౬౯ త్రిమూలకుల. } అలంపూరితటే పుణ్యే దశకోటిజపోమతః। త్రిమూలకుల గోత్రాణాంమాతృభూతేశ్వరో మతః జమ్బునామసరోదీపా క్షేత్రాణ్యష్టసప్తతిః। దాసీదానంచ కర్పూరం వర్జ్యం స్యాన్మాధవో మునిః ॥ ... ... ... ౪౪

౭౦ క్రమశిష్ట. } శ్రీశైలే జాహ్నవీతీరే దశకోటిర్మహాజపః। శరభఙ్గమునిః ప్రాజ్ఞః క్రమశిష్టాఖ్యగోత్రిణాం। స్వర్ణవస్త్రప్రదాతౄణాం కాసారః పావనం స్మృతః। జమదగ్నీశ్వరో దేవో ద్వాత్రింశత్ క్షేత్రమణ్డలం ॥ అఖణ్డా ఏకపఞ్చాశద్వర్జ్యం స్యాన్నీల గోరసం కన్దమూలం సదాత్యాజ్యమితి సన్మునిసమ్మతిః ॥ ౪౫

౭౧ ప్రౌఢయాజకుల. } తామ్రపర్ణ్యాస్తటే పుణ్యే దశలక్షజపః పరః ప్రౌఢయాజకగోత్రాణాం ప్రౌఢేశో దైవతమ్మతం। పృథివీనామకాసారః క్షేత్రాఖణ్డానవద్వయమ్ ॥ మాసలాఖ్యో మునివర్యో గోదానంచదినేదినే ॥ పటోలికా సదాత్యాజ్యా మునివాక్యప్రమాణతః ॥ ౪౬

౭౨
సమశిష్ట } జాహ్నవ్యాంతుజపోలక్షం మానీశస్సా
త్సన్దవః। విశ్వేశ్వరోమహాదేవో వీరనామా
మ్బధిస్సరః। సమశిష్టాఖ్యగోత్రాణా మష్టాదశసప్తచ। త్రిశంత్తె
త్రాణివిజ్ఞేయం సద్యః ప్రసవనీచగాః॥ దానేప్రశస్తంవర్జ్యంతు ధాన్యం
సత్యదైవ్యేణవామతం॥ ... ... ... ౪౭

౭౩
పాలకకుల } బ్రహ్మాచలేజపోలక్షం స్యాత్పాలకకుల
గోత్రిణామ్। పావనస్తుఋషిఃఖ్యాతః ఫలదానం
ప్రశస్యతే॥ ప్రోతేశ్వరస్తుదేవస్స్యా ద్వల్మీకాఖ్యంమహాసరః। మాతు
లుఙ్గఫలం వర్జ్యం క్షేత్రదీపాద్విసప్తతిః॥ ౪౮

౭౪
ఇషుపకుల } నర్మదాయాం కోటిజపో విష్ణువృద్ధోమ
హామునిః॥ కపిలేశోమహాదేవః కపిలామ్భోని
ధిస్సరః। త్రిషష్టిదీపాఃక్షేత్రాణి పఞ్చపఞ్చాశదుచ్యతే। రామరస్సర్వ
దావర్జ్య మిషుపాహ్వయగోత్రిణాం। మాసిమాసిమహాదానం కుర్వతాం
మునివాక్యతః॥ ౪౯

౭౫
చక్రమూలకుల } బ్రహ్మావర్తా కోటిజప శ్చక్రపాణిర్ముని
ర్మతః। చక్రమూలాఖ్యగోత్రాణాం ఛత్రదా
నంప్రశస్యతే। చక్రేశ్వరోరామసరః క్షేత్రదీపాస్తుసప్తతిః। చక్రవ
ర్త్యాహ్వాయంశాకం నిషిద్ధమ్మునిసమ్మతేః॥ ౫౦

౭౬
వస్త్రికుల } పద్మాచలేజపోలక్షం వసిష్ఠోమునిసత్త
మః। వజ్రదానంరాజదేవో వస్త్రికాహ్వయగో
త్రిణాం। క్షేత్రాణివింశతి ర్దీపానవసప్తచ షోడశ। లామజ్జకంసదావ
ర్జ్యం పల్లవాఖ్యంసరస్స్మృతః॥ ౫౧

౭౭
కానుకుల } సరస్వత్యాం కోటిజపః పుణ్డరీకోమహా
మునిః। కానుకాహ్వయగోత్రాణాం కామే
శోదైవతంపరం। కామాఖ్యసరసీదీపా షష్టిక్షేత్రాణిసప్తతిః। గజదా
నంమహాశ్రేష్ఠం వర్జ్యంస్యాద్రక్తమూలకం॥ ౫౨

౭౮
ధనకుల } జాహ్నవ్యామర్బుదజపః కృష్ణోనామమ
హామునిః। ధనదానంప్రవిదితం ధనకులాహ్వ

యగోత్రిణాం । కృష్ణేశ్వరః కృష్ణసరో దీపాః క్షేత్రాణివింశతిః । అపా
మార్గం సదావర్జ్య మిత్యుక్తం సన్మునీశ్వరైః ॥ ౫౩

౬౯ త్రివిక్రమశిష్ట — లక్షుం జపస్సిద్ధవట్యాం త్రిజట్యాఖ్యో మహాముని । త్రివిక్రమాఖ్యగోత్రాణాం కులదే
వోజనార్దనః । రామాహ్వయస్సరః ప్రోక్తం క్షేత్రాఖణ్డాదశద్వయం ।
వర్జ్యంతు శ్వేతకూష్మాణ్డం వాజిదానం ప్రశస్యతే ॥ ౫౪

౭౦ విషణిశిష్ట — విష్వక్సేనఋషిః పద్దీపముకులా స్సిద్ధాస్స్మృతా వింశతి । షష్టి క్షేత్రగణస్సరస్తువిది
తం స్యాత్కేతుకాఖ్యం మహత్ । కన్యాదానమతిప్రశస్తముదితం వి
న్ధ్యాద్రిశృఙ్గేజపః । కోటస్యాత్పరివర్జనీయమనిశం వానిద్రశాకం సదా ।
విరిపశిష్టగోత్రాణాం విరూపాక్షోహి దైవతం । త్రైర్మాలతీపరిత్యాజ్యా
శమ్భునా కేతకీ యథా ॥ ౫౫

౭౧ తులసికుల — శ్రీశైలేన్యర్బుదజపః పూతికర్ణో మహాముని । తులసీకులగోత్రాణాం మహాదానప్ర
దాయినాం । దుర్గేశ్వరో దేవసర స్సప్తత్రింశత్తు దీపికాః । క్షేత్రాణి చ
త్రిపఞ్చాశ ద్వర్జ్యం స్యాత్తులసమ్మతా ॥ ౫౬

౭౨ భీమశిష్ట — సిన్ధోస్తటేజపో లక్షుం జాబాలిస్తుమునిర్మతః । భీమశిష్టాఖ్యగోత్రాణాం భీమేశః కులదైవ
తం । భీమాబ్ధిసరసీ పుణ్యక్షేత్ర దీపాశ్శతమ్మతం । క్షౌమం చ భీమశాకం
స్యాద్వర్జ్యం రత్నప్రదాయినాం ॥ ౫౭

౭౩ ఇక్ష్వాకుకుల — దణ్డకాయాం లక్షుజపో మహాతేజో మునిర్మతః । అశ్వనాగాదిదాత్రాణా మిక్ష్వాకుకుల
గోత్రిణాం । భోగేశ్వరో భోగసరః క్షేత్రదీపాస్త్రి సప్తతిః । కఙ్గామిక్షు
ర్జపాపుష్పం వర్జ్యం స్యాన్మునిసమ్మతేః । ౫౮

౭౪ హస్తికుల — మలయాద్రౌ లక్షుజప స్సోమాఖ్యస్తు మహాముని । హస్తికాహ్వయగోత్రాణాం రా
మేశః కులదైవతం । అశ్వత్థసరసీ దీపా స్సప్తతిక్షేత్రకం శతం । ఉపోతకీ
సదావర్జ్యం శాలిదానం ప్రశస్యతే ॥ ౫౯

౮౫ గణముఖకుల — బ్రహ్మాద్రౌ దశలక్షముత్తమజపం జప్త్వాతతోహాటకం। దత్వాశుద్ధతరాత్మనాం గణపకః ఖ్యాతోన్వవాయోవిశాం। ధర్మాబ్ధిస్సరసీ ధనేశ్వరవరో దేవశ్చతుస్త్రింశతిః। క్షేత్రంసప్తదశాపిదీపకళికా విద్వద్భిరుక్తాభువి। గణముఖకులజనుషాంకదంబ కరవీరకంభవేద్వర్జ్యం। కస్యపఋషివరఉదితో విద్వద్భిస్తత్వవేత్రృభిర్నిత్యం॥ ౬౦

౮౬ ధనగుండ — కృష్ణవేణ్యాంస్తటేరమ్యేదశలక్షజపఃకృతం। సంవర్తకో మునిఖ్యాతో ధర్మేశోదైవతంస్మృతం। ధాన్యదానంధర్మసరో క్షేత్రదీపాస్తువింశతిః। దాడిమీకుసుమంవర్జ్యం ధనగుణ్డాఖ్యగోత్రిణాం॥ ౬౧

౮౭ వెనశిష్ట — శేషాద్రౌదశలక్షముత్తమజప స్తేషాం శమీకోముని। ర్దానీయోమణిదేవవల్లభ సమాఖ్యాతంభవేద్దైవతం। కాసారోపిఉవసన్తనామకమిహ స్యాత్తిక్తశాకంసదా। వర్జ్యంశ్రీవెనశిష్టగోత్రజనుషాం వైశోత్తమానాంభువి। అఖణ్డదీపానవతిక్షేత్రాణి నవసప్తతిః। వెనశిష్టాఖ్యగోత్రాణాం ఋషిభిఃపరికీర్తితః॥ ౬౨

౮౮ వెంకోలకుల — వేఙ్కటాద్రౌ లక్షజపో మునిర్వేదనిధిర్మతః। రత్నప్రదానంవిదితం వెఙ్కోలకులగోత్రిణాం। భీమేశ్వరోభీమసరో క్షేత్రదీపాస్త్రిసప్తతిః। వార్తాకంసర్వదావర్జ్యం తద్దైవమునిసమ్మతిః॥ ౬౩

౮౯ ఆందిరకుల. — కవేరకన్యకాతీరే దశలక్షజపఃపరం। ఋషిస్సత్యవ్రతశ్చప్రోక్త స్వన్దిరాహ్వాయగోత్రిణాం। వృషభేశగపుష్పసరో ధాన్యదానంప్రశస్యతే। క్షేత్రాఖణ్డాస్సప్తతిస్స్యాద్వర్జ్యంజమ్బూఫలంతథా॥ ౬౪

౯౦ కంకారకుల — సురాద్రౌ న్యర్బుదజపో మహాసేనోమహాముని। కఙ్కారకులగోత్రాణాం। శ్రీశేశోదైవతంసదా। శ్రీశాఖ్యసరసీపుణ్యా గజదానంప్రశస్యతే। అచ్యుతంసర్వదావర్జ్యంక్షేత్రాఖణ్డాస్త్రయోదశ॥ ౬౫

౯౧ ముష్టిక కుల — దణ్డకాయాంలక్షజపో ముచికున్దో మహా మునిః। ముష్టికాహ్వాయగోత్రాణాం। మహాదాన ప్రదాయినాం। కపిత్థసరసీపుణ్యం మన్త్రేశకుల దైవతం। క్షేత్రాణ్యఖ ణ్డాగపఞ్చాశద్వర్జ్యం హీబేరమూలకం ॥ ౬౬

౯౨ చందక కుల — యమునాయాన్తటేపుణ్యే దశలక్షజపః పరం। చన్దకాహ్వాయగోత్రాణాం ధౌమ్యోనామ నివర స్మృతః। చిత్తేశ్వరో దైవతంస్యా చ్చిత్రాబ్ధిస్సరసీమతా। తిలక్ష్మ ప్రాజినేదానే దీపాక్షేత్రాణిసఙ్ఖ్యయా। ఏకవింశతివర్జ్యంస్యా త్పుష్పో త్పుర్మునిభిస్స్మృతం ॥ ౬౭

౯౩ త్రికశిష్ట — మలయేదశలక్షాణి త్రికశిష్టాఖ్య గోత్రి ణాం। భూతేశో దైవతం పుష్పసరో దానస్స్మృ తామృతం। అఖణ్డదీపాష్టత్రింశ త్క్షేత్రాణినవపఞ్చచ। తుర్యావసః మునిశ్రేష్ఠ స్త్యాజ్యాస్యాద్రక్తశాకిని ॥ ౬౮

౯౪ మంగమకుల — గోదావర్యాంలక్షజపో హయగ్రీవోమ హామునిః। అవిచ్ఛిన్నాన్నదాతౄణాం మఙ్గ మాహ్వాయగోత్రిణాం। జలేశ్వరఃకృష్ణసరో క్షేత్రదీపాస్తువింశతిః। అ లాబూసర్వదావర్జ్యం తద్దేవమునిసమ్మతః ॥ ౬౯

౯౫ వృద్ధికుల — శ్రీముష్ణాఖ్యేమహాక్షేత్రే దశకోటిజపో మతః। కన్యాదానంపరిఃప్రోక్తం స్యాద్వృద్ధికుల గోత్రిణాం। ఋషిర్బృహస్పతిర్నామా బృహదీశో బృహత్సరః। క్షే త్రాణిత్వేకపఞ్చాశ దఖణ్డాఏకవింశతిః। గజపుష్పావనీవస్త్రం వర్జ్యంగ జఫలంసదా ॥ ౭౦

౯౬ కమలకుల — కమలాలయతీరేతు జపఃకోటిర్మునిస్మృ కః। ముక్తాహారప్రదాతౄణాం ముక్తిప్రదమ హేశ్వరః। ముక్తిసారసరఃపుణ్యాం క్షేత్రాఖణ్డాస్త్రిసప్తతిః। కమలా హ్వాయగోత్రిణాం వర్జ్యంకమలకన్దకం। తథైవతేషాంవర్జ్యం స్యాన్ని త్యం శ్వేతసరోరుహం ॥ ౭౧

౯౭ (శ్రీ)కూర్మాఖ్యచలే కోటిజపస్త్రమద
కన్యకుల కోమునిః। కన్యకాహ్వాయగోత్రాణాం భైరవకు
లదైవతం। హస్తినామసరసిపుణ్యాం హస్తిదానం ప్రశస్యతే। క్షేత్రా
ణ్యష్టత్రింశచ్చాశద్వర్జ్యంకుముదజమ్భవః॥ ౯౨

౯౮ గఙ్గాయమునయోర్మధ్యే జపన్కోటిద్వయం
శమనకుల స్మృతః॥ ఋషిగికాఞ్చననామాస్యా ద్రత్నదా
నం ప్రశస్యతే। కామధేనుసరస్ప్రోక్తం చన్ద్రేశకులదైవతం। త్రయ
స్త్రింశదఖణ్డాస్స్యు క్షేత్రాణినవవింశతిః। వర్జ్యాతుమల్లికాపుష్పం శా
స్త్రస్యాచసర్వదా। శమనాహ్వాయగోత్రాణాం మునిభిఃపరికీర్తితం॥

౯౯ కురుక్షేత్రేమహాపుణ్యే దశలక్షజపోమ
శౌనకకుల తః। శౌనకాహ్వాయగోత్రాణాం శౌనకోఋషి
సత్తమః। దీపాస్తుపఞ్చపఞ్చాశ క్షేత్రాణ్యప్యేకవింశతిః। విశేశ్వరోమ
హాదేవః ప్రసూనామ్నునిధిస్సరః। శ్యామాకాశ్చైవ చామన్త్యా వర్జ్యా
స్స్యుస్సర్వదాభువి। గజదానంనిగదితం ఋషిభిశ్శీలరతైస్సదా॥ ౯౪

౧౦౦ సురాచలేలక్షజపో మునిస్యాదశ్వలా
అమలకుల యనః। అమలాహ్వాయగోత్రాణాం హస్తిదానం
ప్రశస్యతే। నర్మదేశోజమ్బుసరో క్షేత్రదీపాస్తుసప్తతిః। ఔదుమ్బరఫ
లంత్యాజ్యా మహర్షిగణసమ్మతేః॥ ౯౫

౧౦౧ ఋష్యమూకేలక్షజపో ఋషిశ్శార్ఙ్గర
గుండకకుల వోమతః। గుణ్డకాహ్వాయగోత్రాణాం కుబ్జేశః
కులదైవతం। కూష్మాణ్డసరసీపుణ్యా క్షేత్రాఖణ్డాస్తువింశతిః। కూ
ష్మాణ్డదానంసంప్రోక్తం మాసిమాసినిరన్తరం। గురుశాకంనిమ్బఫలం
త్యాజ్యాస్యాన్మునిశాసనాత్॥ ౯౬

౧౦౨ పారియాత్రేలక్షజపఃపులస్త్యోఋషిసత్త
(శ్రీ)పుంసిక మః। (శ్రీ)పుంసికాఖ్యగోత్రాణాం పరేశఃకుల
దైవతం। పుష్పాబ్ధిసరసీనామ్నా క్షేత్రదీపాస్తుసప్తతిః। సువర్ణదానం
సంప్రోక్తం వర్జ్యంక్షీరఫలంభవేత్॥ ౯౭

ద్వావింశ్రేష్ఠాణిచగోత్రాణి షోడశైత్యుచ్యతేబుధైః। త్రావింశే

యాణిచగోత్రాణి సప్తప్యాద్ధరణీపతే ॥ ఏకంస్యాచ్చతురాష్ట్రేయాం దశాష్ట్రేయంతథాభవేత్ । ఏకాష్ట్రేయాణిగోత్రాణి సప్తసప్తతిరుచ్యతే । స్యాద్వ్యుత్తరశతాన్యద్య గోత్రాణ్యేవంధరాతలే । ప్రసిద్ధాన్యర్జనస్థాని తద్గోత్రాణాంతుబాలకాః ॥ సగ్రాహ్యాకామతోభుక్త్వా త్రిమిస్యాత్సప్తజన్మసు । ఏవం శ్రీకన్యకాదేవ్యా ప్రోక్తమేతద్ద్విజోత్తమా ॥



అని యిట్లతిమోదంబున గోత్రాదులను విశదంబుగఁ దెలియఁ బఱచి, వైశ్యబాలురఁ జూచి. ముందు మీపెద్దలు శంభుసేవా పరతంత్రులై, కైలాసవాసము చేయునపుడు చిత్రకంఠుఁడను గంధర్వుచే మోహింపఁబడిన శంభుశ్రేష్ఠి కూతురగు కీర్తికన్యవివాహమునకు గంధర్వమాయచే విఘ్నము కలుగకుండునట్లు నందికేశ్వరప్రోక్తమైన విధిప్రకారము పరిణయమును జరిపించిరి. ఆవిధియే మీకును వివాహములయం దాచరింపఁదగినది. కాన నేఁజెప్పెడు యీ విధిని జాగరూకులరై వినుండని యిట్లనియె.

* వివాహ విధులు *

కన్యను నిశ్చయించిన పిదప వరుఁ డెచ్చటికేనియుఁబోయి రాకుండిన నాలుమాసములు కాచియుండి పిదప నన్యుని వరింపవచ్చును వరునితండ్రి కన్యనడిగి కన్యతండ్రి యిచ్చుట కొప్పుకొని నూటయిబ్బంద్రము నగరము వారికిని దాంబూలములనిచ్చిన పిదపఁ గన్య నియ్యనిచో నా కన్యతండ్రి పతితుఁడగును. ఆకన్య మొదట నిశ్చయించినవరునకే పత్ని. అన్యునకు సహోదరితో సమానురాలు. వివాహపూర్వదినమందుఁ బూర్వులచేతఁ బూజింపఁబడినట్లు గంగాపూజ చేయవలయును. వివాహపూర్వదినమున ముప్పదిరెండు దేవతలను భక్తితో విత్తానుసారముగాఁ బూజింపవలయు. మున్ను కీర్తికన్యాసుందతులచే నాదేవతలు పూజింపఁబడిరి గాన, నియమముతో నుపవాసముండి, సాయంకాలమున బంధువులతోడఁ జతుర్విధ వాద్యములు మ్రోయగా గ్రామమునకు వెలపలపోయి, వధూవరులకు విశేషభోగసంపత్తి కలుగుటకును నా వధూవరులు వృద్ధిపొందుటకును ముప్పదిరెండు ఘుటికలను జే

సి, పాత్రద్వయమునను౦చి, మాఁటిమాటికిఁ బూజింపవలయును. ఇంద్రుడు- అగ్ని- వరుణుడు- కుబేరుడు- చంద్రుడు- అను దేవతారూపములైన యైదు స్తంభములను, మందార - పారిజాతక - సంతాన - కల్పవృక్ష - హరిచందనములను సురతరురూపములగు నైదు స్తంభములను బ్రతిష్ఠించి, భక్తితోఁ బూజింపవలయును. ఈ పది ప్రోలి స్తంభములను బూర్వముఖముగా నైన నుత్తరముఖముగా నైన నమర్పవలయును దశ స్తంభప్రతిష్ఠయు సరణీకల్పనమును- వధూవరుల సాన్నిధ్యమునఁ జేయవలయును. ఏకలగ్నమందు వరుఁడు పెక్కండ్రు భార్యలఁ బరిణయమగునపుడు వధూభేదముచే నగ్నిభేదమును గల్పింపవలయును. వివాహదినములలోఁ బ్రాతస్సాయంకాలములయందు హోమాదిక్రియల జరిపింపవలయును. పూర్వులచే నాచరింపబడిన యీమార్గమును వైశ్యశ్రేష్ఠులు విడువకుండవలయును.

దీనికిఁ బ్రమాణము

నిశ్చిత్య కన్యాం నాగిచ్ఛేద్వరో యత్రగతోఽపి సన్ । ఋతుత్రయం పరీక్ష్యాథ వరమన్యం వృణేత్సుధీః ॥ కన్యాం వృత్వా వరపితా కన్యాపిత్రా ణిరూపితాం । సపూగీఫలసంయుక్తాం సద్వస్త్రరశతాభిధాం ॥ కృత్వాతు గోత్రజాం వైశ్యాం నదత్వా దోషభాగ్భవేత్ । కన్యా తస్యైవ సా పత్నీ హ్యన్యస్యైవ సహోదరీ ॥ గఙ్గావివాహపూర్వేహ్ని పూజ్యా వైశ్యైః పూజితా పురా । పూర్వేద్యుః క్రియతాం వత్సా ద్వాత్రింశద్దేవతా అపి ॥ పూజనీయా యథాభక్త్యా యథావిత్తానుసారతః । కీర్తికన్యాసుదత్తిభ్యాం పూజితాస్తే పురా కిల ॥ ఉపోష్య వియమే నైవ సాయంకాలే తు బాన్ధవైః । గ్రామాద్బహిర్వినిర్గత్య తూర్యనాదపురస్సరం ॥ వరవధ్వోర్విశేషేణ భోగసమ్పత్తివృద్ధయే । వధూవరప్రవృద్ధ్యర్థం ద్వాత్రింశద్ఘటికాస్తదా । పాత్రద్వయే తు నిక్షిప్య పూజయేచ్చ పృథక్పృథక్ । ఇన్ద్రాగ్నిపాశిధనద శశికల్పకరూపిణః । ప్రతిష్ఠాప్య దశ స్తమ్భాన్ స్యర్చయేద్భక్తిభావనైః । పూర్వాభిముఖతో వాపి కుర్యాదుత్తరదిఙ్ముఖః । దశ స్తమ్భప్రతిష్ఠాంచ సరణీకల్పనం తథా ॥ వధూపురస్సరేణైవ పృథగేవ ప్రకల్పయేత్ । వధూబహుత్వే సంప్రాప్తే వరస్యైవైకలగ్న

కే ॥ వధూశ్చేదేవసర్వత్ర హ్యగ్నిభేదహావికల్పయేత్ । వివాహాదివశే ష్వగ్నిం ప్రాంతస్నాయం వికల్పయేత్ ॥ ప్రాయశ్చిత్తాచరితా మార్గం న జహాత్యన్యవృజ్ఞవః ॥

౧. ముహూర్తదినమున వధూవరులకు మంగళస్నానములు చేయించి దివ్యభూషణ వస్త్రంబుల నలంకరించి మేనమామయు, మామయేనియు, భార్యాసహితుడై, వరునిబూజించి, నాకీచ్చు నీకన్యాక న్యను గ్రహింపుమను నర్థముగల ‹‹ గృహాణమత్సుతాంకన్యామిమాం›› అను వాక్యమునుజెప్పి, కన్యాదానముచేసి. వరునిచే మాంగల్య ధారణముచేయింపవలయును అంతట బ్రధాన హోమలాజహోమములఁ జేయించి, సప్తపదముల ద్రొక్కించి విధ్యుక్త ప్రకారముగాఁ దక్షిణకార్యములఁ జేయింపవలయును.

ప్ర — ముహూర్తకాలేసంప్రాప్తే మంగళస్నానమాచరేత్ । వరవధ్వావలంకృత్య దివ్యభూషాంబరాణిచ । మాతులశ్శ్వశురోవాపి స భార్యోప్యూజయేద్వరమ్ । గృహాణమత్సుతాంకన్యా మిమాముక్త్వా వరేణచ । మాంగల్యధారణంకుర్యాత్ప్రధానంహోమమాచరేత్ । లాజహోమంచకర్తవ్యం కృత్వాసప్తపదానిచ ॥ విధ్యుక్తరీత్యా కార్యాణ్యన్యానికుర్యాద్విజోత్తమః ॥

౨ — రెండవనాఁడు హోమాదుల నాచరించి సకలకులబంధువులకును విందుచేసి వారిఁజందన తాంబూల పుష్పాదులచేఁ బరితృప్తులఁగావింపవలయును.

ప్ర — ద్వితీయేహనిసంప్రాప్తే హోమాదీన్యాచరేత్తతః । సమస్తకులబంధూంశ్చ తోషయేద్భోజనాదికైః ॥ పశ్చాత్తాంబూలపుష్పాణి దేయాచ్చందనపూర్వకమ్ ॥

3, *— మూఁడవనాఁడు గోత్రపూజ జరిపింపవలయు. మున్ను కీర్తికన్యా సుదంతులచే మీ పెద్దలు గోత్రపూజ చేయించి స్వేప్సితం

---

* ఆజివనాఁడు చేయవలయు శ్రీకన్యకా పరమేశ్వరీ పూజను గొన్నిప్రదేశములయందు మొదటిదినమే చేసెదరు.

ఋలుం బడసిరి. కాన నిది కర్తవ్యము.

ప్ర -- తృతీయ దివసేకృత్వాం గోత్రపూజావిశాంవరైః। కీర్తిక న్యాసుదస్తింభ్యాం యుష్మాకం పతితౌమహాః॥ సంపూజ్యగోత్రాన్నం ప్రాప్తా లభేరన్ స్వేప్సితానిచ ॥

ర. - నాలవ నాటిరాత్రి మొదటిజామున వధూవరులు నియమముతోఁ గామధేనువుఁ బూజింపవలయు. వైశ్యమాతయగు కామధేనువును ధూపదీపాదిక విధులచేపూజించి. పాలు టెంకాయ చక్కెర ఫలకులు - నెయ్యియుం జేర్చిన మధురమగు శాలిచూర్ణమును నివేదించి యనంతర మా నైవేద్యమును కులబంధువులకు వినియోగింపవలయు. కులస్థులు కాని వారలకు నాపిండినిచ్చినవాఁడు పతితుండగును. ఇట్లు సర్వప్రయత్నములచేతఁ గామధేనువుఁ బూజింప వలయు. పూజింపనిచో నామె కనలి, కులనాశనమును జేయును. లోభమదములచే వివాహ కాలములయందుఁ గామధేనువుఁ బూజింపనివాని బంధువులు త్యజింపవలయు.సురభీపూజచే దంపతులు సుఖింతురు. ఏకకాలమునఁ బెక్కండ్రఁ బరిణయంబగు నపుడు కామధేను పూజను మంత్ర తంత్రములను నగ్నికల్పనమును బలుమఱు నాచరింపవలయును. మున్ను చాక్షుషమన్వంతరము నందలి కృతయుగమున భూలోకముకుఁ బోవునట్లు శివునిచే నాజ్ఞాపింపఁబడిన వైశ్యవరులు జననియగు కామధేనువుం బ్రార్థించి, యామెగర్భమున నొక సంవత్సరము వసించి దక్షిణోత్తర శ్రవణ రంధ్ర మార్గములనుండి సుఖముగాఁబుట్టిరి. వారికి బ్రహ్మాంశసంభూతుఁడును దివ్యదర్శనుఁడు నగు భాస్కర పండితుఁడు జాతకర్మాదిక్రియలఁజేసి, విష్ణ్యుక్తముగా వేదములఁ జదివించుచు శుభముహూర్త కాలమున యథాపూర్వక్రమముగా స్త్రీపురుషులకు వివాహముచేసెను, అంతఁబాశిగ్రహణమాత్రమున మూర్ఛితులైన యా వైశ్యులను భాస్కరాచార్యులు వీక్షించి, మూఁడురాత్రులు నిరాహారుఁడై దీక్షచేసుకొని కామధేనువు బ్రార్థింపగా నామె ప్రత్యక్షమయ్యెను. అప్పుడు వైశ్యులుమూర్ఛ తెలిసి, నిజజననియు - భక్తేష్టదాయినియు - శాలిచూర్ణనివేదితయునగు నాసురభింజూచి, ముదమందిరి. అంత నద్దేవి కరుణాదృ

ష్టితో వారింజూచి, యాయుస్తేజోవృద్ధికరంబగు నీపిండిని భుజియింపుఁ
డన, వారట్లొనర్చి బలిష్టులై మేము చేయవలయునది యెద్ది యాజ్ఞాపిం
పుమన, మీరు వివాహకాలములయందు నన్నారాధించి శ్రేయోవం
తులరగుఁడు నేను మీకు విధించినవిధానమునకు వేఱురీతిగా నొనర్ప
కుఁడు. అని చెప్పి కామధేను వంతర్ధానమును జెందెను కానఁ గామ
ధేనుపూజ వైశ్యోత్తములు చేయవలయు. రాత్రి మూఁడుజాములకు శే
ష హోమ మొనర్పవలయు.

శ్లో॥ చతుర్థదివసే ప్రాప్తే నియమేనవధూవరౌ । కుసాయాః ప్ర
థమేయామే కామధేనుంప్రపూజయేత్ ॥ ధూపదీపైశ్చసంపూజ్య సు
రభిం వైశ్యమాతరమ్ । శాలిచూర్ణంసుమధురం మేలాజ్యఘృతసమన్వితమ్॥
సుగన్ధయుక్తాంక్షీరేణ నారికేళఫలైర్యుతమ్ । నివేద్యతత్స్యైతత్సర్వం బ
న్ధుభ్యోవినివేదయేత్ ॥ బన్ధుభ్యోన్యస్యతద్దత్వా పతితోభవతిధ్రువమ్ ।
ఏవంసర్వప్రయత్నేన కామధేనుంప్రపూజయేత్ ॥ అపూజితావైశ్య
మాతా కుపితానిర్దహేత్కులం । యోవాకోవావివాహేతు లోభేనచ
మదేనచ ॥ నపూజయేత్కామదుహాం సత్యాజ్యోబన్ధుభిస్సదా । వర
వధ్వోప్రశస్యేతే కామధేనోశ్చపూజనే ॥ వధూవరాభ్యాంపూజాంచ
పృథగేవప్రకల్పయేత్ । పృథక్జన్యాంపృథక్ క్షీరం పృథగగ్నింప్రకల్ప
యేత్ ॥ పురాకృతయుగేవత్సా శ్చాత్తుషాభ్యస్తరేమనోః । ఈశ్వరే
ణాహ్యనుజ్ఞాతా భూలోకగమనోత్సుకాః ॥ సమ్ప్రాప్యవైశ్యనార్యస్తు సు
రభిం వైశ్యమాతరం । సంవత్సరంసుసంపూర్ణం సురభేఃకుక్షిసంస్థితాః ॥
జాతాస్సుఖేనరన్ధ్రాభ్యాం దక్షిణోత్తరకర్ణయోః । తాన్సంప్రష్ట్వాభాస్క
రోబ్రహ్మా జాతకర్మాదికాః క్రియాః ॥ కృత్వాయథోక్తవిధినా వేదాన
ధ్యాపయస్తదా । సులగ్నేసుముహూర్తేతు వివాహమకరోత్ప్రభుః ॥
స్త్రీపుంసాంచయథాపూర్వం కృతవాన్దివ్యదర్శనః । పాణిగ్రహణమా
త్రేణ సర్వేనిశ్చితనాభవన్ ॥ దృష్ట్వాసర్వాన్ విశోవిప్ర స్త్రీరాత్రం
దీక్షితోభవేత్ । నిరాహారోధ్యానపరో సురభింప్రార్థయన్తదా ॥ ఆవి
ర్భూతాం కామధేనుం విప్రవర్యైర్ముదమావహాం । స్తుత్వానత్వాతదావ
ప్రే నసుజ్ఞావైశ్యబాలకాః ॥ తదాత్మమాతరం కామధేనుం భక్తప్రి

యావహే౽౽ ॥ శాలిచూర్ణనివేద్యాంతాం దృష్ట్వాభూవన్ ముదాన్వితాః ౹ అథసాహ్యబ్రవీద్దేవీ కృపాదృష్ట్యాప్రతీక్ష్యతాన్ ౹ ఖాదతేమం శాలిచూర్ణ మాయుస్తేజోఽభివర్ధనం ॥ సేత్యుక్వా చతథాకృత్వా బభూవుర్బలసంయుతాః ౹ వైశ్యాః కింకృత్యమస్మాభి రాజ్ఞాపయజగన్మయి ॥ సురభిరువాచ ॥ మామిహాహే౽సమారాధ్య శ్రేయఃపరమవాప్స్యథ ౹ అన్యథా నభవేదేవం యుష్మాకంనిశ్చితంమయా ॥ అన్తర్బభూవసాదేవీ త్యుక్త్వా తుష్టాభవన్విశః ౹ తస్మాత్పూజా కామధేనోః కర్తవ్యా వైశ్యసత్తమైః ౹ రాత్ర్యాస్తృతీయేయామేచ శేషహోమంసమాచరేత్ ॥

గి — ఐదవనాఁడు నావికాపూజ* చేయవలయు ఇది మున్ను శ్రద్ధాభక్తియుక్తులగు కులవృద్ధులచే నాచరింపఁబడినది ఎట్లనగా మున్ను జాహ్నవియందు స్నానముచేయుచు గంధర్వమాయా హతులై యందు మునిఁగి ప్రాణసంశయమును బొందిన బంధువులను వధూవరులు తక్కిన బాంధవులును జూచి భక్తిప్రియయగు నన్నుఁ బ్రార్థించిరి. అప్పుడు నేను వారియభీష్టము నెఱింగి నీటమునింగినవారు బైటవచ్చుటకు గంగాజలమున ధర్మరూపమగు నొకయోడం గల్పించితిని. వైశ్యులా యాధారమును బొంది తీరమునకు వచ్చిరి. ఇట్లువెడలిన బంధువులంజూచి, యావధూవరులు సంతుష్టస్వాంతులై కల్పవనమునకు వెలపలనావను బూజించిరి. § గాన వైశ్యులకు నావికాపూజ కర్తవ్యము అనంతర మరుంధతీపూజ యాచరింపవలయు.

ప్ర — పఞ్చమేదివసేకార్యం నావికాపూజనంవిశైః ౹ వృద్ధైరాచరితంపూర్వం శ్రద్ధాభక్తిసమన్వితైః ॥ జాహ్నవ్యాంస్నాతుకామావైయయురభ్యుదితాశయా, ౹ నిమగ్నాస్సలిలేసర్వే హతాగన్ధర్వమాయయా ॥ దృష్ట్వావధూవరౌబన్ధూన్ ప్రాణసంశయమాగతాన్ ౹ మాంవిశఃప్రార్థయామాసు శ్శ్రైషాభక్తహితాంతదా ॥ తయోరభీష్టం

---

* ఓడబేరమని ప్రశస్తము.

§ ఈ నావికాపూజ నాచరించునపుడు వేడుకార్థము కూరాడు నీరాడు (అనఁగాఁ బాలు గలిసిన నీటిలో గాజును నుంగరమునుంచి వధూవరుల నెత్తమనుట) అను కృత్యమును జరిపెదరు.

జ్ఞాత్వాహం తేషాముత్తారణాయవై । అకల్పయంధర్మరూపాం నావం గఙ్గాజలేతదా ॥ అథారంసముపాగమ్య వితేరుర్వైశ్యపుఙ్గవాః। దృష్ట్వా తాన్నిర్గతాన్ బద్ధాన్ కల్పవృక్షవనాత్పురః ॥ ధర్మస్వరూపాంతౌ నావం దృష్ట్వాసంతుష్టమానసౌ ॥ పూజాంచచక్రతుశ్శీఘ్రం వరవధ్వౌప్రయత్నతః । తత్కర్తవ్యంప్రయత్నేన నావికాపూజనంవిశాం ॥ అరున్ధతీపూజనంచకర్తవ్యంతదనన్తరమ్ ॥

౬ * ఆఱవనాఁడు భూమియందు వాసవీనామముచేఁ బ్రసిద్ధురాలును, పార్వత్యంశ సంభూతురాలును నగు నన్నుఁ గల్పవృక్షస్వరూపమైన ప్రోలిస్తంభ ప్రదేశమున వేదిమధ్యమున హారిద్రాచూర్ణపూర్ణమును ధూపధూమ వాసితంబును నగు కలశరూపముగా భక్తినిరతులై శుచిగా స్నానముచేసి, యలంకరించుకొని యుపవాసముండి సాయంకాలమున నావాహనముచేసి ద్రవ్యానుసారముగా ధూపదీప కుసుమమాల్య నైవేద్యములచేఁ బూజింపవలయు నట్లొనర్చిన సర్వకల్యాణములను బొందుదురు. పేరంటాండ్రను గన్యలను భక్తితోఁ బూజింపవలయును.

ప్ర— షష్ఠేతుదివసేప్రాప్తే వేదిమధ్యేప్రపూజయేత్ । పార్వతీంవాసవీనామ్నా ప్రథితాంధరణీతలే । ప్రోలిస్తమ్భప్రదేశేతు కల్పవృక్షస్వరూపకే । వేదిమధ్యేచసంస్థాప్య యథావిత్తానుసారతః ॥ హారిద్రాచూర్ణసంపూర్ణ కలశంధూపగన్ధిలమ్ ॥ ఆవాహ్యతస్మిన్మాంభక్త్యా శుచిస్నాత్వా స్వలంకృతాః । ఉపోష్యపూజయధ్వంమాం సాయాహ్నేధూపదీపకైః ॥ పుష్పైర్మాల్యైశ్చనైవేద్యై ర్యథావిత్తానుసారతః । పూజయిత్వావిమస్సర్వే సర్వకల్యాణమాప్నుయుః॥ సువాసినీశ్చకన్యాశ్చ పూజ్యాసద్భక్తిసంయుతైః॥

---

* ఈపూజను గొన్నిదేశములయందు మూఁడోనాఁడు జరుపుచున్నారు.